సాహిత్య

# ప్రస్థానం

నవంబరు 2019

వెల రూ. 20

ISSN No:2581-7477

నివాళి



సి. రాఘవాచారి
1939 - 2019

## సామాజిక తత్వవేత్త
# పోతులూరి వీరబ్రహ్మం
## రాష్ట్రస్థాయి సాహిత్య
## సాంస్కృతిక సమ్మేళనం, కర్నూలు








సాహితీస్రవంతి

# కర్నూలులో అక్టోబర్ 12న జరిగిన సామాజిక తత్వవేత్త పోతులూరి వీరబ్రహ్మం రాష్ట్రస్థాయి సాహిత్య, సాంస్కృతిక సమ్మేళనం




ప్రారంభ సభకు అధ్యక్షత వహించి మాట్లాడుతున్న తెలకపల్లి రవి, ముఖ్య అతిధులు

ప్రజాశక్తి బుక్‌హౌస్ ప్రచురించిన 11 పుస్తకాల ఆవిష్కరణ



డా. సంజీవ్‌కుమార్ | కొలకలూరి ఇనాక్ | పత్తి ఓబులయ్య | సి. పుల్లయ్య | చంద్రశేఖర్ కల్కూర | ఎం.వి.ఎస్. శర్మ | విజయశంకర స్వామిజీ



పులికొండ సుబ్బాచారి | కె. ఆనందాచారి | మూల మల్లికార్జున రెడ్డి | జె.ఎస్.ఆర్.కె. శర్మ | ప్రసాదమూర్తి | మధుసూధనాచార్యులు | యండపల్లి పాండురంగాచార్యులు



వి. పోతన్న | హనుమంతరావు | ఎం. ప్రగతి | పి. కుమారస్వామి | జంధ్యాల రఘుబాబు | జె.ఎన్. శేషయ్య | కెంగార మోహన్



వీరప్రసాద్ | బసవరాజు | నాగమణి | గౌరు హరిశ్చంద్రారెడ్డి | పెరికెల రంగస్వామి




పోతులూరి వీరబ్రహ్మం జీవితం, బోధనలపై నృత్య రూపకాల ప్రదర్శన. ప్రజానాట్య మండలి కళాకారుల గేయాలాపన.

సాహిత్య ప్రస్థానం
నవంబర్ 2019

సంపుటి : 18 సంపాదకీయం సంచిక : 11

# వీరబ్రహ్మం వారసత్వం

కర్నూలులో పోతులూరి వీరబ్రహ్మం సమాలోచన కార్యక్రమాలు వూహించిన దానికన్నా జయప్రదంగా జరిగాయి. తన కాలపు పద్ధతులను, పరిమితులనూ, ఆంక్షలనూ, ఆజ్ఞలనూ అధిగమించి ఆలోచించిన, ఆచరించిన దార్శనికుడు వీరబ్రహ్మం జీవితం, బోధనలు ఈనాడు అసహనం తాండవిస్తున్న సమకాలీన భారతంలో ఎంత ప్రాధాన్యత సంతరించుకున్నదీ వక్తలు నొక్కి చెప్పారు. వీరబ్రహ్మం జీవితం రచనలూ పరిణామాలు అన్నిటిపైనా గోష్టులు జరిగాయి. ఎందరో ప్రముఖులూ పరిశోధకులూ మాట్లాడారు. కళా ప్రదర్శనలూ జరిగాయి వాటిపై నివేదిక లోపలుంది. ఈ సందర్భంగా పాల్గొన్న వక్తలలోనూ సభికులలోనూ అనేక భావ స్రవంతులకు చెందిన వారున్నారు. అంత పెద్ద ఎత్తున కార్యక్రమం తలపెట్టినందుకు, వీరబ్రహ్మం చారిత్రక స్థానంపై కొత్త కాంతులు ప్రసరించినందుకు అభినందించారు. ఆనందించారు. వాస్తవానికి అలాటివారెందరో చేయి వేయడం వల్లనే ఈ కార్యక్రమం ఇంతగా జయప్రదమైంది. ప్రజాశక్తి బుక్‌హౌస్ ప్రచురించిన పదకొండు పుస్తకాలను వేదికపై ఆవిష్కరించడం నూతనోత్సాహమిచ్చింది. ఈ పుస్తకాలు వీరబ్రహ్మంపై పరిశోధకుల వివిధ దృష్టి కోణాలకు అద్దం పట్టాయి. అయితే తర్వాత దశలో వాటిలో ఒక్క పుస్తకంలో ఒక్క అంశంతో ఏకీభవించని మిత్రులు కొందరు వివాదం లేవదీయడం దురదృష్టకరం. వివాదం లేవనెత్తిన వారిలో కొందరు ఆ పుస్తక రచయిత్రిపై అసహనంతో బెదిరింపులకు దిగడం మరింత అభ్యంతరకరం. సమాజంలోనూ అధ్యయనాలలోనూ భిన్నాభిప్రాయాలుండటం సహజం. వాటిని గౌరవించడానికి కూడా సదా సిద్ధంగా వుంటాం. ప్రజాశక్తి బుక్‌హౌస్ వారు కూడా ఆ మేరకు ప్రకటన చేశారు. కొన్ని శక్తులు దేశంలో వ్యాపింప చేస్తున్న అసహన విధానాలను ప్రజాస్వామిక వాదులు వ్యతిరేకిస్తున్నారు. భిన్నాభిప్రాయాలను గౌరవించడం చర్చించడం తప్ప అసలు ఈ బృహత్తర కార్యక్రమం లక్ష్యమే దెబ్బతినేలా వ్యవహరించడం దారి తప్పిస్తుంది. వీరబ్రహ్మం వారసత్వం ఎంతో విశాల భావమే. సాహితీ స్రవంతి, ప్రజాశక్తి బుక్‌హౌస్‌తో కలసి వేమన, కుసుమ ధర్మన్న, గురజాడ అప్పారావు, కందుకూరి వీరేశలింగం ఇలా మహామహుల సంస్మరణలు నిర్వహించడంలో ఆశిస్తున్నదీ అదే. ఇకనైనా సంబంధిత వ్యక్తులూ సంస్థలూ, వేదికలు సంయమనంతో వ్యవహరిస్తారని కోరుకుందాం. ఇలాటి మరిన్ని మంచి కార్యక్రమాల కోసం ముందడుగు వేద్దాం.

◆



రచనలు, చందాలు, విరాళాలు, మనీ ఆర్డర్లు, చెక్కులు, డిడిలు పంపవలసిన చిరునామా:
సాహిత్య ప్రస్థానం, 27-30-4, ఎం.బి. విజ్ఞానకేంద్రం, 3వ అంతస్తు, ఆకులవారి వీధి, గవర్నరుపేట, విజయవాడ - 520002, ఫోన్: 0866-2577248, సెల్: 9490099059
ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com, www.prasthanam.com
ISSN No: 2581 - 7477
సాహిత్య ప్రస్థానం మాసపత్రికకు చందా కట్టండి! తెలుగు భాషా, సాహిత్య కృషిలో భాగస్వాములు కండి!!
1 సంవత్సర చందా రూ. 240/- ◆ 5 సంవత్సరాల చందా రూ.1000/
◆ 10 సంవత్సరాల చందా రూ. 2000/-
Bank A/c Details: A/c Name: PRASTHANAM, SBI, Governorpet, Vijayawada
A/c No. 52001500585, IFSC: SBIN0020343
చెక్కులు, డిడిలపై prasthanam అని రాయగలరు.

## కథలు



## కవితలు



## వ్యాసాలు



కవిత

# మళ్లీ మనం కలవ లేకపోవచ్చు !


- ఏ. భైరవ స్వర్ణకుమార్
8374034514


మొదటిసారి మనం
కలుసుకున్నప్పుడు
మనకు కులం లేదు మతం లేదు
కులమతాల గోడల్ని
బడి గోడలు కూల్చివేశాయి !
మొదటిసారి మనం
మాట్లాడుకున్నప్పుడు

మనకు గొప్ప తెలియదు పేద తెలియదు
పేద గొప్పల తారతమ్యాలు
పుస్తకం చేతిలో ఓడిపోయాయి !

ఇప్పుడు
బడి శిథిలమైయ్యింది
పుస్తకం మూగపోయింది



ఇప్పుడు మన చుట్టూ
ఎత్తైన కులం గోడలు !
కటువైన మతం కంచెలు !
పేదరికం చీత్కారాలు అవమానాలు!
గొప్పతనం అహంకారాలు ఆడంబరాలు !
ఇక మనం మళ్లీ కలవ లేకపోవచ్చు ! ♦

కథ




# మానవత్వం

- విజయ్
9490122229

థాయ్‌ల్యాండ్ సరిహద్దు ప్రాంతం .

మయన్మార్‌కు కూతవేటు దూరం.

అదొక చిన్న పల్లె.

టాంగ్ ఆ పల్లెలో ఒక వ్యవసాయకూలీ. టాంగ్ తమ్ముడు తమ్ముని భార్య ఆకస్మికంగా ప్రమాదంలో మరణించారు. తమ్ముని ఒక్కగానొక్క కుమారుడు పదేళ్ళ చాంగ్‌ను చూసే బాధ్యత తనపై పడింది.

తనకేమో పెళ్లి కాలేదు. తను ఆ పిల్లవాన్ని ఎలా సాకడం ? ఆలోచించగా ఆలోచించగా ఒక ఆలోచన మదిలో మెరిసింది. దగ్గరలో ఉన్న బౌద్ధ ఆరామాల్లో చేర్పిస్తే వాళ్ళే చూసుకుంటారు ఆ పిల్లవాన్ని. తక్షణమే బౌద్ధారామం వెళ్లి బౌద్ధ గురువుతో తన సమస్యను విన్నవించుకున్నాడు. బౌద్ధారామాలకు అనుబంధంగా ఒక పాఠశాల ఉంటుంది. ఆ పాఠశాలలో అనాధ బాలలకు, ఆర్థికంగా వెనుకబడినవారికి ఉచితంగా చదివిస్తారు. అక్కడే ఉండి బౌద్ధ ధర్మాల కనుగుణంగా ప్రాణాయామం, విపస్యనాధ్యానం, కరాటే, కుంగ్‌ఫూ వంటివి నేర్పుతారు, పిల్లల్లో మానసిక స్థైర్యం నేర్పుతారు. మానసిక వికాసం పెంచుతారు చాంగ్‌ను దగ్గరకు తీసుకొని ' 'ఆరామంలో ఉంటావా " ? అడిగాడు బౌద్ధ గురువు.

సరేనంటూ తలూపినాడు చాంగ్. చేరే రోజు భవిష్యత్తులో తానొక గొప్ప సాహసకార్యం చేస్తానని ఊహించలేదు ఆ అబ్బాయి.

♦♦♦

నిశ్చింతగా వెళ్లిపోయాడు టాంగ్. చాంగ్ బాల బౌద్ధ భిక్షువుగా మారిపోయాడు. విపస్యన ధ్యానం, అష్టాంగ మార్గాలు నేర్చుకున్నాడు. రోజూ వ్యాయామం కూడా చేస్తున్నాడు. ఫుట్‌బాల్, హాకీ లాంటి క్రీడలు నేర్చుకుంటున్నాడు. ఎంతో క్రమశిక్షణతో ధ్యానం చేయడం, ఆరామాన్ని శుభ్రం చేయడం, పాఠశాలలో చదువుకోవడం, ఆటలు, పాటలు నేర్చుకోవడం ఇదీ రోజూవారి దినచర్య. బౌద్ధ ధర్మాలు క్షుణ్ణంగా నేర్చుకుంటున్నాడు. పదేళ్ళు గడిచిపోయాయి. ఇరవై ఏళ్ళ ప్రాయంలోకి అడుగుపెట్టాడు చాంగ్. ఇరవై ఏళ్ళ వయసొచ్చాక బౌద్ధారామం, పాఠశాల నిబంధనల ప్రకారం పూర్తి బౌద్ధభిక్షువుగా మారాలా లేక గృహస్థ ధర్మం పాటించాలా అనేది విద్యార్థే స్వయంగా నిర్ణయించుకోవచ్చు. చాంగ్‌కు సాహసాలు చేయాలన్న తలంపు ఉంది, ఉత్సాహం ఉంది. అందువలన తాను గృహస్థున్నవుతానని చెప్పి బయటకు వచ్చాడు.

కాలేజీలో నేర్చుకున్న ఫుట్‌బాల్ బయటకు వచ్చాక తన జీవన భృతికి తోడ్పడింది. దగ్గరలో కాలేజీ విద్యార్థులందరికీ

పోటీ పెట్టి ఎన్నుకోబడ్డ వైల్డ్ బోర్స్ ఫుట్‌బాల్ టీంకు కోచ్ కాంతావాంగ్. తన టీంను ఎలాగైనా ఒలింపిక్స్ పోటీలో పాల్గొనేలా చేయాలని తీవ్రంగా ప్రయత్నిస్తున్నాడు. అప్పుడు కనిపించాడు చాంగ్.

"చాంగ్, నీకు మంచి దారుఢ్యం ఉంది. ఫుట్‌బాల్ బాగా ఆడుతున్నావు. మా టీంకు రెగ్యులర్‌గా తర్ఫీదు ఇస్తావా ? నేను కొన్నాళ్లు అబ్రాడ్ వెళుతున్నాను" అడిగాడు కాంతావాంగ్.

చాంగ్ సరేనన్నాడు.

అప్పటినుంచి చాంగ్ టీంకు శిక్షణ ఇవ్వడం ప్రారంభించాడు. టీం సభ్యులు మిక్, డామ్, పాంగ్, మార్క్, టర్న్, ఆడన్, నోటౌ, నిక్, టీ, నైట్, టైటాన్ కలిసి12 మంది ఉన్నారు. వీళ్ళలో టైటాన్ చిన్నవాడు. అతని వయస్సు 11 సంవత్సరాలు, తక్కిన వారంతా 16, 17 వయసున్నవారు. చాంగ్ అందరితో కలుపుగోలుగా ఉంటూ, కోచ్‌గా కన్నా స్నేహితునిగా ఉండేవాడు. టీం సభ్యులను క్రమశిక్షణగా ఉంచేవాడు. ఉదయాన్నే లేచి ప్రాణాయామం చేయడం, ధ్యానం చేయడం, వ్యాయామం చేయడం అందరికి నేర్పించాడు. గోల్‌కీపర్‌కు ఉండాల్సిన ఏకాగ్రత, చురుకుదనం నేర్పేవాడు. సభ్యుల శక్తినిబట్టి ఆట ఆడే విధానం నేర్పేవాడు. అతనంటే అందరికి ఇష్టం, నమ్మకం ఏర్పడింది.

ఒక రోజు నైట్ తన బర్త్‌డే పార్టీ ఇస్తానన్నాడు. నైట్ బర్త్‌డేను ఎలా జరపాలో టీం కోచ్ చాంగ్ నిర్ణయించాడు.

వారంతా తామ్‌లాంగ్ గుహదగ్గరకు రావాలని చెప్పినాడు. వచ్చేటప్పుడు ఇంట్లో మీకు నచ్చిన స్పెషల్ చేసుకురమ్మన్నాడు. ఆ గుహ చియాంగ్ రాయ్ పట్టణానికి నాలుగు కిలోమీటర్ల దూరంలో ఉంది. సైకిళ్ళపై అందరూ ఉదయాన్నే ప్రయాణమయ్యారు.

ఆ గుహ ఎక్కువగా ప్రాచుర్యం పొందలేదు దేశంలో. కాని ఆ పట్టణం వాళ్లు తరచూ దానిని సందర్శిస్తుంటారు. ఆ గుహ పొడవు పది కిలోమీటర్లు ఉంటుంది. అయితే దాని లోపలికి వెళ్లి పూర్తిగా చూసిన వాళ్లెవరు లేరు ఒక్క చాంగ్ తప్ప. దాని ముందు భాగం విశాలంగా ఉంటుంది. లోపలికి వెళ్లితే పెద్ద హాలులాగా ఉంటుంది. ఏదైనా పిక్‌నిక్‌లు, ఫంక్షన్‌లు చేసుకొనే విధంగా అందంగా ఉంటుంది. లోపలికి వెళ్లే కొద్దీ గుహ గదులు, గదులుగా ఉంటుంది. అక్కడక్కడ ఇరుకుగా ఉంటుంది. గుహ మొదట్లో కాబట్టి పగలు బాగా వెలుతురు ప్రసరిస్తూ ఉంటుంది. గుహ బయట పచ్చిక ఉంటుంది. పచ్చని చెట్లు, ఆ చెట్లపై కోయిల కుహు కుహు రాగాలు సందర్శకులకు ఎంతో ఆనందానిస్తుంటాయి.

అందరూ తామ్‌లాంగ్ గుహ దగ్గరకు సైకిళ్ళపై వస్తున్నప్పుడు పొలాల్లో రైతులు ఎక్కడికని అడిగారు. గుహ దగ్గరకు పోతున్నామని చెప్పినాడు టైటాన్.

దాదాపు పదవుతోంది సమయం. అక్కడక్కడా ఆకాశంలో మబ్బులు వాతావరణం ఆహ్లాదంగా వుంది. సూర్యుడు అప్పుడప్పుడు మబ్బుల చాటుకు వెళుతున్నాడు. మట్టి వాసన వస్తోంది. ఎక్కడో వాన పడుతున్నట్లుంది.

'భలే వుందిరా క్లయిమేట్' అన్నాడు నైట్, తన బర్త్‌డే పార్టీని ఊహించుకుంటూ.

'అద్భుతం ' అన్నారెవరో .

సైకిళ్ళను గుహ బయట చెట్టు కింద పెట్టినారు. అందరూ గుహలోపలికి వెళ్లినారు. ప్లాస్టిక్ బ్లాంకెట్‌ను కింద పరిచారు. బయట తుంపర మొదలైంది. అప్పటికి సమయం మధ్యాహ్నం 12 గంటలు కావస్తోంది.

కేక్ కట్ చేస్తున్నారు. అంతలో ఒక రైతు రొప్పుకుంటూ వచ్చినాడు. ''తుఫాను వచ్చే అవకాశం ఉందంట. రెండురోజులు పాటు వర్షాలు ఉంటాయట, తొందరగా బయటకు వచ్చేయండి మీరు' ' అంటూ గుహ బయట నుంచి అరిచాడతను.

'నైట్ వెళ్లి ఆయనకు కేకు ముక్క ఇస్తూ మా పార్టీ ఒక గంటలో అయిపోతుంది. వస్తాంలే పెద్దయ్యా ' అన్నాడు. వచ్చిన రైతు గబగబా వెళ్లిపోయాడు.

'హ్యాపీ బర్త్‌డే టూయూ ' అంటున్నారందరూ.

కేక్ కట్ చేసి ఆనందంగా తింటున్నారు. కొందరు కూల్‌డ్రింక్స్ తెచ్చినారు. అందరికీ గ్లాసులో పోసి ఇస్తున్నాడు అందరి కంటే చిన్నవాడు టైటాన్.

ఇంతలో వర్షం పెరిగింది. నీళ్ళు లోపలికి రావడం మొదలైంది.

'వెళ్లిపోదాం రండి అన్నాడు' చాంగ్

గుహ ముఖ ద్వారం దగ్గరకు వచ్చారందరూ. అప్పటికే వర్షం జోరందుకుంది. కుండపోతగా భారీ వర్షం కురుస్తోంది. కొంచెం సేపు ఆగిచూద్దామని అలాగే నిలిచుండిపోయారు. నీళ్లు వరదలా ఎక్కువగా రావడంతో అక్కడ నిలువలేక

పోయారు. అందరూ గుహలోపలికి పోయారు. పోతున్న కొద్దీ నీళ్ళు తరుముతున్నట్లు వారి వెంట రాసాగాయి. మోకాలు లోతులోకి వచ్చాయి. వాళ్ళంతా నాలుగడుగుల ఎత్తు ఉన్నవాళ్లే. థాయిలాండ్‌లో ఐదు అడుగుల ఎత్తే ఉంటారు.

చాంగ్ అందరికి ధైర్యం చెప్పినాడు. ' మీరందరూ భయపడకండి... మనం సురక్షితంగా ఉన్నట్లు అందరూ మీ తల్లిదండ్రులకు ఫోన్ చేసి చెప్పండి ' అన్నాడు.

ఎవరి ఫోన్‌కు లైన్స్ అందడం లేదు. ఆఖరుకు టైటాన్‌కు అందింది. కానీ వెంటనే కట్ అయింది. ఏం చేయాలో తోచలేదు. ' వుయ్ ఆర్ ఎట్ తామ్‌లాంగ్ కేవ్ మమ్మీ' అంటూ మెసేజ్ పెట్టాడు.

టైం ఎంతయిందో తెలీదు. వరద ఉధృతంగా ప్రవహిస్తోంది గుహలోకి. 'గుహలన్నీ ఇలాగే తయారయ్యి ఉంటాయేమో' అన్నాడు నైట్. ' నీళ్ళతో ఒరుసుకుని రాళ్ళ పగుల్లోంచి పోయింటాయి. సున్నపురాళ్ళు బాగా కరిగి పోతాయి. అలా పెద్ద బండరాళ్ళు కరిగి పెద్ద గుహ ఏర్పడి పోయి ఉంటుంది ' చెప్పినాడు చాంగ్.

చాంగ్ మెల్లగా అడుగులువేస్తూ లోపలికి పోతున్నాడు. వెనుక నుంచి టీం సభ్యులు సెల్ టార్చిలైట్లు వేస్తున్నారు. గుహను పూర్తిగా ఒకసారి చూడాలన్న వారి కోరిక ఈ విధంగా నెరవేరుతోంది. సాహసం అతని ఊపిరి. బుద్ధుడిచ్చిన విపాసన ధ్యానం చాంగ్‌కి ప్రాణం. శిక్షణా కాలం నుండి ఏకాగ్రతగా ఎలా ఉండాలో, మిన్నువిరిగి పడ్డా ప్రశాంతంగా ఎలా వుండాలో అతను నేర్చుకున్నాడు. ఆహారం లేకుండానే ధృవాలలో ఎలుగుబంట్లు ఆరు నెలల పాటు నిద్రలో ఉంటాయి. అలాగే బౌద్ధ బిక్షువులు అతి తక్కువ ఆహారంతో ఎలా జీవించాలో నేర్చుకుంటారు. విపాసనా ధ్యానం వారికి కష్టాలను ఎదుర్కొనే ధైర్యాన్నిస్తుంది.

ఇప్పుడు చాంగ్ తన ఊపిరిబిగబెట్టి ముందుకు వెళుతున్నాడు. టీం సభ్యులు పన్నెండు మందికి తమ కోచ్, తను పక్కనే ఉండడం వారికి ధైర్యాన్నిస్తోంది.

ఒక్కొక్కరుగా అందరూ అనుసరిస్తున్నారు. ముందుగా చాంగ్ టైటాన్ వేలుపట్టుకొని ముందుకు నడిపిస్తున్నాడు.

గుహ వంపులు వంపులుతో ఉంది. గదులు గదులుగా ఉంది. ఒక్కో గది దాటుకుంటూ ముందుకు వెళుతున్నారు. ఘాటైన గబ్బిలాల కంపు కొడుతోంది. లోపలికి పోయే కొద్దీ చిక్కటి చీకటి. అక్కడ వాళ్ల మాటల శబ్ధాలు తప్ప మరేమీ వినిపించడంలేదు.

మూడో గది దాటినారు. నాలుగో గది లోపలకి పోవడానికి చాలా ఇరుకైన దారి. వారికి సెల్ టార్చిలే ఆధారం. సెల్ టార్చి వెలుగులో ఆ ఇరుకైన దారిలో చాంగ్ ప్రవేశించాడు. నేరుగా పోవడానికి వీలులేకుండా ఉంది. అక్కడే ఆగిపోకుండా తరుముకు వస్తున్న నీళ్ళు. చాంగ్ తన బలాన్ని ఉపయోగించాడు. రాయిలోంచి ఒక పెళ్ల కదిలింది. శరీరాన్ని పక్కకు త్రిప్పిలోనికి దూరాడు. అందరూ సన్నగా ఉన్న వాళ్లే కావడంతో ఒక్కొక్కరు దానిలోంచి అవతలికి వెళ్లిపోయినారు. అంతటి విపత్కర పరిస్థితిలో కూడా చాంగ్ ధైర్యం చెపుతూనే వున్నాడు. తమ దగ్గరున్న ఆహారాన్ని జాగ్రత్తగా తమతో తీసుకురమ్మన్నాడు.

నాలుగో గదిలో వాళ్ళకు ఒక చిన్న గుట్టలాంటిది కనిపించింది. దాని మీద ఎక్కి కూర్చోమన్నాడు చాంగ్. “వర్షం తగ్గగానే నీళ్ళు తగ్గిపోతాయి. మనం మళ్లీ వెళ్లిపోవాలి. ఈ రోజు మనం ఎలాగో ఒకలాగ ఇక్కడే వుండాలి. నిద్రవస్తే మెల్లగా ఇక్కడే పడుకోండి. మీరేమీ భయపడకండి, నేనున్నాను” అని చెపుతూ ధైర్యాన్ని నింపుతున్నాడు వారిలో చాంగ్. టైటాన్ ఒక్కడే ఏడుస్తున్నాడు. కాని అందరూ ఒకరినొకరు ధైర్యం చెప్పుకోవడంతో టైటాన్ కూడా ఏడుపు మానినాడు.

ఆ రోజు కాళరాత్రి. ఆకలి కూడా కాని రాత్రి. భయాందోళనలతో మనసంతా నిండిన రాత్రి. మానవ ప్రపంచానికి దూరంగా ఒక గుహలో కటిక చీకట్లో పదమూడు మంది అక్కడ ఉన్నారని ఎవరికీ తెలీదు. గూగుల్‌కు అందని చోటు. ఏ నెట్‌వర్క్ చొరబడని చోటు.

శ్మశాన నిశ్శబ్దంలో అప్పుడప్పుడు నీళ్ళు కారుతున్న చప్పుడు, నీళ్లు పారుతున్న చప్పుడు. సున్నం వాసన, సున్నపు రాళ్లు కరిగిన వాసన.

ఒక నిశీధి (దీర్ఘంగా తను నిద్రించే చోట) కొన్ని ఉచ్ఛ్వాస నిశ్వాసలను తనలోకి ఒంపుకొని వేకువ కోసం నిరీక్షిస్తూ ఉంది. చాంగ్ తాను విపాసనలో నేర్చుకున్న ధ్యాన మార్గాన్ని ఒక్కొక్కటే అక్కడ తనలోకి ఆవాహన చేసుకుంటున్నాడు.

అందరూ తనను నమ్మివచ్చారు. తన ప్రాణాలు పోయినా వారిని మాత్రం తను రక్షించాలి. అదే తన ధర్మం. తనకు నేర్పిన ధర్మం. బౌద్ధం చెప్పిన మార్గం. వాళ్ళను బతికించాలంటే వాళ్ళకు ఆహారాన్ని మితంగా ఎలా తీసుకోవాలో నేర్పాలి. నీళ్ళను పొదుపుగా ఎలా వాడుకోవాలో చెప్పాలి. బాహ్య ప్రపంచంలోకి తొంగిచూసే దాకా చీకటికి ఎలా అలవాటు

పడాలో నేర్పాలి. మరుసటి రోజు నుంచి అదే పనిలో పడినాడు.

'మిత్రులారా మీరంతా కళ్ళు మూసుకొని ధ్యానం చేయడం నేర్చుకోండి. ధ్యానం చేయాలంటే ఏదో ఒక దాని మీద కేంద్రీకరించడం కాదు. చుట్టూ ఉన్న పరిస్థితులను మీరు తెలుసుకుంటూ ధ్యానం చేయాలి. ధ్యానానికి మొదటి మెట్టు నిన్నటి రోజును ప్రతి గంట, ప్రతి నిమిషం ఏంచేసినామో గుర్తుకు తెచ్చుకుంటూ రండి. నిన్న మొన్న అవతల మొన్న అలా వెనుకటి రోజులను ఒకసారి ప్రతి నిమిషాన్ని తలుచుకుంటూ ఉండండి' అంటూ ధ్యానంలో మొదటి మెట్టును నేర్పినాడు చాంగ్. తాగడానికి ఉన్న నీళ్ళన్నీ అయిపోసాగాయి. చుట్టూ చీకటిలో నీరు పారే శబ్ధం వినిపిస్తోంది. అక్కడ తన దగ్గరున్న బాటిల్‌తో నీటి ధారలను పట్టుకొని తాగడం నేర్పించాడు. రోజుల్ని వెళ్ళబుచ్చడం కాదు, చీకట్లో భయాన్ని పారదోలే వెలుగును మనసులోకి ప్రవేశింపచేసినాడు.

♦♦♦

సాయంత్రానికి ఇంటికి వచ్చే టైటాన్ రాకపోయే సరికి టైటాన్ తల్లి హామ్ ఆందోళన చెందింది. వెంటనే పోలీసు స్టేషన్‌కు ఫోన్ చేసి చెప్పింది. వాళ్లు వివరాలు రాసుకున్నారు.

ఉదయం నుంచి తమ ఎంక్వైరీ మొదలుపెట్టారు.

చాంగ్ ఎక్కడ ఉంటాడు ? ఎక్కడికి వెళుతుంటాడు ? మొదలైన విషయాలు సేకరించారు. కొంత మంది రైతు కుటుంబాల వారు కొంత మంది పిల్లలు సైకిళ్లపై గుహ వైపు వెళ్ళినట్లు చెప్పినారు.

పోలీసులు తామ్‌లాంగ్ గుహ దగ్గర 13 సైకిళ్ళను కనుగొన్నారు. ఇక్కడే ఎక్కడో వున్నారని నిర్ధారించారు. ఒక పోలీసు అధికారి గుహలోపలికి పోయినారని భావించి గుహలోకి పోయి చూసినాడు అక్కడ కొన్ని కేకు డబ్బాలు, కూల్‌డ్రింక్స్ బాటిల్లు నీళ్లలో తేలడం చూసి వీరంతా గుహలో ఇరుక్కుపోయారని నిర్ధారణకొచ్చాడు.

వర్షం విపరీతంగా కురుస్తున్నా తమ ధర్మం వీడలేదు పోలీసులు. ప్రభుత్వానికి మెసేజ్ పంపినారు. విద్యార్థుల్ని సురక్షితంగా తీసుకురావాలని అధికారులు ఆదేశాలిచ్చినారు.

థారంగ్ సారధ్యంలో రక్షణ బృందం రంగంలోకి దిగింది. థారంగ్ 90 మంది డైవర్లను రప్పించాడు. గుహలోకి చొరబడాలంటే నీళ్ళు అధికంగా ఉన్నాయి. మొట్టమొదట నీళ్లను బయటకు పంపు చేయాలని నిర్ణయించారు. ఒక గంటలో పదహారు లక్షల లీటర్లు కొట్టే పంపులు ఫిట్ చేసినారు.

లోపల నీటి మట్టం పెరిగే కొద్దీ ఆక్సిజన్ స్థాయి తగ్గిపోతుందని, తగ్గేకొద్దీ వారందరు హైపోక్సియాకు గురవుతారని డాక్టర్లు చెప్పినారు.

అన్ని టెలివిజన్ ఛానల్లు ఈ వార్తను లైవ్ ప్రసారం చేస్తున్నాయి. ప్రజల్లో ఉత్కంఠ మొదలైంది.

తొంభై మంది డైవర్లు రంగంలోకి దిగినారు. ఆక్సిజన్ సిలిండర్లు తీసుకొని గుహలోకి ఈదుకుంటూ వెళ్లిపోయినారు. నేవీ కమాండర్లు మోహరించారు. బ్రిటన్, అమెరికా, చైనా, ఇండియా దేశాల నుండి సహాయం కోసం నైపుణ్యంగల వ్యక్తులు వచ్చారు.

నేవీ అధికారి కునాల్ తన తొలి అడుగు వేసినాడు. ఆక్సిజన్ సిలిండర్లు భుజాన వేసుకొని గుహలోని నాలుగు గదులు దాటి చాంగ్ బృందం దగ్గరికి చేరుకున్నాడు. వాళ్ళంతా బాగున్నట్లు మెసేజ్ పంపినాడు. వచ్చేటప్పుడు సిలిండర్‌లో ఆక్సిజన్ అయిపోయింది. తన సహాయ పోరాటంలో అసువులు కోల్పోయాడు.

డైవర్లు ఆక్సిజన్ సిలిండర్లు మోసుకుంటూ పిల్లల కోసం అదనంగా సిలిండర్లు, లైఫ్ జాకెట్లు తీసుకెళ్లారు. గుహలో రెండు గదులుదాటాక, మూడో గదికి దారులు రెండు ఉన్నాయి. అవి 'టి' ఆకారంలో వున్నాయి. మెల్లగా అవి దాటుకొని టీం సభ్యుల దగ్గరకు చేరుకున్నారు. డైవర్లు వెలుతురు వచ్చే బ్యాటరీ లైట్లు తలకు కట్టుకున్నారు.

ఇప్పుడక్కడ చీకటి బద్దలైంది. టీం సభ్యుల కళ్లల్లో ఆనందం మెరిసింది.

అబ్బాయిలు భయపడకుండా డైవర్ల నడముకు అబ్బాయిల నడుము నుండి తాడుతో కట్టివేసినారు. వారు నెర్వస్‌గా ఫీలవకుండా వారికి ఇంజక్షన్లు ఇచ్చినారు. ఒక్కొక్కరిని మెల్లగా గదులు దాటుకుంటూ తీసుకువచ్చారు.

అందరూ చురుకుగానే ఉన్నారు. ఒక్క చాంగ్ తప్ప. వెలుగురు దూరని చీకటి గుహలో పదమూడు రోజులు టీం సభ్యులను కాపాడిన చాంగ్ చివరలో వచ్చినాడు. అబ్బాయిల కన్నా అతనే నీరసపడి వున్నాడు. వారందరికి బార్లీ గంజి తాగించారు. అందరినీ చియాంగ్ రాయ్ ఆసుపత్రికి పంపిచారు. డాక్టర్ దౌనా వారికి చికిత్స చేయడం ప్రారంభించాడు.

చాంగ్‌కు అందరూ అభినందనలు చెబుతున్నారు.

ప్రపంచం కన్నార్పకుండా చూస్తోంది. ♦

# పురస్కారాలు

## సాహిత్య ప్రస్థానం అక్టోబర్ 2019పురస్కారాలు

**ఆమె కవిత్వం... భావోద్వేగాల సమ్మిళితం**
వ్యాసం: రూ.500/-
రచయిత : గంగవరపు సునీత

**మల్లక్క కయ్యి**
కథకు : రూ. 500/-
రచయిత : కాశీవరపు వెంకటసుబ్బయ్య

■■■

కథకు డా॥ ఎద్దుల సిద్ధారెడ్డి స్మారక పురస్కారం,
వ్యాసానికి కర్లపాలెం రుక్మిణమ్మ పురస్కారం చెక్కులు ఈ రచయితలకు అందుతాయి

■■■

పాఠకులు తాము చదివిన కవితలు, కథలు, వ్యాసాలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. సీనియర్, ప్రసిద్ధ రచయితల రచనలు కాక ఔత్సాహికులను, ఇటీవల రాస్తున్నవారిని ప్రోత్సహించడమే ఈ పురస్కారాల ఉద్దేశ్యంగా గ్రహించగలరు. తగిన రచనలు లేనప్పుడు పురస్కారాలు ప్రకటించబడవు.
**- ఎడిటర్**

---

**కవిత**

## పుణ్యభూమి

- పద్మావతి రాంభక్త
9966307777

నా దేశం పుణ్యభూమి
ఎందరో అమరవీరుల త్యాగాల
పునాదులపై
పటిష్టంగా నిలబడి
స్వేచ్ఛావాయువులు
పీల్చుకోవాలనే అనుకుంది
ఎన్నో బానిసత్వపు
ప్రసవ వేదనల అనంతరం
పుట్టిన
స్వాతంత్ర్య పాపాయిని
తనివితీరా చూసి
మురిసీ మురవక ముందే
శరీరం నిండా
మొలుచుకొస్తున్న
వింత వ్యాధులను చూసి
కన్నీళ్ళు పెట్టుకుంటోంది
డెబ్బై రెండు సంవత్సరాలుగా
అందమైన కలలను
కొంగున మూటగట్టుకుని
ప్రశాంత తీరాలను చేరాలనే
ఆరాటపడుతూనే ఉంది
తన నోటికి అన్నంముద్దలై సాకే
రైతుబిడ్డల ఆత్మహత్యల హాహాకారాలు
చెవులను తూట్లు పొడుస్తుంటే
తాళలేక తల్లడిల్లి పోతోంది
పాపం పిచ్చితల్లి కదా
తన శరీరాన్ని చీలుస్తూ
కొత్త కొత్త గోడలు నిర్మిస్తున్న వారినీ
తన ఆకుపచ్చని ఆయువు తీస్తూ
ముక్కలు చేసి
అమ్మకానికి పెడుతున్న వారిని
క్షమయా ధరిత్రియై క్షమిస్తూనే ఉంది
నల్లని అవినీతి మేఘం
అంతటా కమ్ముకుని
తన గదుల నిండా
చీకటిని విస్తరిస్తుంటే
దు:ఖాన్ని అదిమిపెట్టి
వెలుగు కిరణపు నాట్లేసే
సూర్యుల కోసం
తూర్పువైపు దృష్టి సారిస్తోంది
సుదూరాన అగుపించే
వసంతాన్ని స్వప్నిస్తూ
శిశిర గాయాలను



ఎన్నాళ్ళుగానో ఒంటరిగానే
ఓదార్చుకుంటోంది
మూడు రంగుల చీరను
ముచ్చటగా చుట్టుకుని
నిండుగా రెపరెపలాడుతూ
నింగి వైపే చూపులు నిలిపి
ఆశల విత్తులు నాటుతోంది
ఆ అమాయకపు తల్లి
కలలు పండేదెప్పుడో
ఆనందంతో
ఆమె కడుపు నిండేదెప్పుడో ♦

# అనుభూతి స్రవంతిలో ఇస్మాయిల్



డా॥ పాపినేని శివశంకర్
8500884400

తెలుగు సాహిత్య రంగంలో 1960 దశాబ్దిలో ప్రవేశించింది అనుభూతి వాదం. అప్పటికి అభ్యుదయ సాహిత్యం ఉద్యమ స్థాయిలో విస్తరించింది. అభ్యుదయ సాహిత్యోద్యమం సామాజిక స్వభావం, రాజకీయ లక్ష్యం కలిగినట్టిది. సమాజానికి, సాహిత్యానికి గతితార్కిక సంబంధం ఉంటుందని, సామాజిక పరిణామాల ప్రభావం సాహిత్యంపై అనివార్యంగా పడుతుందని, కవులు లేదా రచయితలు పీడిత ప్రజల పక్షాన నిలిచి, భూస్వామ్య, పెట్టుబడిదారీ వ్యవస్థలను వ్యతిరేకిస్తూ సమసమాజం వైపు తమ చూపు సారించాలనీ ఆ సాహిత్యోద్యమం ప్రబలంగా ప్రతిపాదిస్తుంది. ఈ వాదానికి మార్క్సిజం ఇరుసు లాంటిది. సాహిత్యం సమాజంలోని పతితుల, భ్రష్టుల పక్షం వహించి దోపిడి శక్తుల్ని ఎదుర్కోవాలని అభ్యుదయ వాదం భావిస్తుంది. తదనుగుణంగా అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడింది. దానికొక రాజకీయ భావజాలం, వామపక్ష పార్టీల అనుబంధం ఏర్పడింది. కొండొకచో అభ్యుదయ కవిత్వంలో రాజకీయాంశ కాస్త శ్రుతి మించింది. ఆ తర్వాత 1970వ దశాబ్దంలో ఏర్పడిన విప్లవ సాహిత్యోద్యమంలో ఈ రాజకీయాంశ ఇంకా ఎక్కువైంది. వర్గ శత్రువుల్ని విమర్శిస్తూ, పోరాట మార్గాన్ని సమర్థిస్తూ విరివిగా కవిత్వం వెలువడింది. ఈ విధమైన కవిత్వం ప్రధానంగా వస్తుగతం **(objective)**. ఇందులో వ్యక్తిగతానుభూతులకు స్థానం తక్కువ.

ఇటువంటి వాతావరణంలో వెలువడిన కవిత్వమే అనుభూతి కవిత్వం. ఇది అభ్యుదయ, విప్లవ వాదాలకు మల్లే ఉద్యమస్థాయికి చేరలేదు. ఇస్మాయిల్, ఇంద్రగంటి శ్రీకాంతశర్మ, కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణ, గోదావరి శర్మ మొదలైన కవులు ఈ మార్గంలో ప్రయాణించారు. అందులో ముఖ్యుడు ఇస్మాయిల్. ఈ వాదం కొన్ని విమర్శలకి గురైనా తెలుగు సాహిత్యంలో ఒక ప్రత్యేక ధోరణిగా గుర్తించబడింది.

ఏ విధమైన పూర్వ సిద్ధాంతాలు, ఊహాపోహలు లేకుండా కవి ఒక ప్రాపంచిక కంపనానికి సహజంగా స్పందించటమే అనుభూతి కవిత్వంగా చెప్పుకోవచ్చు. అక్కడ కవి పొందిన అనుభూతి యథాతథంగా పాఠకుడికి అంది, అది అతడి అనుభవంగా పర్యవసిస్తుంది. అనుభూతి సహజంగా, స్వచ్ఛంగా వెలువడటానికి రాజకీయ సిద్ధాంతాలు మొదలైనవి అడ్డు తగులుతాయి. కనుక ఆర్థిక, రాజకీయ భావజాలానికి అనుభూతి కవిత్వానికి చుక్కెదురు. మితిమీరిన అలంకారాలు, భాషా పాండిత్యం కూడా సహజానుభూతికి అడ్డం వస్తాయి గనుక వాటికి అనుభూతి కవిత్వం వ్యతిరేకం. ఆ కవిత్వంపై ఇస్మాయిల్ అభిప్రాయాలేమిటి?

జీవితోత్సవాన్ని జరిపే కవిత్వం, విషాదానందాన్ని కలబోసిన కవిత్వమూ 1950, 60 దశాబ్దాల్లో ప్రవహించటం మానేసిందని, శుష్క నినాద ప్రాయమైన రాజకీయ అకవిత్వం దేశమంతటా అల్లుకుందని ఇస్మాయిల్ అభిప్రాయం. చిట్టిపొట్టి ఆనందాల్ని, ప్రేమల్ని, దిగుళ్ళని, స్నేహాల్ని, ఆశల్ని, నిరాశల్ని,

నందేహాల్ని ప్రతిఫలించే కవిత్వం కోనం తహతహలాడిపోయినట్టు ఆయన చెప్పాడు. జీవితమంటే రాజకీయ నినాదాలూ, పార్టీల మధ్య సంఘర్షణలు కావని ఇస్మాయిల్ ఉద్దేశం. క్షణక్షణం మనల్ని ప్రత్యక్షంగా తాకే అనుభవాలూ, వాటి స్పందనలూ, జీవితాన్ని జీవన పాత్రంగా మార్చే అనంతమైన అనుభూతులూ ఇవిగాక కవిత్వానికేం అర్థం? అని తన తరం యువకవులు కొంతమంది ప్రశ్నించుకున్నారు.

'అనుభూతి కవిత్వంలో ఈ అనుభూతి ఏమిటి? అనుభూతి అనే పదాన్ని చాలా అర్థాల్లో వాడుతున్నారు. 'అనుభవం' అని ఒక అర్థం. **'feeling'** అని మరో అర్థం. కాని, అనుభూతి అంటే అవి రెండూ కావు. ఇవి రెండూ కలిసే బిందువు. భౌతిక ప్రపంచమూ, మనిషి ఆంతరంగిక ప్రపంచమూ వీటి రెంటి కలయిక. విషయి **(subject)**, విషయాల **(object)** సమ్మేళనం. అనుభవం వస్తువు ఒకటైనా, ఎవరి అనుభూతి వారిది. అది ఎప్పుడూ కొత్తగా ఉంటుంది. ఒకరి అనుభూతిలా మరొకరి అనుభూతి ఉండదు. ఈ నవ నవోన్మేషమైన అనుభూతిని ఆవిష్కరించటమే కవి కర్తవ్యం'.

'అనుభూతి కవితలో అఆలోచనకీ, తర్కానికీ, విశ్లేషణకీ స్థానం లేదు. మన పంచేంద్రియాల్ని తాకే పదచిత్రాల ద్వారా మన అనుభూతిని మేల్కొలుపుతాడు కవి. తాను ఉద్దేశించిన సంవేదనల్ని **(feelings)** మనలో రేపే పదచిత్రాల్ని **(images)** ఎన్నుకుంటాడన్నమాట. అనుభూతికి అవరోధమయ్యే ఆలోచనా సామగ్రిని దరికి చేరనివ్వడు. దైనందిన జీవిత లంపటంలో, అనుదిన సంఘర్షణల్లో, స్వార్థ పాక్షిక గమ్యాల అన్వేషణలో నిమగ్నుడైన మనిషి తన అస్తిత్వాన్నీ, దాని అనుభూతినీ విస్మరిస్తున్నాడు. అనుభూతి ద్వారా మనిషికి స్వస్వరూప జ్ఞానం కలుగుతుంది. ఆ అనుభూతి స్వరూపం ఆనందం. ఇంతకన్నా పరమార్థం. వేరే ఉందనుకోను' (ఇస్మాయిల్, కరుణ ముఖ్యం).

ఈ అభిప్రాయాలు నిర్దిష్టంగా అనుభూతి కవిత్వ తత్వాన్ని ఆవిష్కరిస్తున్నాయి. సందేహం లేదు. అయితే ఈ అభిప్రాయాలు కొంతవరకు వివాదాస్పదమయ్యాయి. మనిషి చైతన్యంలో ఆలోచనకీ, తర్కానికీ, విశ్లేషణకీ స్థానం లేదా? అనుభూతికి అవరోధమయ్యే ఆలోచనా సామగ్రిని దరికి చేరనివ్వకపోవటం ఎంతవరకు సరైన పద్ధతి? ఒక సౌందర్యవతిని చూసి ఆనందానుభూతిని పొందటం సహజమే. కాని దారి పక్క చెట్టు కింద ముసలి బిచ్చగత్తెను చూసి ఏ అనుభూతి పొందగలం? ఆనందానుభూతిని కలిగించని వస్తువుల పట్ల కవి స్పందనేమిటి? గొప్ప కవిత్వంలో చైతన్యం, ఆనందం కలగలిసే ఉంటాయి గదా! ఇక కవిత్వానికి, సమాజానికి ఉండాల్సిన తార్కిక సంబంధం సంగతేమిటి? అనివార్యమైన సామాజిక, ఆర్థిక రాజకీయ కల్లోలాలు కవిత్వంలోకి రాకుండా నిషేధించగలమా? కవికి సామాజిక బాధ్యత లేదా? ప్రాథమికంగా 'అనుభూతి స్వరూపం ఆనందం' అనే విషయం దగ్గరే అనుభూతి వాదులకు, అభ్యుదయ వాదులకు విరోధం ఏర్పడుతుంది. అనుభూతివాదం ప్రధానంగా వైయక్తికం లేదా ఆత్మాశ్రయం **(subjective).** అభ్యుదయవాదం ప్రధానంగా వస్త్వాశ్రయం **(objective).**

1960 ప్రాంతం నుంచి దాదాపు నాలుగు దశాబ్దాలు సాగిన ఇస్మాయిల్ కవితా ప్రస్థానంలో కొన్ని మైలు రాళ్ళు చూద్దాం. *చెట్టు నా ఆదర్శం (1972), మృత్యువృక్షం (1976), చిలుకలు వాలిన చెట్టు (1980), రాత్రి వచ్చిన రహస్యపు వాన (1987)* అనేవి ఇస్మాయిల్ కవితా సంపుటులు. ఇవిగాక సంపుటులన్నీ కలిసిన *'ఇస్మాయిల్ కవితలు'* అనే బృహత్ కవితా సంకలనం 1989లో ప్రచురించబడింది. బాల్చీలో చంద్రోదయం (1996), కప్పల నిశబ్దం (హైకూలు) కవితా సంపుటులు కూడా ఇస్మాయిల్వే. 'రెండో ప్రతిపాదన' (1997) అనువాద కవితల సంకలనం. విమర్శకుడుగా ఇస్మాయిల్ 'కవిత్వంలో నిశ్శబ్దం', 'కరుణ ముఖ్యం' అనే వ్యాస సంపుటులు కూర్చాడు.

పాటకత్తెకి

*హాయిగా గొంతు ముడి విప్పి పాడు*
*రయిక ముడి విప్పి*
*చంటి బిడ్డకు*
*చన్నిచ్చే తల్లిలా*
*నీ అంతరాళాల్లో*
*నీ రక్త సంధ్యలో లేచిన*
*తెల్లటి పాట పావురాన్ని*
*నా రక్త సంధ్యలో*
*వాలనీ*
*వెలిగే పగళ్ళతో*
*ఉభయ సంధ్యల్నీ*
*కలపనీ*
*ఎగిరి ఎగిరి అలసిపోయి*
*దినాలు రెక్కలు ముడిచేవేళ*

*పాట నావలో కూచుని*
*నీ కనురెప్పల తెరచాప నెత్తి*
*నీ కళ్ళల్లో*
*అస్తమానం అస్తమించే*
*నల్లటి సూర్యబింబంకేసి*
*సాగిపోనీ* (రాత్రి వచ్చిన రహస్యపు వాన)

ఇది చాలా సులభంగా తోచే లోతైన కవిత. గాఢమైన అనుభూతి కలిగించే కవిత. ఒకే సమయంలో బాహ్య ప్రకృతికి, మనఃప్రకృతికి సంబంధించిన అందమైన అనుభూతి కలిగించే కవిత. సాయంసంధ్యా సమయం. నీటిలో మెల్లగా కదులుతున్న నావ. నావలో ఒకవైపు గొంతెత్తి పాడుతున్న యువతి. ఇంకోవైపు ఆ గానం ఆస్వాదిస్తున్న కవి. ఈ దృశ్యాన్ని ముందుగా ఊహించుకుంటే కవిత మరింత అందంగా అర్థమవుతుంది.

కవిత శీర్షికను బట్టి ఎవరో ఒక గొప్ప గాయకురాలిని ఇస్మాయిల్ ఉద్దేశించినట్టు తెలుస్తుంది. ఆమె ఎవరు అనే ప్రశ్నకి జవాబు మాత్రం కవితలో లభించదు. అథోజ్ఞాపికగా నైనా కవి సూచించలేదు. కాబట్టి ఆమె పేరు అప్రస్తుతం. ఆమె గానం మాత్రమే ప్రస్తుతం.

గొంతు విప్పి పాడటం అంటే ఎటువంటి సంకోచం లేకుండా స్వేచ్ఛగా గొంతెత్తి పాడటం అని అర్థం చేసుకుంటాం. అయితే గొంతు ముడి విప్పటం ఏమిటి? 'ముడి' అనే మాట ఒక ఆటంకాన్ని, సంకోచాన్ని తెలుపుతుంది. స్త్రీపరంగా గాని, గానపరంగా గని ఎటువంటి సంకోచాలు లేకుండా పాడమని అర్థం. అలా పాడినప్పుడే పాట స్వేచ్ఛగా, సహజంగా వెలువడుతుంది.

ఇక్కడ కవితలో తొలి వాక్యానికి అత్యంత సహజమైన పోలిక కల్పించాడు కవి. బాలెంతరాలు ఎట్లా రవిక ముడి విప్పి కన్న బిడ్డకు పాలిస్తుందో అట్లా పాడమంటున్నాడు కవి. అంటే పాటగత్తెని పాలిచ్చే తల్లితో చక్కగా పోల్చుతున్నాడు. పాటగత్తె ఉపమేయం. తల్లి ఉపమానం. ముడి విప్పటం ఆ ఉపమేయోపమానాల మధ్య చక్కని సాదృశ్యం. పాలిండ్ల నుంచి పాలు రావటం ఎంత సహజమో పాటగత్తె గొంతు నుంచి పాట రావటం అంతే సహజం. పాల వలన చంటి బిడ్డకు బలం కలుగుతుంది. పాట వలన శ్రోతకు గొప్ప అనుభూతి కలుగుతుంది. సందర్భోచితమైన పోలిక.

'రక్త సంధ్య' అనేది కవిత రెండోభాగంలోని కీలక పదబంధం. 'ఎర్రటి సంధ్యాకాలం' అని దానికి సాధారణార్థం. 'నీ అంతరాళాల్లో రక్త సంధ్య' అనటం వల్ల శరీరగత రక్త ప్రాంతం అని కూడా అర్థం చేసుకోవాల్సి ఉంటుంది. అప్పుడు పాట కేవలం గొంతులోంచి గాక శరీర రక్తపు లోయల్లోంచి వెలువడుతుందని గ్రహించాలి.

రక్తపు ఎరుపు ఉద్రిక్తతకు చిహ్నం. అలాగే సంధ్య చీకటి వెలుగుల సంధికాలం. అంటే మొత్తంమీద కవి 'రక్త సంధ్య' అనే మాట ద్వారా ఒకానొక ఉద్రిక్త వాతావరణాన్ని కూడా ధ్వనింపజేస్తున్నాడు. అయితే ఆ అంతర్గత ఉద్రిక్తతలోంచి లేచేది 'తెల్లటి పాట పావురం' అంటే ఉద్రిక్తతను చల్లబరిచే, ఉపశమనం కలిగించే శాంతి పూర్వక సంగీతం అది. పాటగత్తె అంతరాళాల్లోంచి లేచిన ఆ పాట పావురాన్ని శ్రోత లేదా కవి రక్త సంధ్యలో వాలనిమ్మన్నాడు. అంటే పాట ఒక అంతరంగం నుంచి మరో అంతరంగంలోకి ప్రయాణిస్తుంది. ఈ క్రమంలో తెల్లటి పాట పావురం వల్ల పగళ్ళు కూడా వెలుగుతాయి. అంటే మానసిక వాతావరణాన్ని ప్రకాశవంతం చేయగలుగుతుంది ఆ పాట. ఉదయ సంధ్య నుంచి సాయంసంధ్య దాకా గానం సాగుతుందని భావించాలి.

లేవటం లేదా ఎగరటం అనే పావురం ధర్మాన్ని పాటలో ఆరోపించాడు కవి. పాటకి, పావురానికి అభేదం సిద్ధించి పాటే పావురం అయింది. ఇవి రూపకాలంకారం.

'ఎగిరి ఎగిరి అలసిపోయి దినాలు రెక్కలు ముడిచే వేళ' అన్నచోట కూడా ఈ ఆరోప లక్షణమే ఉంది. పగలల్లా మేత కోసం ఎగిరి ఎగిరి అలిసిపోయేవి, గూటికి చేరి రెక్కలు ముడుచుకునేవి పక్షులు. ఆ పక్షి ధర్మాన్ని దినాల్లో ఆరోపించాడు కవి. అదే విధంగా 'పాట నావ', 'కనురెప్పల తెరచాప' అన్నచోట కూడా రూపక స్వభావం పరిశీలించవచ్చు.

నావ నీటిలో మెల్లగా సాగిపోతుంది. పాట కూడా అంతే. తెరచావలు విప్పుకుంటాయి. కనురెప్పలు కూడా విప్పారతాయి. కనుక ఇక్కడి రూపకాలు కూడా అందంగా అమరాయి.

కనురెప్పలు పైకెత్తినప్పుడు కళ్ళల్లో కనిపించేదేమిటి? అస్తమిస్తున్న నల్లటి సూర్యబింబం. అస్తమించే సూర్యబింబం కనుపాపల్లో కన్పించవచ్చు. నల్లటి కనుపాపే అస్తమించే సూర్యబింబంలాగా కన్పించే అవకాశం కూడా ఉంది. ఇక కవి పాట నావలో కూచుని ఆమె కళ్ళల్లో అస్తమించే సూర్యబింబం వైపు సాగిపోవటం అంటే గొప్ప అనుభూతిలో పాటగత్తెకి సన్నిహితం కావటమే. పాటతోపాటు పాటగత్తెనీ ప్రేమించటమే.

కవిత్వభాషలో అనురూప శబ్ద సంయోజన సాధారణ లక్షణం. అంటే కవి తన భావాలను బట్టి ధ్వని సారూప్యం గల శబ్దాలను పక్కపక్కనే కూర్చటం. దీని వల్ల శైలిలో ఒక తూగు, హొయి, చెవి కింపు కలుగుతాయి.

'కనురెప్పల తెరచాప' - ఇక్కడ నేత్ర పక్ష్మాల తెరచాప అనవచ్చు. అర్థంలో భేదమేమీ లేదు. అయితే 'కనురెప్పల తెరచాప' అనే సమాసపదంలోని రెండు భాగాల్లో రెండు ధ్వనులు సమానంగా ఉన్నాయి. 'అస్తమానం అస్తమించే' - ఈ రెండు పదాల్లో మూడు ధ్వనులు సమానంగా ఉన్నాయి. అందువల్ల శబ్ద సంయోజనలో ఒక అంత్యలయ ఏర్పడి వాక్యం హాయిగా దొర్లిపోతుంది. 'ఎప్పుడూ అస్తమించే' అని రాస్తే ఆ సంయోజన దెబ్బ తింటుంది.

కవికి శబ్దంపై అధికారం, భాషలోని అనురూప, అననురూప పదాల పరిచయం ఎంతగానో ఉంటే తప్ప, తగినంత పూర్వ అభ్యాసం ఉంటే తప్ప ఈ విధమైన శబ్ద సంయోజన సాధ్యం కాదు. గొప్ప కవుల కున్న ఆ సామర్థ్యం వల్ల కవిత్వరచనలో అసంకల్పితంగా అనురూపమైన పదాల ఎన్నిక జరిగిపోతుంటుంది.

గత కాలపు కవిత్వంలో భాషకు మాసిన రంగులు, వాసనలు ఉన్నాయని ఇస్మాయిల్ అభిప్రాయపడ్డాడు. అంటే కవుల భాషా ప్రయోగం యాంత్రికంగా తయారైందని భావం. దానికి విరుగుడుగా తాను భాషను శుభ్రపరిచే ప్రయత్నం చేస్తున్నట్టు ప్రకటించాడు. ఇస్మాయిల్ ఇందులో భాగంగా తన కవిత్వంలో సరళమైన, నిసర్గమైన భావ చిత్రాలను, పద చిత్రాలను ప్రవేశపెట్టాడు. ఈ విషయంలో ఇస్మాయిల్ 1912లో అమెరికాలో ఎజ్రాపౌండ్ ప్రవేశపెట్టిన ఇమేజిజం **(imagism)** అనే ఉద్యమం స్ఫూర్తి నిచ్చింది. కవిత్వానికి అమూర్త భావాలు పనికిరావని, కవిత్వం అనుభవాన్ని, అనుభూతిని 'ఇమేజ్' (భావచిత్రం) ద్వారానే పాఠకుడికి అందజెయ్యగలదని ఎజ్రా పౌండ్ ఉద్దేశం. ప్రకృతికి సంబంధించిన వస్తువులే పద చిత్రాలుగా ఉపయోగిస్తాయని భావించాడతను.

**'An image is that which presents an intellection and emotional complex in an instant of time'** (మేధాపరమైన, భావావేశపూరితమైన సంక్లిష్టానుభవం త్రుటిలో అందించగలది భావ చిత్రం) అని ఎజ్రాపౌండ్ నిర్వచనం.

'ఊగుతోంది వేయి పిట్టల సముద్రం' అన్నప్పుడు ఒక చక్కని చిత్రం కళ్లముందు కదులుతుంది. 'ఆత్మహత్య' అనే కవిత చూడండి.

*'తనని బాధిస్తున్న*
*ప్రపంచపు ముల్లుని*
*పీకి పారేసి*
*ఈ పిల్ల చకచకా*
*ఎటోవెళ్లిపోయింది'*

లోకంతో ఘర్షణ పడలేక తన జీవితం ముగించుకొన్న ఒకానొక అమ్మాయి గురించి ఎంతో సరళంగా, సరి కొత్త రూపకంతో (ప్రపంచపు ముల్లు) చెప్పిన కవిత ఇది.

'మానవ అనుభవంలోని ఏక సూత్రతని ఆవిష్కరించడం ద్వారా ప్రపంచాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించే మానవ వ్యవసాయాల్లో కవిత్వం ఒకటి'. అన్నాడు ఇస్మాయిల్. అంటే అనేకానేక మానవుల అనుభవ సారాంశాన్ని కవిత్వం ఆవిష్కరిస్తుందని, తద్వారా ప్రపంచం మరింత అర్థం అవుతుందని ఆయన ఉద్దేశం.

'జీవిత మహోత్సవంలోని అమృతాన్ని ఆవిష్కరించడమే కవిత చేసే పని. ఈ విధంగా మన చేతనని సుసంపన్నం చేస్తుంది కవిత్వం' అని మరోచోట అన్నాడు ఇస్మాయిల్.

అంటే జీవితాన్ని ఇక పోరాటం లాగా దర్శించలేదు. ఇస్మాయిల్ ఒక విషాదయోగం లాగానూ దర్శించలేదు. ఉత్సవం మనుషుల్లో ఉత్సాహం కలిగిస్తుంది. జీవశక్తిని నింపుతుంది. ఆనంద పరవశత్వం కలిగిస్తుంది. ఆ విధంగా మన చైతన్యాన్ని మరింత సమగ్రం చేస్తుందని ఆయన తలచాడు. జీవితాన్ని ఉత్సవంగా భావించటం అంటే అందులోని ద్వేషం, క్రౌర్యం, ఘర్షణ, యుద్ధం, నిరాశ, విషాదం మొదలైన సమస్త ప్రతికూలాంశాల్ని **(negative elements)** తిరస్కరించటమే. జీవితంలోని ప్రేమ, దయ, సహనం, సంతృప్తి, ఆనందం మొదలైన అనుకూలాంశాల్ని **(positive elements)** స్వీకరించటమే. అయితే సామాజిక, ప్రాపంచిక పరిణామాలు మనిషిపై చూపించే ప్రభావాల సంగతేమిటి? వాటినెలా ఎదుర్కోవాలి? ఇలాంటి ప్రశ్నలకు ఇస్మాయిల్ కవిత్వం గబుక్కున సమాధానాలు ఇవ్వలేదు.

ఇస్మాయిల్ కవిత్వం ఆధునిక మానవుడికి ఆయుధాన్ని అందివ్వదు; పిల్లంగోవిని అందిస్తుంది.

మామూలుగా కవులు ఏదో ఒక గంభీరమైన వస్తువు గ్రహించి, గంభీరమైన భాషలో భావ వ్యక్తీకరణ చెయ్యాలని ఆశిస్తారు. అయితే ఆ గాంభీర్యం కేవలం వస్తువును బట్టిగాక ఆ వస్తువును కవి అర్థం చేసుకొని, ఆవిష్కరించే విధానాన్ని

బట్టి కూడా ఉంటుంది. సాధారణ వస్తువునుంచి అసాధారణ తాత్త్విక స్థాయిని కవి సాధించవచ్చు.

ఇస్మాయిల్ కవితా వస్తువుల్లో అనేకం సాదాసీదాగా ఉంటాయి. *జంక్షన్, సైకిల్, గోడ, బావి, టీ కప్పు, గాడిద* లాంటి వస్తువులమీద కవిత్వం రాయటం మామూలుగా ఊహించలేం.

*'సవ్వడి చెయ్యక భూమి బుగ్గపై*
*చల్లటి నవ్వు సొట్టలా ముడుచుకుంటుంది బావి'*

ఎంత లలితమైన పోలిక! ఇటువంటి వస్తువుల్ని గ్రహించి వాటిని విశిష్టస్థాయికి తీసుకెళ్ళిన ఇస్మాయిల్ ప్రతిభ ఆశ్చర్యపరుస్తుంది. 'కాదేదీ కవిత కనర్హం' అన్న శ్రీశ్రీ వాక్యానికి ఉదాహరణలుగా ఇస్మాయిల్ కవితలెన్నో చెప్పొచ్చు.

*'తడుముతో*
*చీకటి జిప్పుని*
*కొద్దికొద్దిగా విప్పుతో*
*ముందుకు సాగుతోంది కారు'*
*(రాత్రి కారు ప్రయాణం)*
అన్నప్పుడు గాని –
*'ఒక చేత్తో ఆకాశాన్ని ఎత్తి పట్టుకుంటుంది*
*ఒక చేత్తో భూమిని బుజ్జగిస్తుంది'* (మా ఆవిద)

అన్నప్పుడు గాని అతని ఊహాశక్తి అపురూపం అనిపిస్తుంది.

ఇస్మాయిల్ భావజాలంలో మార్క్సిస్టు వ్యతిరేకత ఒకటి. చాలా చోట్ల ఆయన బాహాటంగానే మార్క్సిస్టుల పట్ల తన అసంతృప్తిని వెల్లడించారు. *వడ్రంగి పిట్ట, ...పార్టీ(గా) మహాసభ* వంటి కవితలు ఆయన మార్క్సిస్టు వ్యతిరేకతకు నిదర్శనాలు. తెలుగునాట వామపక్ష భావజాలం బలంగా ఉన్న రోజుల్లోనే ఆయన ఇలాంటి అభిప్రాయాలు ప్రకటించాడు. 'గతి తార్కిక భౌతికవాదం కన్న గతి వేరులేదని అంటాడు' అని మార్క్సిస్టుల్ని ఎగతాళి చేశాడు. అందుకు ప్రత్యర్థులు కూడా తీవ్రంగానే స్పందించారు. అయితే ఇస్మాయిల్ అంతరంగమేమిటి?

'కార్ల్ మార్క్సుతో కానీ, అతని రాజకీయ సిద్ధాంతాలలో కానీ నాకు వైరమేమీ లేదు. వచ్చిన చిక్కంతా మార్క్సును అభినవ భగవంతుడిగానూ, అతని సిద్ధాంతాల్ని అభినవ మతమౌఢ్యం గానూ మార్చిన మార్క్సిస్టులతోనే. మనల్ని దారి తప్పించడానికి ఉన్న మతాలు చాలు, కొత్త మతం అవసరం లేదంటున్నాను. మార్క్సు సూత్రాలు నిరపేక్ష నిశ్చయాలు **(absolutely certain),** శాస్త్రం మొదలు కళ వరకు అన్ని రంగాలకి తిరుగులేకుండా వర్తిస్తాయని మార్క్సిస్టు పిడివాదం చేస్తారు. విజ్ఞాన శాస్త్రీయ సూత్రాలు నిశ్చాయకాలని శాస్త్రమే అనదు. పిడుక్కీ బియ్యానికీ ఏక సూత్రంగా ఉపయోగించే సార్వత్రిక సూత్రాలెక్కడా లేవు, మత మౌఢ్యంలో తప్ప. కనుక ఈ మార్క్సిస్టు క్లెయిమ్ నేను ఒప్పుకోను. మార్క్సిస్టు కవిత్వం, నాన్ మార్క్సిస్టు కవిత్వం వేరువేరు ఉంటాయని నేననుకోను. ఏ కవిత్వమైనా కవి వైయక్తిక అనుభవంలో ఉద్భవించాల్సిందే. నిజమైన కవిత్వం మార్క్సిస్టు రచించినా, నాన్ మార్క్సిస్టు రాసినా నాకు ఆదరణీయమే.'

ముస్లిం మైనారిటీవాదం సాహిత్య రంగంలో ప్రవేశించిన నేపథ్యం ఇస్మాయిల్ అభిప్రాయం తెలుసుకోవటం ఆసక్తిదాయకంగా ఉంటుంది. 1988లో స్మైల్ చేసిన ఇంటర్వ్యూలో ఇస్మాయిల్‌ను 'మీరు ముస్లింగా, ఒక మైనారిటీ మతస్థునిగా సమాజంలోనూ, సాహిత్య రంగంలోనూ ఎలా ఫీలవుతున్నారు?' అని ఒక ప్రశ్న అడిగాడు. దానికి ఇస్మాయిల్ సమాధానం ఇది 'మతం గురించి కులం గురించి ఆలోచన నాకెప్పుడూ రాలేదు. నేను మొదట్నించీ అందరిలో ఒకణ్ణిగా, తెలుగువాడిగా ఫీలవుతూ వచ్చాను. నా పని నేను చేసుకుంటూ, ఎవరితోనూ, ఏ బిరుదు కోసమూ అవార్డు కోసమూ పోటీ పడలేదు. కనుక నా మైనారిటీ మతం నాకు **handicap** కాలేదు'.

సుమారుగా 1990 ప్రాంతాన ఒక ప్రత్యేక అస్తిత్వ సంక్షోభం నుంచి ముస్లిం వాద కవిత్వం మొదలైంది. తమ అభద్రత గూర్చి, దేశ సౌభాగ్యంలో తమ భాగం గూర్చి ఆ కవులు ప్రశ్నిస్తున్నారు. అయితే ఈ సంక్షోభానికి చాన్నాళ్లు ముందే ఇస్మాయిల్ సాహిత్యరంగంలోకి ప్రవేశించాడు. పరిస్థితులు ఆనాడు అంత సంక్లిష్టంగా లేవు. దానితోపాటు కవి పుట్టి, పెరిగిన వాతావరణం, అనుభవం మొదలైన అంశాలెన్నో అతని దృక్పథాన్ని ప్రభావితం చేస్తాయి గనుక ముస్లిం అభద్రతాభావం ఆయనను వెన్నాడి ఉండకపోవచ్చు. కనుక ఇస్మాయిల్ ఒక సంవేదనా భరితుడైన మానవుడుగానే తప్ప ప్రత్యేకించి ముస్లిం కవిగా కనిపించడు. అతని కవితలు **general** గా ఉంటాయి తప్ప **specific**గా ఉండవు. చెట్టు ఎవరికైనా చెట్టే. సైకిల్ ఎవరికైనా సైకిలే. రాత్రి కురిసిన రహస్యపు వాన ఎవరికైనా ఒకటే. పాటలు, పాటగత్తెలు, రాత్రులు, నక్షత్రాలు అన్నీ ఎవరికైనా ఒకటే. ఇస్మాయిల్ మతకోణం నుంచి వేదన చెందలేదు. మానవతావాదమే అతని కవిత్వంలోని ప్రధాన కోణం. ◆

# మేడ

- చొక్కాపు. లక్ష్మునాయుడు
9573250528



చాన్నాళ్లుగా చూస్తున్నా ఆ 'మేడ'ని
చలువ అద్దాల సుందర హర్మ్యాన్ని,
లోపలెవరో మసలాడుతున్న దృశ్యాన్ని
ఎప్పుడన్నా తెరుచుకున్న కిటికీ కళ్ళద్దాల లోంచి
కొన్ని కోమలమైన రూపాల్ని,
పట్టు బట్టల్లో మెరిసిపోయే బంగారు దీపాల్ని.

చాన్నాళ్లగా చూస్తున్నా ఆ మేడని
శృతి తప్పిన పూల గొంతుల స్వేద గానాన్ని
ప్రతి రాత్రీ చీలికలౌతున్న అవిటి జీవితాల్ని
అలసిన క్షణాల అలక్ష్యపు పాన్పుపై
నిర్భయంగా నిద్రపోతున్న నీలిరాత్రుల్ని,

చాన్నాళ్లుగా చూస్తున్నా ఆ మేడని..
అంతుచిక్కని రహస్య జీవన విధానాన్ని
చీకటి వెలుగుల దాగుడుమూతల విన్యాసాల్ని
చితి రగిల్చిన కాసుల దావానంలో
చెర వీడని సౌకమార్యపు చిలుకల
శృంగభంగమైన ఆశల  ఆకలి స్వరూపాన్ని.

చాన్నాళ్లుగా చూస్తున్నా ఆ మేడని
అనామకపు స్వేద జలాలపై పడగలెత్తిన
అహంభావ ప్రాతినిధ్యపు ప్రత్యక్ష సాక్ష్యాన్ని
శ్రమ సరస్వతికి తలవంచని
బహుళంతస్థుల భీకర కాయాన్ని

చాన్నాళ్లుగా చూస్తున్నా ఆ మేడని
ఎంత చదివినా అర్థం కాని పదునైన కట్టడాన్ని
సంకుచిత సమూహాల సమర భూమిలో
ఏ శరమూ ఛేదించలేని శిలా హృదయాన్ని
దారి తప్పిన మనిషి మస్తిస్కానికి
ఏ మార్గమూ సూచించలేని శుష్క అంతరంగాన్ని. ♦

# ఎరువుల దిబ్బ

- మూని వెంకటాచలపతి
7396608221

విరగ్గాసిన పండ్ల చెట్టుపై రాళ్లు విసిరి
అందిన కొమ్మల్ని రెమ్మల్ని విరిచేసి
బుట్టలు నిండా పండ్లను నింపుకొని
వెనక్కు తిరిగి చూడకుండా అడుగులో
అడుగేసుకుంటూ పదం పాడుకుంటూ
ముందుకు వెళ్లిపోయాడు ఒకడు

కొత్త ఔషధాలను అమ్ముకోవడానికి
అందరూ తాగే నీటిలో అలవోకగా
మలినాల్ని కలిపి జబ్బులు మోస్తున్న
జనాలకు అందుబాటు ధరలో
మందులను పంపిణీ చేశాడు ఒకడు

మనిషి వీపుపై వెన్నుపూసలు విరిగేలా కొట్టి
భయముం గౌరవాన్ని కలిపి వొంపుకోవడానికి
వర్షాకాలం చీకటి రాత్రిలో హరికేన్ లాంతరు
వెలుగులో చెదలు సగం తినేసిన పురాతన
నిఘంటువులో అర్థాల్ని  వెదకసాగాడు ఒకడు



మానవత్వపు వాక్యాన్ని విశదీకరించడానికి
కొందరి లేత హృదయాలను చిదిమేసి
నరాల్లోని రక్తాన్ని సిరా సీసాల్లో నింపి
కొత్తపాళీతో చరిత్ర పుస్తకాన్ని రాయడానికి
అలవాటు పడ్డాడు ఒకడు

మెదడులో అసూయ విత్తనం మొలకెత్తి
అది మహావృక్షంగా మారి ఊడలు వేర్లుగా
రూపాంతరం చెంది పక్కవాడి పైకి పాకి వాడి
జీవిత జీవాన్ని పోషకాలుగా పీల్చుకొని
వికృతమైన మనస్సుతో బలమైన మనిషిగా
ఎదుగుతున్నాడు ఒకడు

అవును నేడు సమాజంలో ప్రతి వాడికి
ఎదుటివాడు ఓ ఎరువుల దిబ్బ..! ♦

# ఇప్పుడు నిర్వేదానికి తావు లేదు

ఇంటర్వ్యూ: తెలకపల్లి రవి



సి. రాఘవాచారి

*సాహిత్యం గురించి మాట్లాడుకోవడమంటే ముందు పత్రికలు తర్వాత పుస్తకాలు చర్చకు వస్తాయి. మీ ఉద్దేశంలో ఈ రంగాల మధ్య అంతస్సంబంధం ఎలా వుంటుంది?*

సాహిత్యం, భాష, సంస్కృతి ఆరిస్టోక్రసీ నుంచి ఒక విధమైన డెమోక్రసీకి మారడంలో పత్రికలు పెద్ద పాత్ర నిర్వహించాయి. కందుకూరి వీరేశలింగం నుంచి ఇప్పటి వరకు ఈ పాత్ర కొనసాగుతూనే వుంది. ఆంధ్రపత్రిక, భారతి వంటివి ఒకప్పుడు సాహిత్యానికి ఆటపట్టుగా వుండేవి. ఇటీవల కాలంలో కొన్ని పత్రికలలో సాహిత్యం కొంత ప్రాధాన్యత కోల్పోయిన పరిస్థితి వున్నా మొత్తం మీద ఈ పాత్ర పురోగమన శీలమైందే. పత్రికలలో ఒక విధమైన చర్నింగ్ జరుగుతోంది. పత్రికలకు సంబంధించిన సాంస్కృతిక పార్శ్వాన్ని విశ్లేషించే ఒక ప్రయత్నం పెద్ద ఎత్తున జరగాల్సి వుంది. ముఖ్యంగా వామపక్ష పత్రికలు సంఘాలు ఈ విషయంలో పెద్ద పాత్ర నిర్వహించాయి. పరిణామాలకు స్పందించే లక్షణం సాహిత్యంలో ఎక్కువగా వుంటుంది పత్రికలకూ అదే ప్రాణం. మాది వరంగల్ జిల్లాలో సనాతన సంపన్న కుటుంబం. మా ఇంటికి ఆ రోజుల్లో శ్రీ వైష్ణవ పత్రిక వచ్చేది. అలాగే గోలకొండ. అది 1946. ఇప్పటి ప్రమాణాలతో చూస్తే ఆ పత్రికలు ఎలా వుంటాయో కాని అప్పట్లో నిద్రాణమై వున్న జనాన్ని జాగృతపరచడానికి ఎంతగానో దోహదపడ్డాయి. మూగ జీవుల హృదయ స్పందనను ప్రతిబింబించాయి. వట్టికోట ఆళ్వారుస్వామి సంచి భుజాన వేసుకుని మీజాన్‌కు విలేకరిగా వూరూరు తిరిగేవారు. సురవరం ప్రతాపరెడ్డి రాజకీయంగా మితవాది. సాంస్కృతికంగా అతివాది. భాషా సంస్కృతుల విషయంలో ఆయన సేవ చాలా వుంది. ఎవరో వ్యాఖ్యానం చేస్తే ఆగ్రహించి తురుష్క ఆంధ్రలో తెలుగు కవులు అంటూ గోలకొండ కవుల సంచిక ప్రకటించారు. ఆ విధమైన ఉద్యమ స్ఫూర్తి, అభినివేశం వుండేవి. తెలంగాణా విషయంలో భాష విషయమున న్యూనత పనికిరాదని, సర్కారు ఆంధ్రముకంటే అదేమి తక్కువ కాదని ఆయన రాశారు. భాష విషయంలో ఇలాటి పోటీ తత్వం పాజిటివ్‌గా పని చేసింది. ప్రాంతీయపరమైన అస్తిత్వ వాదనలు ఇప్పుడు ఆ రోల్ ప్లే చేయడం లేదు. గాయాలను పుళ్ళను మాన్పించేదిగా వుండాలి గాని కెలికేదిగా గాదు. యాసలు, మాండలికాల వల్ల తెలుగు భాష సుసంపన్నమైంది. అది అసెట్ కాని లయబిలిటీ కాదు. యూనిఫామిటీ ఆకాంక్ష తప్ప సంపూర్ణంగా సాధ్యమయ్యేదికాదు.

*మీలాటి వారి ఉపన్యాసాలలో పాత కావ్యాలలోని శ్లోకాలు అలవోకగా కోట్ చేస్తుంటారు. అలాటి అవగాహన రానురాను తగ్గిపోతున్నది. అయితే పాతను అదే పనిగా పట్టుకోవడం – ప్రత్యేకించి నేటి నేపథ్యంలో అంత వాంఛనీయం కాదనే అభిప్రాయం వుంది...*

ప్రాచీన అర్వాచీన అనే విషయంలో కాళిదాసే ప్రమాణం. పురాణమిత్యేవ నసాధుసర్వాం అని ఆయనే అన్నాడు. గతాన్ని పరీక్ష చేసి కాలానుగుణమైన దాన్ని స్వీకరించాలి. అలాటిదే నిలబడుతుంది. తెలుగు సాహిత్యంలో ఉద్యమ స్ఫూర్తిగల కవిత్వమే ప్రజలలో నిలబడింది. శివకవిత్వమైనా, ప్రగతిశీల కవిత్వమైనా, కులవ్యవస్థను ప్రశ్నించిన నాటి భక్తికవితా సంప్రదాయం చూడండి. త్యాగరాజు, పోతన వాళ్ళ పరిధిలో ఉన్నత భావాలనే ప్రదర్శించారు. సూఫీ కవిత్వమైనా అంతే. భక్తిని ఆదర్శంగా చేసుకుని మంచి భావాలు చెప్పారు. ప్రాచీనమైన వాటిని యధాతథంగా స్వీకరించడం కాదు. నేటికి అన్వయించుకోవాలి. కొటేషన్స్ ఏవైనా అంతే. ఆ సందర్భాన్ని పాటించకపోతే రాసిన సందర్భం నేటి సందర్భం చూడకపోతే కువ్యాఖ్యానాలు తప్పవు. భాష సార్వత్రీకరణకు మీడియా కీలకపాత్ర వహించింది. శ్రేష్ఠులైన వారికే పరిమితమైన భాష మీడియా వల్ల సార్వజనీనమైంది. మరీ ముఖ్యంగా గత యాభై ఏళ్ళుగా ప్రత్యామ్నాయ మీడియా విస్తరించింది. జాతీయోద్యమం, వామపక్ష ఉద్యమం, సంస్కరణోద్యమం, మూడు స్రవంతులుగా ఇందుకు దోహదపడ్డాయి. అందుకే గిడుగు, గురజాడ, కందుకూరి ఆధునిక మునిత్రయం అయ్యారు. 1930-40ల నుంచి సాగిన సాహిత్యంలో ఆ ప్రభావం కనిపిస్తుంది. కన్యాశుల్కం ఈ ధోరణులకు ప్రతీక అనవచ్చు.

***కాని గురజాడపైనా, అభ్యుదయ సాహిత్యంపైనా వచ్చే విమర్శలు..***

జీవితం విశాలవంతమైనపుడు ఆ ప్రభావం సాహిత్యంపైనా కనిపించుతుంది. అదింకా విశాలం కావాలని కోరుకోవచ్చు. కాని కొంత మంది దానిలోపాలనే ప్రధానంగా చూపడం సరైందికాదు. వాళ్ళు వైతాళికులు. ట్రయిల్ బ్లేజర్స్. వాళ్ళ స్ఫూర్తిని ఇంకా ముందుకు తీసుకుపోవచ్చు. ఆ పని కమ్యూనిస్టు ఉద్యమం చేసింది. జన జీవితం కేంద్ర బిందువుగా సాహిత్యం సృష్టించింది. అందులో సామాజిక సమస్యలనూ తీసుకున్నారు. కమ్యూనిస్టులు కాని వారు కూడా తెలంగాణా పోరాట స్ఫూర్తిని పలికించారు. కాళోజి, దాశరథి వంటి వారు సుద్దాల హనుమంతు, యాదగిరి, ఇప్పుడు గద్దర్ వీరంతా ప్రజలలోంచి వచ్చిన వారే. అటు జన జీవన అనుభవం నుంచి ఇటు అవగాహన నుంచి తీసుకున్నారు. కమ్యూనిస్టు ఉద్యమం మనిషిలో ఆత్మాభిమానాన్ని రగిలించింది. ప్రజల మనిషిలో కంఠీరవం ఆ వర్గాల్లోంచి వచ్చినవాడే. మహీధర రామ్మోహనరావు రథచక్రాలు తదితర రచనలలో ఎస్సిఎస్టీ సమస్యలను ప్రస్తావించారు. జాన్ పాత్ర ఈ విషయాలు మాట్లాడుతుంది. పరిస్థితి క్లిష్టంగా మారుతున్న కొద్ది ఆ వేదనలోంచి ఘర్షణలోంచి రకరకాల వాదనలు వస్తాయి. పురోగమనం ఎవరి గుత్త సొమ్ముకాదు. గతం నుంచి కూడా తీసుకోవాలి. చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా అంటే కేవలం గతాన్ని కీర్తించడానికేనా? భవిష్యత్తు కూడా దాంట్లో వుంది. విశ్వనాథ సంగతి వేరు. ఆయన గతాన్ని పునరుద్ధరించాలనుకుంటాడు. కాని వేయపడగలులో నీవు మిగిలితిని నేను మిగిలితిని అని చెప్పినట్టు చివరకు ఆయనే మిగిలాడు. ముందుకు పోవాలంటే జనాన్ని మనతో తీసుకుపోవాలి. మగ్దూం అంటాడు. చలేతో సారే జమానేకో సాత్ లేకోచలో అని అలా వుండాలి కాని కవి రాబిన్‌సన్ క్రూసో కాకూడదు. పోరాడాలంటే అన్ని వర్గాల వారిని వెంటబెట్టుకుని పోవాలి. ఇప్పుడు స్రామ్రాజ్యవాద ప్రమాదం ప్రపంచీకరణ అలాటి సమైక్య పోరాటానికి అనువైన వాతావరణం కలిగిస్తున్నది. ఈ పోరాటానికి ఎన్నో పార్శ్వాలున్నాయి. పర్యావరణ పరిరక్షణ బృందాల నుంచి విప్లవ గ్రూపుల వరకు దీంట్లో కలసిరావచ్చు. గ్రీన్స్ పార్టీల వంటివి కూడా పాల్గొంటున్నాయి. ప్రతికూలమైన సాంప్రదాయక విలువలకు మతతత్వానికి వ్యతిరేకంగా భాషలు ప్రాంతీయ అస్తిత్వాలను నొక్కి చెప్పే విధంగా జరిగే పోరాటాలూ వున్నాయి. అయితే ఇవి ఉమ్మడి పోరాటంలో భాగం పంచుకోవాలి. ఆఫ్రికా వంటి చోట్ల సమాంతర సమీకరణలు జరుగుతున్నాయి. ప్రపంచ బ్యాంకుకు వ్యతిరేకంగా సాగే ఇలాటి పోరాటాలు రానున్న కాలానికి సంకేతాలని భావించవచ్చు. శ్రీశ్రీ చీనాలో రిక్షావాలా చెక్‌దేశపు గని పనిమనిషి కలసి తనదుస్తారంటే కవిత్వంలా అనిపించింది. 50, 60 ఏళ్ళ తర్వాత ఇప్పుడు అది అక్షరాలా నిజమవుతున్నది. మన దేశంలో కూడా వసుధైక కుటుంబం అనే భావన వుంది...

ప్రపంచం ఇప్పుడు మారిపోయింది. ఇది వరకటి అధ్యయనం, అనుభవం మార్పులకు గురి అయ్యాయి. డబ్ల్యు.టి.వో. అంటే ఒకప్పుడు మేధావులు, నిపుణులు మాత్రమే చర్చించేవారు. ఇవాళ అందరూ మాట్లాడుతున్నారు. పత్తిరైతు ఆత్మహత్యలకు దానికీ సంబంధం చూస్తున్నారు. ఈ విషయంలో కూడా మీడియా చాలా పాత్ర నిర్వహిస్తున్నది దాని వెగరీస్, పర్వర్షన్స్, డిస్టార్షన్స్ ఎన్ని ఉన్నా మొత్తం మీద జనాన్ని

కదిలించడానికి కారణమవుతున్నాయి. మీడియాకు యాజమాన్యం ఉన్నప్పుడు తటస్థంగా ఉంటారని భావించలేము. అవి ప్రజానుకూల పాత్ర నిర్వహించే అవకాశమే లేదు. ప్రత్యామ్నాయం రావాలి. అన్ని రంగాలలో రావాలి. అవతలి పక్షమా ఇవతలి పక్షమా అనే మీమాంసకు గురి అయి అస్త్ర సన్యాసం చేయడానికి అవకాశం లేదు. రిస్కు తీసుకుని అయినా ఒక పక్షాన్న నిలబడాలి. బతుకును బాగు చేసేదే ఫిలాసఫీ. సిద్ధాంత రాహిత్యం సినిసిజం, నిహిలిజం, నిస్సహాయత, ఒంటిగొట్టుతత్వం పనికిరావు. కొత్త రచయితలు ఈ విషయాలను అర్థం చేసుకోవాలి. ఇప్పుడు నిర్వేదానికి తావులేదు. మేధాపాట్కర్ వంటి వారే రంగంలోకి దిగి పోరాడుతున్నారు. ఆమె చెప్పేదంతా సరైంది అవునా కాదా అనేచర్చ కాదు. ప్రజలలో ఉన్న కొన్ని ప్రగాఢ ఆకాంక్షలను ఆమె అందుకున్నది. అలాగే వివిధ తరగతులకు సంబంధించిన వారి అంశాలపై ప్రజాశీలత కావాలి. కదలకుండా ఉండే తత్వం పోవాలి. ఈ క్లిష్ట దశలో సామూహిక కష్టనష్టాల నుండి అనుభూతి పొంది అక్షరాయుధాలు అందించాలి. జయించేందుకు ప్రపంచం ఉంది అనే స్ఫూర్తి కలిగించడం సాహిత్య ధర్మం. ప్రపంచంలో ఏ గొప్ప ఉద్యమం కూడా సాహిత్య ఉద్యమంతో సంబంధం లేకుండా రాలేదు. ఫ్రెంచి విప్లవం మన జాతీయోద్యమం ఏదైనా సరే మేధావుల కాల్పనిక భావనలు నిర్దిష్ట రూపం తీసుకొనేది ఉద్యమాల సందర్భంలోనే.

***వసుధైక కుటుంబం అనే పాతకాలపు భావనను నేడు అన్వయించుతున్నారు. అది, అంతర్జాతీయత ఒకటే అన్నట్లు భావించవచ్చా?***

రెండూ ఒకటి కాదు. ఆ భావనను మార్చుకోవాలి. ఆనాటి వారి భావనలో ప్రపంచం చాలా పరిమితమైంది. ఒక పిర్కాను ప్రపంచం అని ఉండవచ్చు. విశ్వశ్రేయం కావ్యం అన్నారు భౌతిక సామాజిక కట్టుబాట్లు అన్నీ కూడా అల్ప సంఖ్యాకులను ఆధిక్యతలో అట్టిపెట్టడానికి దారి తీశాయి. కులవ్యవస్థ చాలా హాని చేసింది. గుణకర్మ విభాగశ: అంటూనే విద్యను అధిక సంఖ్యాకులకు అందుబాటులో లేకుండా చేయటం కులవ్యవస్థలో అతి పెద్ద అన్యాయం. నాస్తికులు వేదాలు చదవరాదంటూ ఇతరుల కంటే ఎక్కువగా వారే వేదాలకు హాని చేశారు. వస్తు ఉత్పత్తి చేసే వారికి వినియోగించుకునే వారికి మధ్య అంతరం విపరీతంగా పెరిగిపోయింది. కులాలు సంకుచిత భావాలకు దారి తీశాయి. కులం ప్రధానమై పోయింది. ప్రజాస్వామ్యంలో కులం ఒక్కటే ఆధారంగా గెలవడం సాధ్యంకాదు. అయినా దాన్ని పట్టుకొని ప్రయోజనం పొందాలని చూస్తున్నారు. ఆ విధమైన తీవ్ర తప్పిదాలు గతంలో ఉన్నప్పటికీ దాన్ని అర్థం చేసుకోవాలి. గతం అర్థం చేసుకోవడం వేరు, దాంట్లోనే బ్రతకడం వేరు. చాలా కాలం కిందటే పెండ్యాల సుబ్రహ్మణ్యశర్మ లాంటి వారు మహాభారతాన్ని ఆధునిక దృక్పథంతో విశ్లేషించారు. ఎంగెల్స్ ప్రాచీన క్రైస్తవం పట్ల తీసుకున్న వైఖరి కూడా అదే. క్రైస్తవ మతాన్ని సంస్కరించే, పోరాటం చేసిన మార్టిన్ లూథర్ నిజానికి రైతుల సమస్యలకు మతపరమైన ఆచ్ఛాదన ఇచ్చారు. ఆధునిక కాలంలో మార్టిన్ లూథర్ కింగ్ కూడా అలాంటి పనే చేశారు. నేనొక కలగంటున్నాను అని కింగ్ అన్న మాటలు సుప్రసిద్ధాలు. ప్రజలెప్పుడూ కలలు కంటూనే ఉన్నారు. వాటిని నిజం చేసేమార్గమేదో చూడడం ఆలోచనా పరుల కర్తవ్యం. లోకాయుతులు చార్వాకుల నుంచి ఈనాటి వరకూ మూఢనమ్మకాలపై విమర్శలు సాగుతూనే వున్నాయి. కాని ప్రజల స్థాయిని చూడాలి. ఈ రోజుకులతత్వం చాలా వికృతరూపం తీసుకుంటున్నది.

***మీకు ఉర్దూ సాహిత్యంతో మంచి పరిచయం ఉంది కదా?***

చిన్నప్పుడు నేను ఉర్దూ నేర్చుకున్నాను. చాలా మంది అనుకునేట్లు కొంత మంది ప్రచారం చేసేట్లు ఉర్దూ ఒక మతానికి సంబంధించిన భాష కాదు. పర్షియన్, అరబిక్ భాషల మేళవింపుతో సివిల్ సర్వీస్ అవసరాల కోసం పుట్టింది. సంస్కృతం బ్రాహ్మణ భాష అనుకోవటం, ఇంగ్లీష్ క్రైస్తవ భాష అనుకోవటం ఎంత పొరపాటో ఉర్దూ ముస్లిమ్ భాష అనుకోవటం కూడా అంతే పొరపాటు. పాలనా భాష పెరిగింది గొప్ప ఉర్దూ కవులలో హిందువులే ఎక్కువ. కాయస్థులు వారిలో చాలా ఎక్కువ. హైదరాబాద్ సంస్థానంలో ఉర్దూ పాలనా భాష. మేము ఉర్దూ నేర్చుకున్నాము. ఉర్దూకు ప్రజాస్వామ్య సంస్కృతి చాలా ఎక్కువ. దక్కన్ ఉర్దూ బెంగాలీ, లక్నో, ముంబాయ్ వగైరా ఉర్దూలు వేర్వేరుగా ఉంటాయి. స్థానిక భాషల సంపర్కం అందుకు కారణం. బెంగాలీ ఉర్దూ హైదరాబాద్‌లో అర్థం కాదు. ఒకప్పుడు హైదరాబాద్‌లో ఉర్దూను శుద్ధి చేయాలని విఫలయత్నం చేశారు. ఉర్దూ అత్యంత అధునాతన భాష. శక్తివంతమైన భాష. గజల్స్ రుబాయెట్‌లు అందరికీ తెలుసు కదా! శ్రామిక ప్రజల భావాలను ఉర్దూ సాహిత్యం గొప్పగా వ్యక్తీకరిస్తుంది. న హింద్ బనేగా, బనేగా న ముసల్మాన్‌కీ అవులాద్ హై అని సాహిర్ లుధియాన్వీ అంటారు.

వైదిక మత సాహిత్యంలోనూ లౌకిక వ్యవహారాలు ఉంటాయి. జనజీవనాంశాలు తెలుస్తాయి. అవి చాలా పరిమితంగానే ఉండొచ్చు. వాటిని తెలుసుకోవడానికి అయినా అవి అధ్యయనం చేయాలి. అంతేకాని రత్నాలు రాశులు పోసి అమ్మారని భ్రమలు పెంచుకోవడం కాదు.

సంస్కృతం చాలా గొప్ప భాష. ఎకానమీ ఆఫ్ ఎక్స్‌ప్రెషన్ - పొదుపుగా వ్యక్తీకరించడం దాన్లో చాలా సులభం. జ్ఞాపకం ఉంచుకోవడానికి వీలైన పద్ధతులు సంస్కృతంలో ఉన్నాయి. అందుకే శ్లోకాలు ఇంత కాలంగా గుర్తుంటున్నాయి. మోడ్రన్ మేధావులు కూడా నాలుగు శ్లోకాలు చెప్పడం ఒక అర్హతగా భావిస్తున్నారు. సందర్భానికి సరిపోతాయా లేదో చూడాలి కాని ఆ భాషనే ద్వేషించకూడదు. పతంజలి శాస్త్రి సుప్రీంకోర్టు న్యాయమూర్తిగా పని చేశారు. గొప్ప తీర్పులు ఇచ్చాడు. సంస్కృత పండితుడు కె.ఆర్. మున్షీ సంస్కృతాన్ని పునరుద్ధరించే కార్యక్రమాన్ని పెట్టుకొని ఆయనను ఉపన్యాసానికి ఆహ్వానించారు. సంస్కృతం ప్రజల నుంచి దూరమైందని ఆయన చెప్పారు. కనుక మనం ఏ దృష్టితో చూస్తున్నామనేది ముఖ్యం. కాళిదాసు శాకుంతలలో కణ్వుడి ద్వారా చెప్పించిన మాటలు సర్వకాలాలకు వర్తించేవే. షెల్లి కీట్స్ వర్డ్స్‌వర్త్ ఇలాంటి మహాకవులలో సార్వజనీనత ఉంటుంది. ప్రపంచమంతట నుంచీ వారు ఉత్తమ భావాలను స్వీకరిస్తారు. తమ భావాలను ప్రసరిస్తారు. 19, 20 శతాబ్దాలలో ప్రపంచ సాహిత్యంలో అత్యుత్తమ రచయితలెందరో ఉద్భవించారు. సర్వాంటెస్, బైరాన్, ఛార్లెస్ డికెన్స్, టాల్‌స్టాయ్, బాల్జాక్ ఇలాంటి వారి గ్రంథాలు చదివి తీరాలి. అవి ఆధునిక యుగపు ప్రవేశద్వారాలు లాంటివి. మార్క్స్, షేక్స్పియర్‌ను ఎంతగానో మెచ్చుకుంటాడు. వారు ఒక భాషకు దేశానికి పరిమితమయిన వారు కాదు. ఆ అత్యుత్తమ సాహిత్యం ఎంత ఎక్కువగా చదివితే అంత మేలు జరుగుతుంది. టాల్‌స్టాయ్ వార్ అండ్ పీస్ ఒక ఎపిక్. నిన్న జరిగిన ఆఫ్ఘనిస్తాన్ యుద్ధం సందర్భానికి కూడా అది వర్తిస్తుంది. నిన్నటి సాహిత్యాన్ని ఎలా అనువదించుకోవాలన్నదే కీలకం.

**మరి ఇటీవలి ఇంగ్లీష్ పుస్తకాల గురించి మీ అభిప్రాయం?**

సాల్మన్ రష్దీ, అరుందతీరాయ్, విక్రమ్‌సేథ్ వంటి వారి పుస్తకాలు చదివాను. నిజానికి ఇప్పటికీ నేను ప్రముఖుల గ్రంథాలను చదువుతూనే ఉంటాను. వీరందరూ చక్కగానే రాస్తున్నప్పటికీ పైన చెప్పిన జాబితాలోకి రారు. రష్దీ పై ఇరాన్ నేత ఖొమేనీ మరణశిక్ష విధించడాన్ని వ్యతిరేకించవచ్చు. కాని ఆ ఒక్క కారణంతో అది గొప్ప గ్రంథమైపోదు. శాటానిక్ వర్సెస్ నవలకు వచ్చిన ప్రచారంతో పోలిస్తే అంత ప్రతిభ దాంట్లో లేదు. దానికి సంచలన శీలత ఉన్నంతగా లక్ష్యశుద్ధి లేదు. మార్కెట్ అనేది ఈ రోజుల్లో పుస్తక ప్రచురణను కూడా శాసిస్తున్నది. ఇంగ్లీషులో ఇది మరింత ఎక్కువ. మా చిన్నతనంలో కొవ్వలి నవలలు ఎగబడి చదివేవారు. అంతమాత్రాన అవి గొప్పవైపోవు. అరుందతీరాయ్ రచనలో రీడబిలిటీ చాలా ఎక్కువ. ఆమె తన మొదటి పుస్తకంలో ఇ.ఎం.ఎస్. నంబూద్రిపాద్ గురించి తప్పుగా రాసినప్పటికీ తర్వాత ఆమె నిర్వహిస్తున్న పాత్ర బాగానే ఉంది.

***మీరు బహు భాషలలో ప్రావీణ్యం పొందడానికి దారి తీసిన పరిస్థితులేంటి?***

అదృష్టమో దురదృష్టమో గాని నేను తొమ్మిది పదేళ్ళ వయస్సులోనే సంస్కృతం, ఉర్దూ, ఇంగ్లీష్ మూడూ నేర్చుకోగలిగాను. ఒక కాజీ, ఒక శాస్త్రి, ఒక బట్రాజు నాకు ఇవి నేర్పించారు. తెలుగుతోపాటు మా అమ్మగారి ద్వారా తమిళం కూడా తెలుసుకున్నాను. ఆంధ్రనామ సంగ్రహం, రుక్మిణీ కళ్యాణం ఇలాంటివి సంస్కృతంలో బాల్యంలోనే చదివాను. నా చదువు ఇంట్లోనే జరిగేది. అది నాన్ ఫార్మల్ విద్య అనవచ్చు. ఆ రోజుల్లో వర్షం రాకపోతే విరాటపర్వం చదివించేవారు. అలా ప్రాచీన కావ్యాల గురించి తెలుసుకున్నాను. 1948లో తెలంగాణాలో రజాకారుల దేశముఖ్‌ల దాడి జరిగినపుడు మా కుటుంబం ఈ కమ్యూనిస్టులకు ఆశ్రమం ఇచ్చింది. మా తాతగారు పెద్ద ఆయుర్వేద వైద్యులు. అప్పట్లోనే పాకలు వేసి సర్జరీ చేసేవారు. పేరు మోసిన విస్నూరు రామచంద్రారెడ్డికి ఆయనవైద్యులు. మూడు నెలలపాటు ఆయన ఆ పాకల్లోనే చికిత్స పొందుతూ ఉన్నారు. మా తాతయ్యకు నజరానాలు పంపారు. రెండు గ్రామాలు మా ఆధ్వర్యంలో ఉండేవి. అయితే మా ఇంట్లో వాళ్లు ఉదారవాదులు. మాకు తెలిసీ తెలియని వయస్సు అప్పట్లో కమ్యూనిస్టు నాయకులు నల్లా నర్సింహులు, యాదగిరి రావువంటి వారు వస్తే మా అమ్మ వండిపెడుతుండేది. వాళ్ళు ఎవరూ చుట్టాలయితే మాకు ఎందుకు చెప్పవని పోట్లాడేవాన్ని. గుంటమయ్య అని ఒక పూజారి ఉండేవాడు. ఆయన కూడా పోరాటంలో పాల్గొని నిర్బంధానికి గురయ్యాడు. చోడవరపు విశ్వనాథం అని ఆయన్ను కాల్చి చంపేశారు. అలాంటి వాతావరణంలో కూడా మా కుటుంబం సంఘానికి అండగా నిలబడేది. నేను తర్వాత కృష్ణా జిల్లా మానుకొండలో

## నివాళి

# ప్రసిద్ధ పాత్రికేయులు రాఘవాచారి కన్నుమూత



ప్రసిద్ధ పాత్రికేయులు, విశాలాంధ్ర పూర్వ సంపాదకులు చక్రవర్తుల రాఘవాచారి(81) అక్టోబర్ 28న కన్నుమూశారు. ఆయనకు భార్య జ్యోత్స్న, కుమార్తె డా. డాలి ఉన్నారు. రాఘవాచారి కోరిక మేరకు వైద్య పరిశోధనల నిమిత్తం ఆయన భౌతిక కాయాన్ని విజయవాడ లోని పిన్నమనేని సిద్ధార్ధ మెడికల్ కాలేజికి అప్పగించారు. రాఘవాచారి వరంగల్ జిల్లా పాలకుర్తి మండలం శాతాపురంలో వరదాచార్యులు–కనకవల్లి దంపతులకు 1939 సెప్టెంబరు 10న జన్మించారు. విశాలాంధ్రలో 1972లో సంపాదకుడిగా బాధ్యతలు స్వీకరించి మూడు దశాబ్దాల పాటు కొనసాగారు. ఆయన బాధ్యతల నుంచి తప్పుకొని 15 ఏళ్లు గడిచినా.. ఇప్పటికీ ఆయన విశాలాంధ్ర రాఘవాచారిగానే జనం మదిలో నిలిచిపోయారు. ఎన్నెన్నో వినూత్నమైన సంపాదకీయాలు తనదైన శైలిలో రాసి ఆ పత్రికకు గొప్ప సొబగులు తెచ్చారు. చరిత్ర లోతుల్ని శోధించి గంభీరంగా మాట్లాడే నేర్పు ఆయన సొంతం. సంస్కృతం, తెలుగు, ఆంగ్లం, ఉర్దూ భాషల్లో ఆయన పండితుడు. ప్రాచీన సాహిత్యం, మార్క్సిస్ట్ గ్రంథాలపై ఆయనకు ఎనలేని పట్టు ఉండేది. విద్యార్థి దశలోనే ఈయనపై ముఖ్దూమ్ మొహియుద్దీన్, శ్రీశ్రీల ప్రభావం పడింది. న్యాయ శాస్త్రంలో విద్యనభ్యసించిన రాఘవాచారి న్యాయవాద వృత్తిని కాకుండా పాత్రికేయ రంగాన్ని ఎంచుకున్నారు. సాహితీస్రవంతి, సాహిత్య ప్రస్థానం తరఫున ఆయనకు జోహార్లర్పిస్తున్నాం. ◆

---

చేరాను. మా మేనమామ కాంగ్రెస్‌లో పని చేసేవారు. తర్వాత 1949లో సికింద్రాబాద్ వచ్చాం. మగ్దుం, శ్రీశ్రీ రచనలు, ఎర్రజెండాలు వంటి పుస్తకాలు అప్పుడే చదివాను. విశాలాంధ్ర చదువుతుండేవాడిని. ప్రత్యేకించి మోటూరి హనుమంతరావుగారి రచనలు నాకు ఎంతో నచ్చేవి. అందుకే ప్రజాశక్తి ప్రారంభ సభలో పాల్గొన్నప్పుడు ఆ విషయం ప్రత్యేకంగా చెప్పాను. అన్నయ్య ఆర్‌టిసిలో పని చేసేవాడు. విద్యార్థి ఉద్యమంలో పని చేస్తూ క్రమంగా కమ్యూనిస్టునయ్యాను. ఉస్మానియా యూనివర్శిటీలో పియుసిలో మెరిట్ లిస్టులో ఆరోవాడిగా వచ్చాను. బిఎస్‌సి, ఎల్‌ఎల్‌బి చేశాను. జీవన విధానంలో మాత్రం సంప్రదాయ ఛాయలు ఉండేవి. ఉదాహరణకు చాలా కాలం పిలక ఉండేది. అందుకే పార్టీ సభ్యత్వం తీసుకోలేదు. 1959–60లలో చివరిసారి తద్దినం పెట్టి ఇక మీదట పెట్టనని ప్రకటించి కమ్యూనిస్టు పార్టీ సభ్యుడినయ్యాను. వివిధ పత్రికలలోనూ, తర్వాత పేట్రియాట్ విలేకరిగానూ పని చేశాక విశాలాంధ్ర సంపాదకత్వం స్వీకరించాను.

***మీ అధ్యయనం రచనా పద్ధతి గురించి చెప్పండి?***

రాజకీయాలు, సాహిత్యం చదవడానికి చాలా ప్రాధాన్యతనిస్తాను. ఇప్పటికీ రోజుకు రెండు గంటలయినా చదవాల్సిందే. ప్రాచీన సాహిత్యం చదివిన ఉటంకించినా దాన్ని ప్రస్తుతానికి ఎలా అన్వయించాలని తప్ప గతం పై వ్యామోహంతోకాదు. నాకు రాయడం పైన, రాజకీయాలపైన ఉన్న ఆసక్తితోనే లాలో మంచి స్టూడెంట్‌ని అయినప్పటికీ ప్రాక్టీసు చేపట్టలేదు. అందులోనూ హిందూ ధర్మ శాస్త్రాన్ని ఆప్షనల్ సబ్జెక్టుని చాలా లోతుగా చదివాను. అయినా పార్టీలో పని చేసేప్పుడు ఇవన్నీ ఎందుకనే భావం...

***చాలా మందితో పోలిస్తే మీరు రాసిన పరిమాణం తక్కువ, ఉపన్యాసాలకు కేటాయించే సమయం ఎక్కువ అనిపించదా?***

నిజమే! మనం రాయకపోతే నష్టమేమిటి? అనే ధోరణి దీనికి చాలా వరకూ కారణం. అది పొరపాటే అయి ఉండవచ్చు. పైగా రోజువారీ రొటీన్‌పనులు వీటి మధ్య రాయాల్సినంతగా రాయలేదేమో! రాసినవి కూడా భద్రపర్చుకోలేదు. ఇక ఉపన్యాసాలు అంటే ప్రజాజీవితంలో భాగంగా అవి తప్పని సరికదా!

***(సాహిత్య ప్రస్థానం పత్రిక 2002లో ప్రారంభించటానికి ముందు ప్రస్థానం పేరుతో వెలువరించిన ప్రత్యేక సంచిక నుండి)*** ◆

కథ




# పాడె మహోత్సవం

- డా॥ వి.ఆర్.రాసాని
9848443610

మార్చిమాసం ... ఎండాకాలం... ఆరంభం. తంబళ్ళపల్లెమండలం... మేకలవారి పల్లె... రాశింటి ముందర... నడి వీధిలో మల్లేశు కుక్కల ఆట...పాట...

ఒక కంచుతట్టలో.... సగం కొట్టేసిన కపాలం ఆకారంలో బొచ్చెం.... పల్లోళ్ళు వేసే బిచ్చం ఆ బొచ్చెంలో వేయించుకుని దమరుకం వాయిస్తూ పాట పాడుతున్న సహస్ర పూర్ణిమలను సందర్శించిన గురువు.. గౌరవ బీరప్ప...

నిత్య కరువులతో ఎడారిని తలపింప చేస్తూ, శిథిలమైపోతున్న పురాతన ఖిల్లాలాంటి.. అనంతపురం జిల్లా, కదిరిప్రాంతపు తనకళ్ళు మండలం, ఎద్దుల వారి పల్లె నుంచి వచ్చిన అష్ట సంఖ్యా గౌరవయ్యలు... గురవయ్యలు... అండే కురవయ్యలు... మల్లేశు కుక్కలు ఆడిపాడే గౌరవ నృత్యం..

అది చూడడానికి గుంపుగా చేరిన పల్లె జనం.. నెత్తిన మూరెడెత్తు భల్లూక చర్మం టోపీ, బ్రాహ్మల జంధ్యం మాదిరి రెండంగుళాల వెడల్పుతో బొజ్జపైన వ్రేలాడుతున్న అద్దాలపట్టీ.... గొర్రెల బొండంతో అల్లిన కంబడితో కుట్టబడి మిడిమెలదాకా వ్రేలాడుతున్న నల్లగౌను జారకుండా నడుముకు బిగించిన గవ్వల పట్టీ....

మిలమిల మెరుస్తున్న అద్దాలపట్టీ, చింతగింజలంత తెల్లటి శంఖాల మాదిరి వున్న గవ్వలమర్చిన.. నల్లటి పట్టీ... చిరుమెరుపులు... కుడిచేతిలో పెద్దదమరుకం... ఒగ్గు.. శివయ్యభక్తికే వారిమొగ్గు.. ఎడమచేతిలో నిలువు పిల్లంగట్టె, కాళ్ళకు గజ్జలు...

ఒగ్గులనుంచీ పుడుతున్న దమదమదమక్కు... దమదమక్క్ శబ్దం.. ప్రేక్షకుల గుండెల లబ్ డబ్..లబ్‌డబ్ శబ్దంతో లయిస్తోంది. నిలువు మురళినుంచీ వినిపిస్తున్న కుయ్.... కుయ్ నాదం.. వసంతకోకిలల కుహూ.. కుహూ రాగాన్ని తలపింపచేస్తోంది... నాటక దరువులకు సరిపడా టింగ్ టింగ్‌న పడే తాళంలా గల్... గల్... గజ్జల సవ్వడి...

లయకారకుడైన శివుడు అష్టవిధ జంగమ రూపాలలో చేస్తున్న తాండవ నృత్యంలా... అక్కడి దృశ్యం...

నేలపైన... కంచు తట్టలో శివునిబొమ్మ, దారిముందర కపిరి.... ఆ తట్ట చుట్టూ భల్లూక పాగాల చింపిరి చింపిరితో వంగుతూ లేస్తూ.... ఒగ్గులు, పిల్లంగట్టెలు వాయిస్తూ... వలయాకారంలో గౌరవయ్యల అడుగులు... ముసలిబీరప్ప ఆయాసంతో "మల్లన్న కొండన వెలసిన ఓ మంజునాథ"... అని పాడుతూంటే... వారినోట శివస్తుతి.... మదినిండా శివభక్తి...

స్తుతి... భక్తి... అదే వారిమతి... నిత్యగతి... శివరాత్రికి నాలుగు నెలల ముందునుంచీ చేస్తున్న శివయాత్రాదీక్ష..వారు వీరశైవభటులు, మైనరు స్వామి భక్తులు, బీరయ్య దేవుని దాసులు... బసవయ్య శివతత్వసార ప్రచారకులు..

మల్లయ్యదారులు...

ప్రతి అడుక్కు... డమడమక్కు...ఒగ్గు....

ప్రతి కులుకుకూ.... కుయ్యి.... కుయ్యి... పిల్లంగట్టె....

గొంతునరాల పైకి తేలిపోయే విధంగా పెద్దస్వరంతో బీరప్ప ఆలపిస్తున్న మంజునాథ స్తుతి గేయం... పెంజరి, నాగసర్పం పెనవేసుకుని సరసాలాడుతూ కనువిందు చేసినట్లు కలిసిపోయి కలిగిస్తున్న వీనుల విందు.

సగం భయం... సగం వినోదం....

భయం... వినోదం... కలసి శివభక్తితో కూడిన మల్లేశు కుక్కల చిందు... వారికి పల్లె ఇల్లాండ్రిస్తున్న దినబత్యం... కపిరిబొచ్చెలో గ్రహించి, జోలెలోకి జారవిడుస్తున్న గొరవగురువు బీరప్ప... రెండు నెలలుగా ఖంగుఖంగున దగ్గుతూ, ఆయాసపడుతూనే ఎంతో ప్రయాసతో ...శివగీతం ఆలపిస్తున్నాడు".

ఊరి ముత్తైదువులిస్తున్న ఉప్పు పప్పు, తంత్రిణీఫలం.... మిరపకాయలు మరో సంచిలో మోస్తూ వారి వెంట నడుస్తున్న పిల్లగొరవడు గొరవనరసింహులు....

ఆ నృత్యంలో వారిది వలయాకారపు కక్ష్య... వారిది ఆరుమాసాల బ్రహ్మ చర్యదీక్ష.. హరుడిపట్ల భయం... భక్తి వారిదీక్ష... ఆ శివదీక్షలో ఆడవారి చేతివంట తాకరు... స్త్రీల చేతినీరు తాగరు... వారి వంట వారిదే... వారి నీరు వారిదే... ఈ కాలంలోనూ ఇలాంటి సంప్రదాయం అరుదే...

అష్టపౌర్ణిమల కాలంనుంచీ పల్లె పల్లె తిరుగుతూ శివరాత్రి నాటికి ఆ పల్లెకి చేరిన అష్టసంఖ్యా గొరవయ్యల శివయాత్ర రామగోవిందస్వామి శవయాత్రతో ముగుస్తుంది.

గొరవయ్యల శివయాత్ర... రామగోవిందస్వామి శవయాత్ర... శివయాత్రా.... శవయాత్ర.... మల్లన్న కొండకు వెళ్ళి శివదర్శనం చేసుకుని తలనీలాలర్పించుకుని సొంతగూళ్ళకు తిరుగుప్రయాణం మేకలవారిపల్లెలో రాశింటి వాడైన నందూరి వారి యింటిముందర నడివీధిలో.... అప్పటికే రామగోవిందస్వామి శవయాత్రకు... పాడెమహోత్సవం సిద్ధం...

ఇరుగుపొరుగు జిల్లాల్లో వున్న గొరవయ్యలప్పటికే చాలామంది అక్కడికి హాజరు. అందరిదీ అదే వేషం... అదే ఒగ్గు... నిలువు మురళి నాదం... అదే నృత్యం....

ఆ నడివీధి శివుడుండే ఒక శ్మశానంలాగా, గొరవయ్యలే ప్రమదగణంలా అనిపిస్తోంది.

వీధి శ్మశానం.... గొరవయ్యల ప్రమదగణం....

కొత్తవెదురు బొంగుల మధ్య దబ్బలు కట్టి, వాటిపైన వరిగడ్డి పెట్టి.. ఒక వైపున కొత్తచట్టిలో... పొగలు గక్కుతున్న వేడి వేడి పిండాన్నం...

అయిదడుగుల రెప్పాల కొయ్యతో చేసిన దున్నకట్టెను తెచ్చి నేలపైన పెట్టి శవానికి బదులుగా దానికి స్నానం చేయించి పాడెపైన పెట్టారు... అది రామగోవిందస్వామి వాడిన చేతికర్ర... ఇప్పుడతనులేడు.. అతని బదులు ఆ కర్ర.. "సచ్చినావా బతికినావా జజ్జనకరాజా" అన్నట్లు మాదిగల భుజాలకు తగిలించుకుని, బొజ్జల పైన పెట్టుకున్న పలకలపైన చావు దరువులు...

మధ్య మధ్యలో ఉరుములు ఉరిమినట్లు 'S' ఆకారపు కంచు కొమ్ముల శబ్దాలు.

మరోవైపు... "అన్న రావణ ఆలకించుము విన్న వించద నాయకా...ముక్కు చెవులు తెగిన శూర్పణఖ.. సౌమిత్రి దౌర్జన్యాన్ని రావణుడికి విన్నవించే కోలాటపాట...

యింకోవైపు...."ఏమమ్మా సీతమ్మ పిలిచిన పలుకవు... పిలచిన పలుకవు కన్నెత్తి చూడవు" అంటూ అశోకవనంలో సీతను చూసిన హనుమంతుని సందేశపు ఘట్టంతో సాగే చెక్కభజన...

వారికవతల గజం పొడవుతో పిల్లంగట్టెలకు వ్రేలాడదీసిన నెమలీకల కుచ్చులతో... మధ్య వెడల్పాటి తాళాలు వాయిస్తూ.. " సింతలోళ్ళపల్లి చిన్నప్ప రెడ్డప్ప పిల్లోళ్ళో కొట్టేది న్యాయామా... నేనుగాదు కొట్టింది. నాచేతులకొట్టాయి రెడ్డితో చెప్పేది న్యాయమా" అంటూ పిల్లంకట్టెలపైన పలికిస్తూ పిల్లంగట్టెల నృత్యం....

"రంగరారా.... పండరినాధారారా...." అంటూ పాండురంగ భజనకారుల కీర్తనా అక్కడే...

"మహాత్ముడివయ్యా.... రామగోవిందస్వామి... నందూరి వంశాన ఆణిముత్యమా.... రామగోవిందస్వామి" అంటూ పాడెముందర చనిపోయిన వారి చరిత్రను గానం చేసే చలమ్రాల చిందులాట...

భజనలు... చిందులు...

ఉరుములు – ఉద్వేగగీతాలు...

ఒకవైపు చావుదరువులు... మరోవైపు భజన గేయ లఘువులు. ఇటు విషాదఛాయలు... అటు వినోద

కళాకారులు...

అక్కడే విషాదం.. అక్కడే వినోదం..

ఒకేసారి.. ఒకే చోట సుఖం.. దుఃఖం..

అదే పాడె... అదే ఉత్సవం.. వినోద పాడోత్సవం..

ఉత్సవం..? మెరవణి..?

శవాన్ని మోసుకెళ్ళే పాడెకు ఉత్సవం ఏమిటి?

టపాసులు కాల్చడం... ఈలలు... దప్పుల కనుగుణంగా అడుగులేయడం... తారాజువ్వలొదలడం....

అది చూసి తరించడానికి చుట్టుపక్కల నుంచీ వేలమంది జనం...

వీధివంకలో తేలిన జనప్రవాహం...

ఆ ప్రవాహంలో కొట్టుకుపోతున్న... పాడెమహోత్సవం.. పాడెపైన కదులుతున్న రెప్పాల దున్నికట్టె... దాని ముందర వీధిపొడవునా... జానపద దృశ్యకళారూపాల ప్రదర్శనలే...

ఆ ఉత్సవం చూడడానికి రెండు కళ్ళు చాలడం లేదు.

అనారోగ్యంతో ఆయాసపడుతూనే... తూలుతూ నిస్సత్తువగా వున్నా... గొరవయ్యలు వలయంలో నిలబడి

'వెలసినావు నందూరి వంశంలో రామగోవిందస్వామి..

నారపరెడ్డి పేరు మార్చావు రామగోవిందస్వామి"

అని పాడుతూనే వున్నాడు బీరప్ప.

పీకలదాకా తాగి ఊగిపోతూ మాదిగల కొడుతున్న పలకలపై తాండవమాడుతున్న చావు దరువు.

కళాకారుల చేతివ్రేళ్ళ మధ్యం కోడిగుడ్డు ఆకారంతో కదులుతున్న చెలమ్రాల్యబడే పెద్ద గగ్గిరెట్టల (మువ్వల) గల్లు గల్లు శబ్దం..

కోలాటంలో కోలలు కొట్టే చప్పుడు..

చెక్కభజనల్లో .. చారెడు వెడల్పు చెక్కల చప్పట్లు...

రంగభజనకారుల కాళ్ళ గజ్జల సద్దు....

ఎలుగొడ్లమందలా కనిపించే గొరవయ్యలు ఒగ్గుల డమడమక్కులు.. నిలువు వేణువుల కూనిరాగాల కుయకుయలు...

అక్కడ ప్రధాన ఆకర్షణ గొరవనృత్యమే..

ప్రతి ఇంటి ముందరా చల్లిన కల్యాపునీళ్ళ వాసనలు.. ముంగిట వాలిన ముచ్చటైన ముగ్గులరేఖలు...

ప్రతి ఇంటి గుమ్మానికీ వ్రేలాడుతున్న పచ్చటి అమ్రపత్ర తోరణాలు.. వీధిలో పాడెమహోత్సవ సంబరాలు....

అన్నీ ఒకేచోట.. గందర గోళాలు....

ఈ విషాద....వినోద పాడె విహారానికి.. మోదంతో చేసే పాడెమెరవణి.. దాని ముందర పాడే మెరవణి గద్యలు..

అసలాపాడె మహోత్సవానికీ, మల్లయ్యదారుల మందకీ సంబంధ మేమిటి? వారేమో వీరశైవులు... రామగోవిందస్వామి... పేరులోనే వైష్ణవతత్వం...

ఒకేచోట శైవం.. వైష్ణవం.. మతసామరస్యం...

అసలు పాడేమిటి? ఉత్సవమేమిటి? వినోద విషాదాల కళాప్రదర్శన లేమిటి?

ఆ ప్రశ్నలకు జవాబులు కావాలంటే...

కాలం కార్యాలయంలోకి దూరాల్సిందే...

గతం జోలెలోకి చేయి జారాల్సిందే..

ఆ కార్యాలయంనుంచీ ఓ దస్త్రం తీసి చదవాల్సిందే..

ఆ జోలెనుంచీ తీసిన విబూది వుండను నొసటకు రాసుకోవాల్సిందే..

అలా చేసిన తర్వాత ఆ దస్త్రం పఠిస్తే. తెలిసేది... ఆ దస్త్రం... 170 సంవత్సరాల నాటిది.-

ఆనాటి జ్ఞాపకం... ఆ విబూది...

♦♦♦

చిత్తూరు జిల్లా తంబళ్ళ పల్లె మండలం.. మేకల వారిపల్లెలోని పైరు జీవన రైతు నందూరి నరసింహారెడ్డి.. జ్యేష్ఠ పుత్రుడైన నందూరి నారపరెడ్డి జీవిత విశేషాలే మనగా....

1825వ సంవత్సరం.. శివరాత్రినాడు కన్ను తెరచిన నారపరెడ్డి... మల్లన్న కొండన వెలసిన శివుడి వరాన పుట్టినవాడు.. అతని తర్వాత అయిదేండ్లకి.. అతని తమ్ముడు రెడ్డప్పరెడ్డి పుట్టాడు. నారపరెడ్డి బుద్ధి తెలిసినప్పటినుంచీ ధ్యానం, యోగాసనాలు.. తోటి వయసువాళ్ళకు ఆధ్యాత్మిక ఉపన్యాసాలు చేసేవాడు, పదహారేండ్లు వయసులోనే సన్యాసుల్లో కలిసిపోయి రామగోవిందస్వామిగా పేరు మార్చుకున్నాడు. .హిమాలయాలకు వెళ్ళి తపస్సు చేసి కొన్ని మహత్యాలు కూడా సాధించాడు.. కన్యాకుమారినుంచీ హిమాలయాల వరకు తిరిగాడు.

మంచుకొండలు.. మహత్యాలు.. తిరుగుడు తిరుగుడు ఒకటే తిరుగుడు. పొద్దుతిరుగుడు పువ్వు సూర్యునివైపు తిరిగినట్లు.. నిర్విరామ తిరుగుళ్ళు.. ఆ తిరుగుడులో కాశీ విశ్వేశ్వరుణ్ణి సేవించి, గంగలో స్నానించి, ప్రయాగలో

పడకోనున్న సమయంలో.... కల... ఆ కలలో... శివుడు గౌరవయ్య రూపంలో కనిపించి డమరుకం వాయిస్తూ, కుయ్ కయ్‌మని నిలువు మురళి వాయిస్తూ.. తాండవం చేస్తున్నట్లు ఎగురుతూ.. 'సర్వం నేనే, నా భక్తులు గౌరవయ్యల దళం... మల్లేశు కుక్కలనబడే.. శివదీక్షాతత్పరులు'... వారిమాటల్లో, పాటల్లో వేసే ప్రతి అడుగులో నేనే.. వారి ఒగ్గు శబ్దంలో, పిల్లంగట్టె కూతల్లో.. నేనే ప్రతి అణువులో నేనే నీలో నేనే...నాలో నీవే.. చావులో, మరణంలో నేనే. తిండిసారంలో తిరుగుడు పాదాల్లో... కంటిచూపుల్లో గాలిఊపిర్లలో... అంతటా నేనే వుంటాను. నిదానించి చూడు'' అని చెప్పి అంతర్ధానమైపోయాడు. కలలో శివదర్శనం కలిగినందుకు సంతోషపడిపోయి, ఆ కలలో శివుడు చెప్పిన మాటల్తోనే అతనికి జ్ఞానోదయం కలిగినట్లు భావించాడు.

కల... కలలో శివుడు... శివుడి మాటల్తో జ్ఞానప్రాప్తి..

ఆ ప్రాప్తితో నారపరెడ్డి మనసుకున్న జిడ్డునార ఏదో తొలిగిపోయినట్లే అతనికున్న అసలుపేరు... పోయి రామగోవిందస్వామి పేరే స్థిరపడిపోయింది. అందుకే మొదటిపేరే మరిచిపోయాడు.. జ్ఞానగోవిందుడయ్యాడు.

ఆ ప్రయాగలో గౌతముడికి జ్ఞానోదయం అయింది. ఆ ప్రయాగలోనే రామగోవిందస్వామికీ శివతత్వ జ్ఞానం కలిగింది. ఇక అప్పటినుంచీ గౌరవయ్యలతో ఎక్కువగా తిరిగేవాడు. వారికి తను కనుగొన్న జీవనరహస్యాలు తెలియజేసేవాడు.. ఆ విధంగా శివప్రమదులయిన గౌరవలకు... గౌతమ బుద్ధుడైనాడు గోవిందస్వామి..

''ఈ మనిషి జీవితం బుద్బుద ప్రాయం.. సూర్యోదయాస్తమయాల వలె చావుపుట్టుకల పునరావృత చక్రభ్రమణం.

చావు.. పుట్టుక.. భ్రమాతి భ్రమణం...పుట్టిన ప్రతిజీవికీ చావు తప్పదు. చచ్చిన ప్రతిజీవీ మళ్ళీ జనించకా తప్పదు. పుట్టుక తొలిసంధ్య... మరణం మలిసంధ్య...

సంధ్య... సంధ్య...

తొలి..మలిసంధ్యలు...

ఈ ద్విసంధ్యల మధ్య ఊగిసలాడే వెలుగు జీవితం... అదే ప్రేమ.. దాన్ని అందరికీ పంచాలి.. ఆదర్శవంతం, ఆధ్యాత్మిక చింతనామయం కావాలి.

జీవి దిశమొలలతో పుడుతుంది... దిశమొలలతోనే వెలుతుంది." అని రకరకాలుగా చెప్పేవాడు.

ప్రయాగలో బుద్ధుడిగా మారిన గౌతముడు తను కనుగొన్న జ్ఞానాన్ని ధర్మచక్రరూపంలో అందరికీ తెలియజేస్తూ తన సొంత నగరమైన కపిలవాస్తుకు చేరుకున్నట్లే... ఆ ప్రయాగలోనే... రామగోవింద స్వామిగా జ్ఞానాన్నిపొంది.. గెడ్డం, మీసాలు గోగునారలా మారిన తర్వాత తన ఊరైన మేకల వారి పల్లెకు చేరుకుని.. "నర జన్మ రహస్యాన్ని జరామరణాల రీతిని తన 'పాడె మహోత్సవ' రూపంలో తెలియచేయడం ఆరంభించాడు" రామగోవిందస్వామి.

ప్రతిఏడూ శివరాత్రినాడు తన శవయాత్ర జరిపించాలనుకున్నాడు. తన పొలంలో గుంతతవ్వుకొని, తాను చనిపోయిన వాడిలాగానే పాడెకట్టించి, ఆ పాడెపైన తను శవంలా పడుకుని, ఆ పాడెను బంధువులచేత మోయిస్తాడు'. మధ్యలో దింపుడు కల్లెం వుండనే వుంటుంది. గుంతదగ్గరకు తీసుకెళ్ళింతర్వాత శవంలాగానే తనను గుంతలో దింపించుకొని, పిడికెడు పాతబియ్యం, చారెడు వాతమన్ను, ఎదపైన చల్లించుకొని పైకిలేచి గట్టుపైకొస్తాడు, అందర్ని చూసి ఇలా అంటాడు.

"ఇదీ నా శవయాత్ర.. మోక్షంపేరుతో శివుడిలో చేరిపోయే యాత్ర.. శివయాత్ర, శివయాత్ర.. శవయాత్ర... ఉత్సవం.. పాడెమహోత్సవంతో సాగే కడపటి యాత్ర.. చావు పుట్టుకలు తిరిగి రాకుండా చేసే యాత్ర... మనిషి పుట్టడం.. గిట్టడం.. సహజం. బతికున్నన్ని రోజులూ మంచిచేసి, నలుగురికి సాయపడితే... మరోజన్మలేకుండా శివునిలో ఐక్యం కావచ్చు. అది తెలపడానికి ఈ యాత్ర..."

మనిషి చనిపోయిన తరువాత, తొమ్మిదోరోజో, పదకొండోరోజో పెద్ద కర్మచేసి సమారాధన జరిపిస్తారు కదా... అది కూడా ఆయనే జరిపిస్తాడు.. అదీ ఆరోజే జరిపిస్తాడు.. ముందే ఏర్పాటు చేసుకున్న బ్రాహ్మణున్ని పిలిపించి పిండాన్నం పెట్టించడం వంటివన్నీ చేయిస్తాడు.. ఈ సమారాధనకు ముందు పక్కనే తమ మామిడితోపులో ఆడుతున్న బెల్లంగానుగ దగ్గరకు వెళ్ళి పెద్దపెనంలో గబక్ గబక్ శబ్దంతో కాగుతున్న చెరకు పొలాల్లో చేతులు పెట్టి, బెల్లంపాకంను దోసిళ్ళతో మూడుసార్లు పైకి తీసుకుని తాగుతాడు...

పాడెను ఊరేగించేటప్పుడు, బెల్లం పాకం తాగేటప్పుడు మాదిగల డప్పులు, ఆసాదివాళ్ళ పంబలు, కొమ్ములూదడాలు,

చెలమాలనృత్యాలు, కోలాటాలు, భజనలు, గొరవయ్యల చిందులు అన్నీ వుండనే వుంటాయి. అయితే ఈ తంతంతా గొరవయ్యల నిర్వహణలోనే జరగడం విశేషం..

రామగోవిందస్వామి చేతిలో రెప్పాల కొయ్యతో చేసిన ఊతదున్నికర్ర వుంటుంది.... ఆ "ఊత కర్రను అతను ఎప్పుడూ యామారదు.. పడుకున్నా పక్కనే పెట్టుకుని పడుకుంటాడు..

సహస్ర పౌర్ణిమలు దర్శించిన పండు ముదుసలి వయసులో పాడెమహోత్సవం చేస్తూ.. గుంతలో దిగగానే .. గొంతులో గాలి ఆగిపోయి తిరిగిలేకుండా శవమై పోయాడు. గొరవయ్యలు అతని పార్థివ శరీరాన్ని అక్కడే పాడేశారు..

విచిత్రంగా ... అతను పుట్టినరోజు శివరాత్రి... తనువు చాలించిందీ శివరాత్రి.. అలా శివరాత్రిరోజే పుట్టడం, గిట్టడం జరగడం కూడా అతని మహత్యంలో ఒక భాగమనుకున్నారు జనం.

ఆ తర్వాత అతని తమ్ముడు నందూరి రెడ్డప్పరెడ్డి అక్కడ సమాధి కట్టించి, అన్న పైనున్న గౌరవంతో... ప్రతిసంవత్సరం... శివరాత్రినాడు... పాడెపైన అన్నవాడిన ఊతకర్ర రెప్పాల దున్నికర్ర నుంచీ పాడెమహోత్సవం.. జరిపిస్తూ వచ్చాడు. ఆ తర్వాత అదే ఆ వంశానికే గాక, ఆ ఊరికే పాడెమహోత్సవం... జరపడం ఆనవాయితే అయిపోయి ఆ ఊరి ఉత్సవాలలో ఒకటిగా మారిపోయింది.

♦♦♦

రామగోవిందస్వామి జీవిత దస్త్రం.. మళ్ళీ కాలం కార్యాలయంలోకి, అతని జ్ఞాపకాల విబూది వుండ తిరిగి గతం జోలెలోకి జారిపోయాయి.

♦♦♦

పాడె మహోత్సవానికి హాజరైన పలు ప్రాంతపు గొరవయ్యలు గోవిందస్వామి సమాధి దగ్గర జానెడెత్తు కపిరిపెట్టి, అందులో పాలుపోయించి, దానిచుట్టూ చేరి ఢమరుకాలు వాయిస్తూ.. ఆ పాలను కుక్కల్లా గతుకుతూ.. నాలుకలు చాచి మొరుగుతూ గొరవయ్యలు చిందులేస్తున్నారు.

బీరప్పా.. పాలగతుకుడులో... వంగిలేస్తూ... లేచివంగుతూ అవస్థపడుతున్నాడు. వయసెక్కువ.. అనారోగ్యమూ ఎక్కువే..

'నందూరి వంశాన అవతరించిన నంది దేవుడా
పాడె ఉత్సవంలో హరుని చేరిన – రామగోవిందసామి
శివరాత్రి దినాన... శివుని చేరుకుంటివా
శివుని నెలవైన కైలాసం చేరితివా.. రామగోవిందసామి

తన్మయత్వం.. భక్తి...గొంతుచించుకుని పాడుతున్న అతని పాటలో....

ఆవేశం... ఆయాసం.. అతని మేనిలో...

తట్టుకోలేక తలవంచి, కపిరి పక్కనే, నాలుక చాచి కుక్కలా వంగి, పాలునాకుతున్న భంగిమలోనే... అతను కదలలేదు...మెదలలేదు...ఊపిరీలేదు..ప్రాణం విడిచిన అతని దేహం విగ్రహంలాగా అలాగే ....

అంతవరకు పాడెపై ఊరేగిన రెప్పాల దున్నికట్టె... గోవిందస్వామి పాడెపైన..

సమాధిచుట్టూ... గొర్రెల మందలా వచ్చి చేరివున్న జనం..

రాశింటి నాలుగోతరం మనిషైన నందూరి రాఘవరెడ్డి.... గొరవయ్యల గురువును... పాడెపక్కకు చేర్పించి "ఇక్కడే సమాధి చేసేద్దాం" అన్నాడు.

బీరప్ప శిష్యబృందం వప్పుకోలేదు.

"ఊర్లో అయినోళ్ళు, పాలోళ్ళు, కడసారైనా బీరప్ప గురువు ముఖాన్ని చూసుకోవాలగదా" అన్నారు.

రాఘవరెడ్డి కురబలకోటలో తెలిసిన మిత్రుడికి అంబులెన్స్ కావాలంటూ ఫోన్ చేశాడు

"శివా!శివా!హర!హరా!" అన్న గొరవల ఏడుపులతోను, "గోవింద! గోవిందా" అన్న జనం అరుపులతోను ఆ కాన ప్రతిధ్వనించింది.

అరగంట తర్వాత వేగంగా వస్తున్న అంబులెన్స్ హార్న్ శబ్దం గుయ్యిగుయ్యి అంటూ దూరం నుంచీ వినిపించసాగింది.

పాడెమహోత్సవంలో శవంలేని పాడెపక్కనుంచీ, ఎద్దుల వారిపల్లెలో సిద్ధమయ్యే పాడెపై చేరడానికి బీరప్ప శవం బయలు దేరింది.

ఇక్కడ ఉత్తుత్తి పాడె.... అక్కడ సిద్ధంకాబోయే నిజమైన పాడె.

♦♦♦

**(ఇది మేకలవారి పల్లె దగ్గరున్న రామగోవిందస్వామి సమాధిచరిత్ర ఆధారంగా రాసిన కథ)**



## కవిత

# గెడకత్తి

- మెట్టానాగేశ్వరరావు
9951085760

మేడలున్నోళ్లకు
తెలియకపోవచ్చు
మేకలున్నోళ్లకు మాత్రం
గెడకత్తి
నిత్యం చొక్కా ధరించినట్టు
భుజాన అలంకరిస్తారు!



చిటారుకొమ్మనెక్కిన
ముళ్ల కోరింతరొట్ట
గెడకత్తిని చూడగానే లొంగిపోతుంది
చుట్టాకులరొట్ట
చుట్టాలకు పెట్టిన విందులాగ వుంటదని
మేకలు చెప్పాయనుకుంటా
గెడకత్తి హుషారుగా కోసి వడ్డించింది..!
బరింకరొట్ట కంచిత్రం కాయలు ఏవైనా
మేకలడిగితే చాలు
ఆకాశాన్నైనా అందుకుంటానంటూ
గెడకత్తి ప్రసన్నత ప్రదర్శిస్తుంది..!

మేకలికాపరి
అన్నం పట్టుకెళ్లడమైనా మరిచిపోతాడెమో గానీ
గెడకత్తి లేకుండా గడపైనా దాటడు
మేకలడొక్కల్లో లోయల్ని చూడలేక
ఏ చెట్టుపై ఏ రొట్టతీగలు పాకాయో కనిపెడతాడు

ఒక వేళ గెడకు అందకపోతే
బొటనేలు మీద నిలబడి
మేకల గొంతుల్లో నెమరేతను సాధిస్తాడు
తన ఆకలిధ్యాసని పక్కనపెట్టి
మేకలాకలి తీర్చడంలో అమ్మలా అనిపిస్తాడు!

అతడికి
పోగేసుకోవడమంటే రొట్ట పోగేయడమే
మేకపెంట పోగేసి
సారవంతమైన పంటకు భరోసానివ్వడమే..!
అతడిని
గెడకత్తి మూలాలహద్దు దాటనీయలేదు!

నాకూ ఓ గెడకత్తి కావాలి
మేకలకు రొట్ట కోయడానికి కాదు...
నాకందకుండా పెరిగిపోతున్న
దుర్గుణాల డొంకను కోసి పారేయడానికీ..! ◆

---

# వాన వాసన

- గాజుల పవన్ కుమార్
9866265005

అందచందాల విరులు కాస్తేనో
అష్టగంధాల అత్తరు పూస్తేనో
గుభాళించే పరిమళం కాదది;
మరుమల్లెల మహత్తు నుండో
గులాబీల ఘుమఘుమల నుండో
ప్రభవించే ద్రవ్యసారం కానేకాదది-

మట్టిని తొలకరి ముద్దాడితే
తొణికే తుంపర్ల సౌరభమది;
పుడమిని వర్షం కౌగిలిస్తే
ఒలికే భూధూళి ధూపమది;



మట్టి-వానల సమ్మోహనంలో
చిలికే సహజ సాంబ్రాణియది.

'వాన వాసన'ని శ్వాసించాలంటే
పెండతో అలికిన వాకిట్లలో
పంటలో మలిచిన మడికట్లలో
తాపీగా నిల్చుని పీల్చు
మట్టివాసనలో మమేకమై పీల్చు ◆

విశ్లేషణ

# కొడవటిగంటి కుటుంబరావు 'అనుభవం'



- డా॥ యస్. జతిన్ కుమార్
9849806281

1930ల నుంచి 80ల వరకు యాభై ఏళ్ళ పాటు సాహిత్య సృష్టిలో తలమునకలైనవాడు కొడవటిగంటి కుటుంబరావు. కథ, కథానిక, నవల, వ్యాసం, గల్పికలవంటి ప్రక్రియలతో మన సాహిత్యాన్ని సుసంపన్నం చేసినవాడు, సాహిత్య చరిత్రలో తనకో సుస్థిరస్థానం కల్పించుకోవటమే కాదు, అభ్యుదయ సాహిత్యానికే ఒక స్థానం పదిలపరిచిన ప్రతిభామూర్తి, ఆధునిక వచన రచనా వికాసానికి ఊపిరిగా మారినవాడు, కథానికారచయితలకు మార్గదర్శిగా ఎదిగినవాడు కుటుంబరావు (కొ॥కు॥). శాస్త్రీయ ఆలోచనా విధానం, మార్క్సిస్టు సామాజిక దృక్పథం, మానవతాప్రమాణం అన్న మూడు ముఖ్యలక్షణాల సమ్మిశ్రణంగా సాగింది ఆయన రచన. ఆయన రచనా జీవితమంతా రెండు నమ్మకాలకు కట్టుబడి వున్నది. 1. సాహిత్యానికి సాంఘిక ప్రయోజనం వుండాలని, 2. జీవిత చిత్రణ వాస్తవికంగా వుండాలని. అందుకని ఆయన సహజ వ్యవహారిక భాషలోనే రాశారు. సూటిదనం, నిరాడంబరత్వమే ఆయన శైలి. ఆధిపత్యాలు లేని సామాజిక జీవన నిర్మాణం, సమానతా విలువల సంస్కారం ఆయన సాహిత్యానికి ప్రాతిపదిక. అందుకే కొ॥కు॥ అంటే 'కొత్తభావాల కుదురు' అని అర్థం. జీవితాన్ని తార్కికంగానూ, గతితార్కికంగానూ పరిశీలించి, విశ్లేషించి, ఆ సారాన్ని అతి తేలికగా వివరించిన గొప్ప మేధావి. అపూర్వ వాదనాపటిమతో వాస్తవ జీవితాన్ని, జీవన వాస్తవాలని విడదీసి చూపిన ప్రతిభాశాలి.

ఇది తప్పు, ఇది ఒప్పు అని తీర్పు చెప్పకుండా ఆయా పాత్రల స్థితిగతులను, వారి మనో ప్రపంచాన్ని మనముందు నిలబెడతారు. స్త్రీ పురుషుల మధ్య పాతివ్రత్యం గురించి చెబుతూ, "పురుషులకు నిజంగా పవిత్రతపట్ల విశ్వాసముంటే, ఇతరుల భార్యలతోను, సానులతోను ఎందుకు పోతారు?" అని ప్రశ్నించి, "చూడగా నీతి అన్నది ఆడదాన్ని చిత్రహింస చేయడానికి మగాడు సృష్టించిన నరకంలాగ అనిపిస్తోంది" అంటారు. "వివాహేతర లైంగిక సంబంధాన్ని నేరపూరిత చర్య అనలేం. మహా అయితే అదొక పౌర తప్పిదం మాత్రమే అవుతుంది. వివాహేతర లైంగిక సంబంధాన్ని పెట్టుకున్నంత మాత్రాన ఒక వ్యక్తిని శిక్షించటం ఇంగితజ్ఞానంతో కూడిన చర్య అనిపించుకోదు" అని 27-9-2018 సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పును ఎన్నో దశాబ్దాలకు ముందే కొ॥కు తన సాహిత్యంలో ప్రతిపాదించారు.

కొడవటిగంటి తాను మార్క్సిస్టునని చెప్పుకున్నారు. తనకు ముందువున్న భావ, సంస్కరణవాదాలను అధిగమించి సామాజిక పురోగమనవాదాన్ని అందిపుచ్చుకున్నారు. అందుకనే తనకు ముందున్న రచయితలను దాటిపోయి కొత్త భావాలను, అధునాతనత్వాన్ని సంతరించుకున్నారు.

భూస్వామిక ఆధిపత్య భావజాలం నుంచి, అప్పుడప్పుడే పెరుగుతున్న పాశ్చాత్య బూర్జువా సంస్కృతీ విషవీచికలనుంచి తెలుగు సాహిత్యాన్ని బయటకులాగి, నిజమైన ప్రజాస్వామిక జీవన విలువలను కొంతమేరకయినా ప్రవేశపెట్టగలిగారు. నిరంతర అధ్యయనంతో, అవిశ్రాంత రచనా జీవితంతో, సమకాలీనంగా ఎదిగివస్తూనే తన పరిధిని, పరిమితిని కూడా గుర్తించగలిగారు. ఆ సంస్కారం, వివేకం, వినయంతోనే తన సాహిత్యాన్ని బేరిజువేసుకుని, తన అభిప్రాయాలలో అవసరమైన మార్పులు చేసుకుంటూ నిత్యనూతనంగా వుండగలిగారు.

"తెలుగు సమాజం ఫ్యూడల్ భావాలకు ఒకవైపు కుంగిపోతూ మరోవైపు మార్పు పేరిట పెట్టుబడిదారీ సమాజ లక్షణాలను వెర్రి కేకలుగా ఆహ్వానిస్తున్న కాలంలో సాహిత్య ఉపాధ్యాయునిగా అసలు జీవితపు చదువు అంటే ఏమిటో సామాజిక పరిణామక్రమంలో వివరించి చెప్పారు కుటుంబరావుగారు" అని జ్వాలాముఖి విశ్లేషించారు.

**'అనుభవం' నవల**

'అనుభవం' నవలలో 154 పేజీలలో దాదాపు ఐదు దశాబ్దాల జీవితాన్ని, సమాజ పరిణామాల్ని, తెలుగు సమాజంలో వచ్చిన అనేక మార్పుల్ని చిత్రికపట్టి చిత్రించారు. జార్జి రాజు పట్టాభిషేకం (1911) ముందునుండీ, ప్రపంచయుద్ధం మీదుగా, శాసనోల్లంఘనలు, ఉప్పు సత్యాగ్రహాలు, ఆర్థిక కాటకం (30-34) మీదుగా, రజాకారులు, తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటం మీదుగా (1950), ప్రజానాట్యమండలి కళాకారులు సినిమాల్లో చేరిపోవటం, కిళ్ళీకొట్టు వాళ్ళు (డిటెక్టివ్ సాహిత్యాన్ని అద్దెకిచ్చి) సాహిత్యసేవ చేయటం వరకూ (1960) అద్దం పట్టారు. అయితే ఆఖరి రెండు దశాబ్దాల పరిణామాలను కేవలం పదిపేజీలలో ప్రస్తావించి, ఒక డాక్యుమెంటరీలా చేశారు. బహుశా 'అనుభవం' నవల 1950ల వరకే (పార్వతి చురుకైన జీవితం గడిపిన కాలం వరకే) పరిమితం అయినది. 1960ల నుంచి వచ్చిన మార్పులను మరో నవలగా చిత్రించే వారేమో తెలియదు గానీ 'అనుభవ'మే ఆయన ఆఖరి నవల అయ్యింది.

శ్యామలాంబ ఒక జమీందారిణి. ఆమె భర్త వెంకటనారాయణ స్త్రీలోలుడు. వాళ్ళ కొడుకు కాంతయ్య. వెంకటనారాయణ ఒక వితంతు జమీందారిణితో పట్నంలోనే వుంటాడు. ఆ తండ్రి నీడ కూడా పడకుండా కొడుకును జాగ్రత్తగా పెంచాలని ప్రయత్నించి విఫలమవుతుంది శ్యామల. కాంతయ్య అన్ని లక్షణాలలోను తన తండ్రిని పుణికిపుచ్చుకున్నాడు. స్త్రీ వ్యామోహానికి దూరం చేయాలనీ, ఇంటికే కట్టిపడేయాలనీ, పార్వతి అనే ఒక అందమైన పేదపిల్లకు ఇచ్చి పెళ్ళి చేస్తుంది శ్యామల.

పార్వతి తల్లి మీనమ్మ భర్త పోయినా చాల సమర్థవంతంగా తన సంసారాన్ని ఈదుకు వస్తూంటుంది. ఆ సమర్థత తన కోడలిలో వుంటుందని ఆశిస్తుంది శ్యామల. కాఠిన్యం సమర్థత కింద గుర్తించబడటం చాలా తరచుగా జరిగేదే. అలాంటి కాఠిన్య సమర్థత పార్వతిలో లేదు. తన తల్లి 'కుంతీదేవి' అని చిన్నతనంనుండీ వింటున్నది. బస్తీలోవున్న పినతల్లుల గురించి గుసగుసలు వినవచ్చినా 'ఎటు చూసినా అవినీతే' అనుకుంటుంది గానీ ఆ జీవితం రోతగా భావించదు. పెళ్ళిళ్ళల్లో ఆడిపాడే ఆటసానుల స్వేచ్ఛకు ఆవిడ ఆశ్చర్యపడేది. 'వాళ్ళకే మొగుడుంటే ఈ ఆటలు ఆడగలరా?' అని భావించేది. పార్వతి పినతల్లులు వున్న బస్తీలోనే కాంతయ్య మరో మగువను మరిగి అక్కడే వుండేవాడు. "ముష్టెత్తే వెధవలు కూడా ముండ నుంచుకుంటూంటే జమీందారు బిడ్డ ముండల వెంట తిరగడం అబ్బురమా? నా వియ్యపురాలి గౌరవానికి (ఆమె భర్త మరో ఆవిడతో వుండటం వల్ల) ఏమిలోపం వచ్చింది! పార్వతికీ అంతే" అని సమర్థించుకుంది మీనమ్మ.

ఇలా వుండగా పార్వతి మామ చనిపోతాడు. శిరోముండనం చేసుకోనని తుఫాను లేవదీసింది శ్యామల. పార్వతికి అత్త పద్ధతే సరైనదనిపిస్తుంది. ఏదో సందర్భంలో తమ బంధువైన నరసింహస్వామి, కృష్ణవేణి దంపతులను చూస్తుంది పార్వతి. అప్పటికే కృష్ణవేణి కలకత్తాలో బి.ఎ. చదివింది. వీళ్ళిద్దరూ ఒకరినొకరు పేర్లతో పిలుచుకోవటం, ఎంతో ప్రేమగా వుండటం గమనించి వాళ్ళు మరో ప్రపంచంనుంచి దిగి వచ్చిన భార్యభర్తలనుకుంటుంది పార్వతి. "ఒక కొత్త పనిని ప్రపంచమంతా అనుసరిస్తే జీవితం కొంచెం బాగవుతుందా, లేక మరింత అధ్వానమవుతుందా" అనేది మంచిచెడ్డలను నిర్ణయించే సూత్రంగా పార్వతి గ్రహిస్తుంది.

పార్వతి రజస్వల కాగానే ఇక మొగుణ్ణి లోబరుచుకోమని, శృంగారంతో కట్టిపడవేయమని చుట్టుపక్కలంతా ఉచిత సలహా ఇస్తారు పార్వతికి. ఆమెకు గర్భాదానం రోజు చాల చీదరగా అనిపిస్తుంది. అదో వేటలాగ కాసేపు, ఒక యజ్ఞంలాగ కాసేపు అనిపిస్తుంది. ఆ యజ్ఞానికి సిద్ధమవుతున్న పశువులాగా

అనిపిస్తుంది. ఎటైనా తానే బలి పశువును అనుకుంటుంది. "ఒక ఆడదానికీ మరో ఆడదానికీ తేడా ఏమిటి? మీరు అడ్డమైన ఆడవాళ్ళతో ఎందుకుపోతారు" అని అడుగుతుంది భర్తని. "ఎవరయినా సవాలు చేస్తే జవాబు చెప్పక పోవటం మగసిరికి లోపంకాదా?" అని జవాబిస్తాడు కాంతయ్య. దాంతో అతనిలో కామం తప్ప ప్రేమలాంటిది లేదనీ, తనప్రేమతో కూడా అతనికి అవసరం లేదని పార్వతి నిర్ధారించుకుంటుంది. ఒక రంకు వ్యవహారంలో ఊళ్లో ఎవరో కాంతయ్య కాలు విరగగొట్టారు. తనను కొట్టించిన ఆడదానిమీద కొంచెం భయభక్తులు పుట్టుకొచ్చాయి. నిజానికి కాంతయ్య భీరువు. అతనికి ధైర్యసాహసాలు ఏమైనావుంటే అవి అతనికి అండగావున్న సామాజిక వ్యవస్థ ఇచ్చినవే. ఈ సంగతి పార్వతి ఏనాడో కనిపెట్టింది. అందుచేత ఆమె అతనికి ఏనాడూ భయపడి ఎరగదు.

ఇంతలో పార్వతికి కొడుకు (నారాయణ) పుట్టాడు. "మా వంశంలో ఆడపిల్లలు పుట్టరు" అన్నాడు కాంతయ్య. ఒకవేళ ఆడపిల్ల పుట్టినట్టయితే ఎంత తుఫాను రేగేదో వూహించుకుంది పార్వతి. తన కొడుకు తన మొగుడిలాగ తయారవుతాడేమోనని ఆమెకు కంపరం కలిగింది. తన పెంపకంతో వాణ్ణి మనిషిలా చేయాలనుకొంది (అచ్చం శ్యామల లాగనే). తన భర్త అలా తయారుకావడానికి శ్యామలాంబ పెంపకమూ కారణమేనని పార్వతి నమ్మకం. ఆవిడ మనవణ్ణి కూడా అలాగే తయారు చేస్తుందని, ఆ పని జరగకుండా తానేం చేయాలా అని పార్వతి మధనపడింది. "తన అన్నలు భార్యలపట్ల తన భర్తకన్నా చాలా రెట్లు బాగా ప్రవర్తించుతున్నారు. తను ఒక సామాన్యుని భార్య అయితే జీవితం యింకా హాయిగా వుండేదేమో'' అనుకుంటుంది పార్వతి. "మా అన్నయ్యలు తమ పిల్లల భవిష్యత్తు కోసం ఆలోచిస్తున్నారు. మీరు కూడా మన పిల్లవాడి భవిష్యత్తు గురించి ఆలోచించమ"ని భర్తకు చెబుతుంది. తరతరాల ఆస్తిని తగలెయ్యడమే కీర్తిప్రదమనుకున్నాడు కాంతయ్య.

నారాయణకు 5 ఏళ్ళు వచ్చేసరికి కాంతయ్య ఆస్తిఅమ్మి అప్పులు తీర్చే దశకు వచ్చాడు. అందుకని పిల్లవాడి చదువు నెపంతో, ఆవిడ కొడుకును తీసుకుని బస్తీలో చిన్న వ్యాపారం చేసుకుంటున్న అన్నల పంచన చేరింది. పిల్లవాడి బాగుకోసం భర్తమీద ఆస్తి దావా వేయమని లాయర్లు సలహాఇస్తారు. చిన్న నారాయణ తరపున అత్తగారి పేరుతో దావా వేస్తారు. ఈ విషయంలో పార్వతి చాల తర్జనభర్జనలు పడుతుంది. మైనరు ఆస్తికి తండ్రిని బదులు తల్లిని గార్డియన్‌గా నియమించాలని లాయరు (పార్వతి తమ్ముడు వెంకటేశ్వర్లు) నోటీసు పంపిస్తాడు. మొగుడి మీద పార్వతి కోర్టుకెక్కటం సక్రమమేనని ఎవరూ అనలేదు. పైపెచ్చు అవహేళన చేశారు. "ఇది మంచిదీ, ఇది చెడ్డదీ అని మన బుద్ధి ఎంత నమ్మకంగా చెప్పినా సంఘదృష్టి మన బుద్ధికి వ్యతిరేకంగా వున్నపుడు సంఘజీవికి సంఘర్షణ తప్పదు. ఈ మానసిక సంఘర్షణలోంచే సంస్కరణలు, విప్లవాలు పుట్టుకొస్తాయి" అంటారు కొ॥కు॥ ఈ సందర్భంలో. "ఆయనను బుక్కా ఫకీరునుచేసి నేను పొందే ఆనందం ఏముంది? ఏదో పిల్లవాడి భవిష్యత్తు కోసమని తప్ప" అని భావించి కలసి వుందామని వచ్చిన భర్తతో ఇష్టంలేకున్నా రాజీకొస్తుంది పార్వతి. "జీవితం ఎంత క్రూరమైంది? తప్పుచేయని వాళ్ళపట్ల, ఘోరాలు చేసినవారి పట్ల సమానంగా క్రూరంగా వుంటుంది" అని రచయిత వ్యాఖ్యానిస్తారు.

పార్వతమ్మ నిర్వాహకురాలిగా కొడుకు ఆస్తి కొంత వేరు పడింది. అప్పటినుంచి పార్వతికూడా అన్నలనుంచి వేరుగా కాపురం పెడుతుంది. 'మీ సలహా లేకుండా జరుగుతుంది కనకనా' అని అన్నలను వొప్పించి స్వతంత్ర జీవనం ఆరంభిస్తుంది. తన తిండిసుఖం నుంచి పిల్లవాడి పెంపకం వరకు తనే స్వతంత్రంగా నిర్వహించబూనుకుంటుంది. ఇక్కడినుంచి నారాయణ పెంపకం అంతా తల్లిదే. ప్రతిరోజూ ఒక కొత్త అనుభవమే. పార్వతి ఇరుగుపొరుగుల కాపురాలను శ్రద్ధగా గమనించేది. ఒక ఇంట్లో కోడలు రంకు మరిగింది. పట్టుబడినపుడు చావచితక కొట్టేవాళ్ళు. "అది మొగుడితో సరిగా వుండలేకపోతే, మిండగాడితో ఎందుకు లేచిపోదు?" అని పార్వతి ప్రశ్న. "దానికింత పిండాకూడు పెట్టే మిండగాడు లేడుగనుక" అని జవాబు. "దాన్ని ఎందుకు కొడతారు? దాని బుద్ధి మారుతుందని కాదు. తమ పరువు నిలుపుకునేందుకు. దాన్నెందుకు గెంటివేయరు? ఇంటెడు చాకిరీ గొడ్డులాగా చేస్తుంది కనుక". ఇలాంటి ప్రశ్నలూ జవాబులతో జీవితాన్ని అర్థంచేసుకునేది పార్వతి.

నారాయణ అమ్మ అలవాట్లకు అజమాయిషీలకూ, తన స్కూలు జీవితానికీ తన అనుభవాలకూ మధ్య ఎన్నో వైరుధ్యాలు ఎదుర్కొంటాడు. ఎదుగుతున్న వాడికి తన మామ, భర్తల లక్షణాలు రాకూడదని నిత్యం బుద్ధులు చెప్పే యావ ఆమెకు ఎంతవుందో, అంతకు వెయ్యింతలు శ్రద్ధగా వాడు తల్లి

ఆలోచనలు కనిపెట్టసాగాడు. అమ్మముందు ఒదిగి వుండటం, బయట తన ఇష్టం వచ్చినట్టు వుండటం అనే ద్విపాత్రాభినయానికి వాడు అలవాటుపడ్డాడు. ఇక్కడే పిల్లల శిక్షణ గురించి కొ॥కు॥ ఎంతో చెబుతారు.

ఇంతలో గాంధీ ఉద్యమం, మీటింగులు, లాయర్లు వృత్తిని వీడటం, విద్యార్థులు స్కూళ్ళను వీడటం వంటివి వస్తాయి. ఆ సెగలు పార్వతినీ తాకి నారాయణ గురించి బెంగపడిపోతుంది. తన తమ్ముడి మావగారు లాయరు వృత్తిని వొదిలివేస్తాడు. కాంతయ్య కూడా ఉద్యమంలో చేరి జైలుకు వెళ్ళాడు. వచ్చాక మీటింగులు మర్యాదలు అతనికి. జాతీయోద్యమం పేరనయినా సరే జైలుకు వెళ్ళటం అమెకు హీనంగా కనపడింది. తిలక్ స్వరాజ్యనిధిలో కాంతయ్య చాల కాజేశాడనే వార్తలు కూడా వచ్చాయి. తన భర్తలాంటివాళ్ళు ప్రవేశించిన గాంధీ ఉద్యమం పట్ల ఆమెకు అసహ్యమే వేసింది. అయితే పార్వతి ఆడవాళ్ళు మగవాళ్ళకి లోబడి వుండాలనే ప్రాథమిక సూత్రాన్ని ఏనాడూ శంకించలేదు. ఆవిడ మనిషి ప్రవర్తనకు, ఆస్తి వుండటానికి మధ్యగల సంబంధాన్ని అర్థం చేసుకోలేదు. కానీ తన హక్కులకోసం గట్టిగా నిలబడింది. అయితే ఏమిచేసినా కొడుకు కోసమే అని సమాధానపెట్టుకుంది. ఇంతలో కాంతయ్య మరణిస్తాడు. పార్వతి పట్టుబట్టి నారాయణతో మాసికాలు, అపరకర్మలు చేయిస్తుంది. తను ఇప్పటివరకు 'మొగుడున్న వితంతువుగా ఎందుకు బతకవలసి వచ్చింది? చచ్చిపోయిన వాడి ఆత్మ దీనికి ఏం సంజాయిషీ ఇస్తుంది' అనే ప్రశ్న తలెత్తుతుంది పార్వతిలో.

నారాయణ కాలేజికి వచ్చాడు సంస్కృత శ్లోకాలు, తిరుపతి వేంకటకవులు, భారతి వ్యాసాలమీదగా ఎదిగాడు. జీవన విధానాలమధ్య పొంతన లేకపోవడంవల్ల తల్లీకొడుకుల పారస్పర్యంలో కాఠిన్యం సన్నగా ప్రవేశించింది. దాంతో 'తన శిక్షణంతా వ్యర్థమేనా? వృధాయేనా?' అనుకుంది పార్వతి. అంతేకానీ తాను శిక్షణ అనుకున్నది సక్రమం కాకపోవచ్చనీ, కొడుకు ఎదుగుదలకూ తన మానసిక ప్రపంచానికీ మధ్య భేదం వుంటుందనీ ఆవిడ అనుకోలేదు. తననుంచి కొడుకు విముక్తి కోరుకుంటున్నాడని అర్థమైనా "బొట్టికాయ వెధవ! వాడు ఏమనుకుంటే నాకేం" అని భావించి కాలేజీకోసం కొడుకు గుంటూరు వెళుతుంటే తనూ వెళ్ళింది. 1930 ఉప్పు సత్యాగ్రహం, శాసనోల్లంఘనం జరుగుతున్నాయి. నారాయణకు బాగా ఊహ వచ్చింది. ఆర్థికమాంద్యం విరుచుకుపడింది. ఆ కాటకంవల్ల అప్పుల వసూళ్ళు, పొలాల సర్దుబాట్లవల్ల పార్వతి తెనాలి చేరుకుంది. అక్కడినుంచి పార్వతిది మరో జీవితం.

నారాయణ చదువులు విజయనగరంలో. నారాయణ తనభావాలకు ఆకారంగా, వ్యక్తీకరణగా కథలు రాయటం మొదలెడతాడు. అప్పుడే వివాహం వద్దనుకుంటూనే తల్లి మాటకు లోబడిపోతాడు. సావిత్రి అనే పెరిగిన పిల్లతో వివాహం జరుగుతుంది. పెళ్ళికాగానే స్వంతయింటికి తెనాలి వస్తాడు. అయితే అతనికి తెనాలి జీవితం స్తబ్దంగా అనిపిస్తుంది. రచయితగా స్థిరపడదామని పత్రికలో ఉద్యోగం పేర మద్రాసు చేరుకుంటాడు. అక్కడ బుల్లి పార్వతి పుడుతుంది. డా॥అచ్చమాంబగారి పుస్తకాలు చదువుతూ, పిల్లను ఆరోగ్యంగా పెంచాలనుకుంటాడు నారాయణ. తల్లి మద్రాసు వస్తుంది. పిల్లల పద్ధతులు నచ్చక, మనస్పర్థలు ఇష్టంలేక వూరికి తిరిగి వెళ్ళిపోతుంది. వూహించని అనేక చారిత్రక పరిణామాల్లో అటు నారాయణ భావాలు, ఇటు తల్లి భావాలు ఎటుకటుగా మారి వారివారి వ్యక్తిత్వాలు గట్టి పడిపోతాయి. ఎవరి అనుభవాలు వారికి. ఇద్దరూ పెద్ద వైషమ్యాలు లేకపోయినా తమ గిరి దాటి బయటకు రారు.

పార్వతీ కాంతయ్యల కలహాల కాపురం, నారాయణా సావిత్రిల దాంపత్యంలోని సామరస్యం కొట్టవచ్చినట్లు కనిపిస్తూ పార్వతి తాను కోల్పోయిందేమిటో తెలుసుకుంటుంది. పార్వతి పోయేవరకు కాలం స్పీడుగా పరుగెత్తుతూనే వుంటుంది.

'చదువు' నవలతో 'అనుభవా'నికి కాలంరీత్యా సామీప్యతలు ఎక్కువ. కానీ జీవితాలు, వాటి పాఠాలు వేరువేరు. 'చదువు' నవల సీతమ్మ, సుందరం అనే తల్లి కొడుకుల కథ. ప్రధానంగా కొడుకు దృష్టినుంచి సాగుతుంది కథనం. మారుతున్న పరిస్థితులలో చదువు ప్రాముఖ్యాన్ని వివరిస్తూ, జాతీయ (స్వాతంత్ర్య) ఉద్యమ వివిధదశలు జనజీవితాన్ని ఎలా ప్రభావితం చేసిందీ చిత్రిస్తూ సాగుతుంది. సుందరం కొడుకు అక్షరాలు దిద్దుతూ భవిష్యత్తువైపు అశావహంగా చూస్తుండటం 'చదువు'. దాదాపు అదేకాలాన్ని ప్రధానంగానూ ఆ తర్వాత పరిణామాలను సంక్షిప్తంగాను వివరించే నవల 'అనుభవం'. 'చదువు'లో మిగిలిపోయింది 'అనుభవం'లోకి వచ్చింది. 'నిన్ను ఎలా పెంచాలో తెలియక నిన్ను పోగొట్టుకున్నాను నాయనా' అని ఆవేదనచెందే ఒక తల్లి ఓటమితో ముగిసే కథ ఇది. సాయుధ పోరాటాలు విరమించబడి, అభ్యుదయ సాహిత్యాలు,

## కవిత

# కశ్మీర సమీరం

- సర్వమంగళ
8961626848

కశ్మీర సమీరం స్వాగతించని వేళ
చేతులకు బేడీలు
కాళ్ళకు సంకెళ్ళు
గృహ నిర్బంధం
నిర్మానుష్యం నింగి నేల



జైల్లో అమాయక జనాలు
ఎక్కడ వాళ్ళు అక్కడ
చీకటి మయమైన జీవితాలు
ఆకలి మయమైన బ్రతుకులు

ఇంటింటా అన్వేషణలూ
బలి అయ్యేను అమాయక యువకులు
అడుగంటి పోతున్న న్యాయాలు
ప్రశ్నిస్తే పడ్డ దేశద్రోహ ముద్రలు
లాకప్ డెత్ లూ

భారత భాగ్య విధాతలు
మారుస్తూ ఉన్నారు ప్రజల తలరాతలు
కశ్మీరీల రక్తంలో రాజకీయ స్నానాలు
కార్పొరేట్ల దాహానికి ఆహారం
కాశ్మీరం

ఒక్క క్షణంలో స్తంభించిన
కశ్మీర సమీరాలు ◆

ప్రజాకళలు ఒక నిర్వేదంలో, క్షీణసంస్కృతి వైపు దిగజారిపోతున్న చారిత్రక దశలో ముగుస్తుంది ఈ నవల.

"పై తరం వాళ్ళు కిందితరం వాళ్ళని అర్థం చేసుకోవటానికి ప్రయత్నిసారు కానీ అది ఫలించదు. కిందితరం వాళ్ళు పైతరాలను అర్థం చేసుకునేందుకు తగిన ప్రయత్నం చేయరు. అది వాళ్ళకి అనవసరం. అయితే కాలం ముందుకే సాగుతుంది. చిన్నవాళ్ళకి కాలానికి ఎదురీదవలసిన అవసరం వుంది" అనేది అనుభవం. భూస్వామిక కుటుంబ సంబంధాలనుండి బయటపడాలని పార్వతి, సోషలిస్టు సమాజంవైపు అడుగులు వేస్తూ నారాయణ. ఇద్దరి మధ్య నవలంతా అల్లుకున్నది బూర్జువా అస్తవ్యస్తత, అవ్యవస్థల చిత్రణ. జమీందారీ జీవన విధానాలలో, కుటుంబాలలో స్త్రీల స్థితి, అధోగతి, పురుష వక్రనీతులను ఎదిరిస్తూ నూతన తరాన్ని తీర్చి దిద్దాలనుకునే తల్లులు కనిపిస్తారు. ఒక శ్యామలాంబ, ఒక పార్వతి - వాళ్ల తపన, ప్రయత్నం, వాళ్ళ మీద విరుచుకుపడ్డ ఆర్థిక కుంగుబాటు, దాన్ని ఎదుర్కొనే ప్రయత్నాలు ప్రధానకథ. పికెటింగులు, సత్యాగ్రహాలు, శాసనోల్లంఘనాలు, సామ్యవాద భావనలు, పోరాటాలు జరుగుతున్న కాలంలో, ఒక వేగవంతమయిన జీవితం పురులు విప్పుతున్న కాలం అది. మనుషులూ తరాలమధ్య అంత:సంఘర్షణలు, భిన్న వైఖరుల మధ్య తలఎత్తిన సంఘర్షణలో సంక్లిష్టమైపోయిన జీవనం మనం 'అనుభవం'లో చూడగలం. ఈ నేపథ్యంలో కుటుంబరావుగారు జీవితంలోని అన్ని పార్శ్వాలను చలం సాహిత్యంనుంచి పోలీసు అత్యాచారాల వరకూ, జమీందారీనుంచి సామ్యవాదంవరకు అన్ని విషయాలపట్ల తన అభిప్రాయాలను వ్యక్తపరుస్తారు ఈ నవలలో. అందువల్ల ఏ ఒక్క పేజీని తిప్పివేయలేము. బుర్రపెట్టకుండా ఏమీ చదవలేము. ప్రత్యేకంగా ఏదో ఒక భావాన్ని ఎత్తి చూపించటం సాధ్యం కాదు. అలా చేసినా అది అసమగ్రంగానే వుంటుంది.

కొ॥కు॥ "మార్క్సిస్టు వర్గ పోరాట సత్యాన్ని, జీవితపు విలువల పోరాట వికాసంగా, జీవిత వాస్తవికతా దృక్పథంలో చూపారు. ప్రపంచ సూర్యోదయం స్పృహను మధ్య తరగతి మనిషిలో కలిగించటానికి సాహిత్య వ్యాసంగాన్ని కొనసాగించారు" అన్న జ్వాలాముఖి పలుకులను మననం చేసుకుందాం. ప్రపంచంలో వచ్చిన మార్పుల్ని కొలిచిచూచే సిద్ధాంత పరికరాలు పాతబడిపోయే స్థితి వచ్చిందని ప్రపంచీకరణ, శకలీకరణ కాలపు వ్యక్తులు ప్రకటిస్తున్నారు. కనుక గతకాలపు రచనలు ప్రస్తుతం అవసరం లేదని వారు భావిస్తున్నారు. అయితే "ఇంకా ఎప్పుడో పుట్టబోయే వాళ్ళ కోసం రాస్తున్నాననే అహంకారం నాకు లేదు. నేను ఆకాశం నుండి ఊడిపడలేదు. నా కథలు, రచనలు చిరస్థాయిగా వుండిపోవాలనే ఆశ నాకు ఏకోశానా లేదు. నా రచనలవల్ల మనోవికాసం పొందదగిన వాళ్ళు తెలుగువాళ్ళలో వున్నారు. వారందరూ నా కథలు చదవాలని నా కోరిక. వారందరికి నా రచనల మీద ఎంత త్వరగా ఏవగింపు కలిగితే, అంత ఉపయోగం చేసినవాణ్ణవుతాను. అప్పటికి తెలుగు సారస్వతానికి నాతో పని అయిపోతుంది" అని ఆయనే అన్నారు.

అయితే ఆయన ఏ సమస్యలను తన రచనల్లో చర్చించాడో, ఆ సమస్యలు మనకు ఇంకా తీరలేదు. అందుకే ఆయన రచనలు ఇంకా ఏవగింపుకు నోచుకోవటం లేదు. ఆయన వాడిన పరికరాలు ఇంకా పదునుగానే వున్నాయి. తెలుగు సారస్వతానికి కుటుంబరావుగారి అవసరం ఇంకా తీరలేదు. ◆

కవిత

# ఏడో చేప

- శిఖా - ఆకాష్
9381522247

నేనే ముక్కలు చేసిన
కాలం
నన్ను ఆత్మహత్య చేసింది
నేనున్నా కూడా
లేననే సుదీర్ఘ అబద్ధం
నన్ను బతికించింది
నాకు నేను
శత్రువుగా మారడాన్ని
నా కెవరో బహుకరించారు
నా తలరాతలు
నేనెప్పుడూ
రాసుకోకూడదని
ఎవరో నా రాతల్లోకి
జొరబడి శాసిస్తున్నారు
బానిసలకు చీకటే
విముక్తి అని
వెలుతురు తీర్పు రాసిపోతోంది
నేనేం మాట్లాడినా
దేశద్రోహమేనని
ఒక దేశభక్తి నినాదమిస్తోంది
నేనెక్కడున్నానో
నాకు తెలియకపోవడమే
అసలైన ఎరుకని
దారులన్నీ చెప్తున్నాయి
ఏ దారీ నాది కాదని
ఏదో ఒక దారిలోనే
పడి పొమ్మని
లోయ ఒకటి
గట్టుమీదుండి పలుకుతోంది
ఎప్పటికైనా
తెగిన గాలిపటమే
తెగక ముందు పాఠాల్ని
విశాలం చేస్తాయని
స్వేచ్ఛగా చెబుతోంది

♦

నా కళ్లు మాట్లాడలేవు
నా చేతులు నడవలేవు



నా కాళ్లు నవ్వలేవు
నా చెవులు చూడలేవు
నా పెదవులు వినలేవు
నేను అవయవాలు సరిగా
పనిచేస్తున్న అసూరుణ్ని

♦

ముట్టుకోకండి
నా పనీ పాటల్ని ఒప్పుకోకండి
నా అనుభవాల రాతల్ని
ఏడుపు రాగాల్ని
మీ ఆనంద తీరాలుగా
మలుచుకోండి
నా చర్మాన్ని వొలిచి
మీ చెప్పులు చేసుకోండి
నాకు కన్నీళ్లను మిగిల్చి
విలాసాల్ని మీ ముడ్డికి కట్టుకోండి
ఆకాశం కషాయం రంగులోకి
మారుతోంది
భూమి జైల్లోకి నెట్టివేయబడుతోంది
గాలీ, నీరూ, నిప్పు
కుల మతాల లంగోటా కట్టుకుంటోంది
ఒకే దేశం - ఒకే భాష- ఒకే కల
మీ ఇంటి గుమ్మానికి తోరణమౌతోంది

♦

నా దీపం రంగు చీకటి
నా ఊపిరి విందు అవమానం
నా జ్ఞానం పేరు అజ్ఞానం
విధ్వంసం నా కల
రంగుల ప్రపంచం నా వల
నేనెప్పుడూ
ఇక్కడకు ఆవల

♦

కథ

# చంద్రన్న



- డా॥ పెరుక రాజు
9443091384

పెయ్యంత పుండు పుండోలె వుంది. గుండెమీది బండవెట్టినట్టుంది. చేను పనికి రోజు కింద దిగడే! మీద దగడే! ఎండకు ఏం చేసేది! పనికి కైకిలి పెడ్తా మంటే పైసలేదున్నవి!

ఉద్దరైన ఓ సూదేత్తడు ఊల్లె డాక్టరు. మూలకు వంటె ఎవరు చెయ్యాలె! ఎందుకైనా మంచిది ఆడిదాకన్న పోయత్తాని పంచె దులిపి నెత్తికి చుట్టుకొని సైకిలు మీద మెల్లగా బయలుదేరిండు చంద్రన్న. ఊల్లెకు వచ్చేవరకు సైకిలుమీదున్న చంద్రనకు చెక్కరచ్చినట్టు గావట్టె! సైకిల్ ఆపి పక్కనున్న చెట్టుకొరిగిండు. మెల్లగా డాక్టారు దగ్గరికై అడుగులో అగుడులేస్తూ నడుస్తుండగా "ఏమయ్యిందే చంద్రన్నాని మందలిస్తూ, చేయిపట్టుకొని డాక్టరు దగ్గరికి తీసుకొనివొయె సత్తెన్న'.

ఏమయ్యిందటూ డాక్టరు చేయివట్టి దాతు చూసి, సర్రన ఓ సూదిచ్చి, రెండు గొలీలిచ్చె, పైసలు తర్వాతిత్తాని డాక్టరుకు మెల్లగా చంద్రన్న చెప్పగ, సరేనన్నట్లు తలూపిండు డాక్టరు.

"రేపు పొద్దటి బండికి వెంలాడకువెల్లి దవాఖాన్ల చూపించుకో. వీలైతే ఇంకా మంచిది. కరీంనగరెల్లి చూపించుకో! గుండె జబ్బున్నట్టుంది. పరీక్షలు చేయించుకో! పనుంది, పైసలెట్లాని ఆగితే పరేషానైతది చంద్రన్న. ఎవరు చెప్పిన అంతగా పట్టించేకోవు.నీ మంకు నీదే! ఈ టైంల ఏ రైతు దగ్గర దబ్బులుంటవి! ఐనా ఆడీడ చేసి ఎట్లనన్న ఓ ఐదువేలు తీసుకొని పో! పరీక్షలకు ఫీజులు భాగనే ఐతవి." ఊల్లె డాక్టరు ప్రభాకరు చెప్పి, ఇండ్లపొన్న సూదులేసెతందుకు, స్కూటరు మీద ఎళ్ళిపాయె!

చంద్రన్న పక్కనున్న బోరింగు కాడికొయ్యి కొట్టంగ కొట్టంగ కొన్ని నీల్లురాంగ గోలేసుకొని 'దోసిలితో నీల్లు తాగి మెల్లగా సైకిలెక్కి ఇంటిమొకాయి పోవట్టె! కడుపంత లోపినట్టు కావట్టె! ఇప్పటికిప్పుడు పైసలెవ్వలియ్యాలె" దిగులుగా వుంది చంద్రన్నకు.

చిన్నప్పుడు ప్రభుత్వ హాస్టల్లో చదువుకున్న సోపతిగాల్లు చాలమందే వున్నారు. కాని గప్పట్ల బస్సుల వోంగ చేయిసంచి మరిచిపోయింటి. అందులోనే చిన్న బుక్కుండే! అందరి మొబైల్‌నంబర్లు అందులోనే వుండె. ఇప్పుడెవరి నెంబర్లులేపాయే! ఏం చేసేది! ఎక్కడెవరుంది ఎవరికెరుక!

ఊల్లెవరు నమ్ముతరు! ఇప్పటికిప్పుడు! పంటచేతికత్తదా! పైసలు తిరిగిచ్చేతందుకు! అది అనుమానమే! ఏదైనా చేసిన కోడేమొ! లే ఏదైన గాలి తగిలిందేమొ! లేకుండే నాకేం రోగం ఎన్నడులేంది! ఉల్లె డాక్టరు పొరడేమొ గట్ల చెప్పె! ఏమన్నయితే పేరు ఖరాబైతదని అందరు డాక్టార్లు అట్లనే చెప్పుతరు. ఊల్లె డాక్టరకు చూపిస్తే సూదిచ్చి వెంలాడ పోవాలంటడు. వెంలాడ డాక్టరు దగ్గరికోతే గులుకోజులువెట్టి కరీంనగర్ తీసుకపోండంటడు. కరీంనగర్‌ల డాక్టర్లు గట్లనే పట్నమంటరు. వీల్ల ముచ్చట్లిట్లనే వుంటవి.

మా అవ్వయ్య ఏ దవాఖాన్లకు పోయింద్రు! చెట్లపసర్లే తాగింద్రు. ఆడీడ మంత్రిచ్చుకొని తాయితులు కట్టుకొని కల్లువొట్టుతో ముఖం కడిగిచ్చుకొని పసుపు బొట్టు పెట్టించుకున్నరు పల్లె మాదరి రామన్న దగ్గర. వాల్లంత మంచిగనే బతికింద్రు. మాదరి రామన్న మునలోడై గప్పట్ల కాలమెల్లదీసే! పాపం ఎవలకైనా ఉత్తంగనే చూసు దయాభక్తి ఐదో పదో ఇత్తియ్యచ్చు లేకుంటే లేదు.

'ఇగబైండ్ల పోచయ్య దగ్గరికన్న పోత. ఎందుకైనా మంచిది అప్పుడిప్పుడు దించి పోత్తుండట. తాయితాలు కూడా కడ్తుండాలి తెల్సింది. సిలుక్కోయ్యకున్న అంగి తొడ్డుక్కుని చంద్రన్న మెల్లగా పక్కూరికి బయలుదేరిండు.

పోయిన టైంకు బైండ్ల పోచయ్య ఇంట్ల లేడు! పక్కింటి వాల్లనడిగితే, "బిడ్డింటికి వోయిండు. పొద్దుగాల్నే వచ్చేదుండే! ఇప్పుడు బస్సు వచ్చే టైమయ్యింది. నాలుగైంది అగో బస్సు రానే వత్తుంది. బస్సు ఆగంగనే బైండ్ల పోచయ్య బస్సు దిగి ఇంటి మొకేయి రాంగనే చందన్న కనవడే! పలకరిస్తూ "ఏం చంద్రన్నపటేలా! ఎప్పుడు రాంది గిటు తొవ్వ వడ్డదేంది"

ఏంలేదు పోచయ్య నీతోని చిన్న పనివడ్డది. ఏందనగానే పూసగుచ్చినట్లు చంద్రన్న చెప్పిండు పోచయ్యకు "నాకు ముఖం కడుగు కల్లుతో, నిమ్మకాయల్తో తింపెయ్యి. ఏదైనా గాడ్పో, లేక చేసిన కొంటెతనమో! ఈ మధ్యన పానం బాగుంటలేదు".

'బాయిమీద కాల్లు చేతులు కడుక్కొని ఇంట్లకోయి, ఐదు నిమ్మకాయలు, పసుపుపొట్లం, పొగ తీసుకుని పక్కింటి గాండ్లాయన దగ్గర ఓ గ్లాసుకల్లు తీసుకుని బైండ్లపోచయ్య పందిరికింద కూసోని చంద్రన్నను దగ్గరికి పిలుసుకున్నడు.

"ఉసుప్,ఉసుప్ ఏమేమొ చదువుతూ, పొగ మంత్రిచ్చి, పసుపు బొట్టుపెట్టి, నింపకాయలు తింపేసి, కల్లుతో ముఖం కడిగి ఏం కాదు చంద్రన్న పటేలా! మంచిగనే పోతది కాని ఎందుకైనా మంచిది రోజులు మంచిగలేవు. అంతా మందుల కూడు. చేసిన కొంటెతనం కానట్టుంది. ఓసారి డాక్టర్ల దగ్గర పరీక్షలు చేయించుకొమ్మని పంపించె."

అందరిట్లనే చెప్పవట్టిరి! ఇదేం కర్మరా అనుకొని చంద్రన్న ఇంటికి దారివట్టె! ఇంట్లోకి వెళ్ళి, మంచంల ఒరిగి ఒరగంగనే చల్లచమటలు పుట్టె! కడుపు ఉబ్బినట్టాయే! మొస తీసుకోవడం గోసకావట్టె! కోడి కొట్టుకున్నట్టు, అటిటు కొట్టుకోవట్టె!

చంద్రన్న పరిస్థితిని చూసి ఏడుస్తూ ఎక్కడలేని భయంతో ఆయన పెండ్లం అల్లీల్లను పిలిచె! ఆటో మాట్లాడుకొని వెంలాడకు వెళ్ళిరి. వెంలాడ డాక్టర్లు ఓ గుల్కోజ్‌వెట్టి, ముందుగాల తెచ్చేదుండే! ఏమన్నయితే మాకు పరేషాన్! ఇక్కడవట్టం. కరీంనగర్ తీసుకపొమ్మనిరి.

చంద్రన్న ఎనిమిదినెల్ల కిందట మిల్ట్రీలో ఉన్న తన చిన్నప్పటి దోస్తేతో ఫోన్‌లో మాట్లాడుతూ.. "నమస్తే అన్న మమ్మల్ని మరచిపోయినావే! ఇగనీకు ఎటువోయినా మిల్ట్రీ సోపతి గాల్లేనాయే! మేము ఆదికున్నమాయే!" అన్నడు.

మిల్ట్రీ మిత్రుడు బదులిస్తూ... "అలాంటిదేమిలేదు చంద్రన్న. మిల్ట్రీలో ఆలోచించేంత పురసుతుంటదా" అన్నడు.

"మరి నీతో కొంచెం మాట్లాడన్నాయే! నెంబరుంటే వీలునుబట్టి నేనే మాట్లాడేవాన్ని!" అన్నడు.

"మాట్లాడు చంద్రన్న"

"ఏంలేదు. పని పని ఎండనకా, వాననకా ఇంట్ల వంటె కడుపెట్ల నిండుతదే! పిల్లల్ని చదివిచ్చుకునుడు. అన్ని ధరలు పెరిగి పోవట్టె! ఈ మధ్య నాకు పాణం చక్కగుంటలేదు. మొన్న పట్నం పోంగ బస్సుల సీటు పక్కనున్న పెద్దమనిషి మాట్లాడుతూ... "ఏమయ్యింది బిడ్డానే! నాకు పాణం అల్క గుంటలేదంటి! నాకు గట్లనే వుండేది. నా కొడుకు మిల్ట్రీ మందు రమ్ము తెచ్చిచ్చేది! అప్పుడో పెగ్గు ఇప్పుడు పెగ్గు వేసుకునేది! పాణం అల్కగుండేదట! మిల్ట్రీ మందు మంచిదటనే! సెలవచ్చినపుడు తెస్తవామె! ఏమనుకోకే!"

"అలాంటిదేమిలేదు చంద్రన్న! తప్పకుండా తెస్తా" మిల్ట్రీ మిత్రుడు భరోసనిచ్చె.

చంద్రన్న చాలా చక్కటి మనిషి. చెట్టుకున్న గుణం తనది. ముందోటి ఎనుకోటి మాట్లాడని మనిషి. పొలం ఎక్కువ లేకుండె! ఉన్న భూమిలో పంట వేసుకొని కౌలుకు చేస్తూ కాలమెల్ల దీస్తుండె. ఉన్న ఇల్లును తమ్ముడు చిన్నోడని ఇచ్చిండు. వాల్ల పొలాల్లో కొళ్ళం కొట్టం అమ్మితే ఆ పైస ఈ పైసతో కొనుక్కొని తన భార్య ఇద్దరు పిల్లలతో ఆ కొట్టంలో జవితం గడుపుతుండె! రెండేండ్లు కాలంగాక వేసిన పంట ఎండిపోయి, చేసిన లాగోడి మీదవడె! కొద్దిగా అప్పాయే! ఆకాన్నుంచి పొలం పనులు చేస్తూ... ఇంట్ల చిల్లర ఖర్చుల కోసం ఆడీడ కూలి పనికి పోవుడు మొదలుపెట్టిండు. లగ్గజాం పొద్దూకి రెక్కకిరాం లేకుంట ఏదోపని చేసుకునుడు.

లబోదిడో మంటు రాత్రికి రాత్రి చంద్రన్నను కరీంనగర్ తీసుకపోయిరి. దవాఖన్ల పరీక్షలు చేసేది చేయంగనే కాల్లుచేతులు ఆడుడు బందాయె! డాక్టర్లు కష్టమని చేతులెత్తేసిరి. చంద్రన్న మూసిన కండ్లు ఎంతకు తెరవలేదు. అందరి కండ్లలో కన్నీల్లు. చంద్రన్న పిలగాండ్లు చిన్నొలయిరి. బుద్ధి జ్ఞానం అంతగా తెల్వదాయె! చదువుకోను బడికోవట్టిరి. పైసలేన్నుంచత్తయి! అవేమన్న చెట్టుకు కాత్తయా? ఏదిగుట్ల చూసిన ఏడుంటవి! ఏ అటుకుమీద దొరుకుతవి!

సత్తన్న మిల్ట్రీ దోస్త్‌కు ఫోన్ చేసి చంద్రన్న విషయాన్ని తెలుపగా, ఆయనకు ఎక్కడలేని దుఃఖం కలిగింది. "ఏం చంద్రన్న ఎంతపని చేత్తివి. రమ్మని, రమ్ము తెమ్మని, నేను సెలవు రాకముందే నీవు శాశ్వతంగా సెలవు తీసుకుంటివా! ఇంటి పెద్ద దిక్కు కాలమెల్ల దీస్తే ఇంట్ల ఎంతకష్టమొ ఊహించుకున్నాడు. హాస్టల్లో చదువుకున్నప్పటి చంద్రన్న దోస్తులు ఇంట్లకు ప్రస్తుతానికి ఇరవైవేల రూపాయలు, రెండు బస్తాల బియ్యం పంపించారు. ♦

## ఏకాంత శిబిరం

- సుంకర గోపాలయ్య
9492638547

గదిలో
ఎవరూ లేకపోవడం ఏంటి?
నేనున్నాను
చేతిలో పుస్తకం ఉంది
మిత్రుడి మీద చెయ్యి వేసినట్టు
పేజీలు తిప్పుతున్నాను
పేజీలు పక్షిరెక్కాల్లా ఎగురుతున్నాయ్
నా చుట్టూ చాలా మంది తిరుగుతున్నారు
చెర్లో పడి మరణించిన మిత్రుడొకడు
కిటికీ దగ్గర నిలబడి ఉన్నాడు
నా చిన్నప్పుడు మరణించిన
మా ఊరి వాళ్ళు తలుపు తడుతున్నారు
గదిలో
ఒక్కడినే ఉన్నానా
నా మొదటి ప్రేయసి
కన్నుకొట్టి గుండెమూలాల్ని కదిలిస్తోంది
గదిలో ఫ్యాన్
మూడు కత్తులతో గాలిని భయపెడుతోంది



గడియారంలోని
మూడు ముళ్ళు డిసిప్లిన్‌తో ఉన్నాయ్
ప్రాణం పోయినట్టు
కరెంట్ పోయింది
పూలు రాలుతున్న చప్పుడు
నల్లగా నవ్వుతున్న చీకటి
బయట రెండు కుక్కలు
అధికార ప్రతిపక్షాల్లా అరుచుకుంటున్నాయ్

భయం భయంగా
ప్రవహిస్తున్న నెత్తురు
చీకటిని తగలేసే
ఆయుధం ఒక్కటి కావాలి? ♦

---

## నిర్మాల్యం

- వంజరి రోహిణి
9000594630

గతం...
గ్రీష్మపు వేడిమికి కరిగిపోయిన
ఓ మంచు ముక్క..
కలం పాళిలో ఇంకిపోయిన
ఓ ఆఖరి సిరా చుక్క..
పండగ సంబరాల అంతిమ ఘట్టంలో
మిగిలిపోయిన ఓ నిర్మాల్యం..
వేడుకల అనంతరం నిమజ్జనం
అయిపోయే ఓ మట్టి పెళ్ళ..
వెనుకకు తిప్పలేని
ఓ గడియారపు ముల్లు..
శరత్ కాలపు చెట్టు కింద
రాలిపడిన ఓ ఆఖరి
పండుటాకు..
లోపలి కందరాల నుంచి
చర్మం పైకి పుట్టుకొచ్చిన
ఓ వ్యార్ధక్యపు ముడత..
నిరాశ తరంగాలు వ్యాప్తి చేసిన ఓ దుర్గంధం..



ఓటమి గాయాలు మిగిల్చిన
చెరిగిపోని ఓ పచ్చబొట్టు..
ఏదైతేనేం గతం గతమే
నిన్నటి భయం ఓ భూతమే..
చీకటిని నిందిస్తూ నిన్నటిని
యోచిస్తే, నేటి చైతన్యం
ఓ గగన కుసుమమే..
రేపటి వెలుగు ఇకపై
ఓ సుదూర స్వప్నమే..
చేజారిన క్షణం తిరిగి రాదని
వివేకం కలిగుంటే, గతాన్ని
గురించి యోచన వ్యర్థం..
నేటి కర్తవ్యాన్ని ఆచరణలో పెడితే,
రేపటి వెలుగు పూల ఆగమనం తథ్యం ♦




# తొలి మలితరం - తెలుగు కథలు

- డా॥ మాదిరాజు హనుమంతరాజు
9441130264

ఒక పనిని అలస్యంగానైనా మొదలుపెట్టాలి, కాని చెయ్యకుండా ఉండటం చాలా తప్పు. అట్లానే నేను ఎప్పుడో చదివిన ఒక కథాసంపుటిని గురించి నలుగురికి చెప్పాలని నా ఆత్రుత మరియు నా బాధ్యత. దశా-దిశా లేకుండా కొట్టుకొనిపోతున్న నేటి కాలంలో ఇంకా పుస్తకాలు చదువుతున్న, వ్రాస్తున్న వారికి ఈ కథలు ఎంతో మేలు చేస్తాయి. జూలై నెల 2018 సం॥లో వచ్చినటువంటి తొలి మలితరం తెలుగు కథలను డా॥ అక్కిరాజు రమాపతిరావు గారు ఎంతో కష్టపడి ఏర్చి-కూర్చి మొహరించినటువంటి కథలు. ఆయన మాటల్లో "2010 సంవత్సరములో తెలుగు కథ శతజయంతి జరిగింది, కానీ అప్పటికే ఇరవై సంవత్సరాలకు ముందు నుంచే కథారచన ఉందంటున్నారు. పరిశోధకులు. సమాజంతో పాటు తెలుగు కథ కూడా ప్రభావితమైంది. సుమారు నూటయాభై సంవత్సరాలనాటి సమాజపు పోకడలను, పరిణామాలను, మంచి చెడ్డలను ఈ కథలు తెలుపుతాయి. నాటకం, నాటిక, నవల లేదా మరేదైనా సాహిత్య ప్రక్రియ కంటే 'కథ' ఎంతో సామర్థ్యం కలదని ఆయన అభిప్రాయం. ఏ వస్తువునైనా కథగా మలచి ఉపయోగంగా జనులకు చెప్పవచ్చు అని ఆయన అంటారు. డా॥ రమాపతిరావు గారు, ఈ సంకలనం తేవడానికి ముఖ్యకారణం అప్పటి విపుల-చతుర సాహిత్య పత్రికల నిర్వాహకులు యార్లగడ్డ రాఘవేంద్ర గారని చెప్పుకున్నారు. "విపుల" పత్రికలో "మా తెలుగుతల్లికి మల్లెపూదండ" అనే శీర్షికతో పాతతరం తెలుగు కథారచయితలను, వారి కథలను పరిచయం చేసే, ఒక శీర్షికను రమాపతిరావు గారికి, రాఘవేంద్రరావు గారు అప్పగించారట. ఆ శీర్షిక సుమారు రెండు సంవత్సరాలు "విపుల" పత్రికలో వచ్చి పాతతరం రచయితలను, వారి కథలను పరిచయం చేసింది. ఇప్పటికీ ఆ పనిని 'విపుల' చేస్తూనే ఉంది. అలా డా॥ అక్కిరాజు రమాపతిరావు ఎంతో దీక్షతో 1900 సం॥ ముందు నుంచి వచ్చిన కథలను ఏరి, కూర్చి ఒక సంపుటిని పోయిన సంవత్సరములో తేగలిగారు. ఈ సంపుటిలో 43 కథలు ఉన్నాయి. కొన్ని కథల ప్రతులు లేకపోయినా, కొన్ని కథలకు రచయిత ఎవరని తెలియకపోయినా, ఏ ప్రాంతం వాడు, ఏ కాలంనాటి వాడు అని తెలియకపోయినా చాలా కష్టపడి వాటిని సేకరించి ఈ కథా సంపుటిని తెచ్చారు. ఈ సంపుటిలో శ్రీ మునిమాణిక్యం నరసింహారావు, నోరి నరసింహశాస్త్రి, గుడిపాటి చలం, విశ్వనాధ సత్యనారాయణ, చింతాదీక్షితులు, కె. రామానుజరావు, కవికొండల వెంకటరావు, వేలూరి శివరామశాస్త్రి, రాయసం వెంకటశివుడు, ముద్దుకృష్ణ, తల్లావఝుల శివశంకరశాస్త్రి, గవని వెంకట కృష్ణారావు, పానుగంటి లక్ష్మీనరసింహారావు, చిలకమర్తి వారు

కొడవటిగంటి కుటుంబరావు వ్రాసిన కథలు ఉన్నాయి. అప్పటిలోనే స్త్రీ విద్యకు, స్త్రీ పురుష సమానత్వానికి పాటుబడిన శ్రీమతి భండారు అచ్చమాంబ, కనుపర్తి వరలక్ష్మమ్మ, దుర్గాబాయి దేశ్‌ముఖ్ వంటి రచయిత్రిల కథలు కూడా ఉన్నాయి.

దాదాపు నూటయాభై సంవత్సరాల నాటి కథలను వెతికి, వాటిని ఒక క్రమంలో కథా సంపుటిగా తెచ్చినందుకు తెలుగు కథాప్రక్రియ, తెలుగువారు ఆయనకు ఎంతో ఋణపడి ఉంటారు. ఈ విధంగా కథలు వ్రాసి ఆ కాలంనాటి సామాజిక పరిస్థితులను వివరిస్తూ, వాటి పరిష్కారాలను కూడా చివరిలో చూపించిన రచయితలు ఎంతో ముందు చూపువారని, బహుశా ఏ భాషలో కూడా కథపై తెలుగులో చేసిన కృషిని మరొకరు చెయ్యలేదని డా॥ రమాపతి గారు అన్నారు.

ఈ కథా సంపుటిని తీసుకురావడానికి శ్రీ యార్లగడ్డ రాఘవేంద్రరావు గారికి, ఇప్పటి విపుల-చతుర నిర్వాహకులు చంద్రప్రతాప్ గారికి మరి ఇంకా అన్నివిధాల సహకారం అందించిన వారందరికి డా॥ అక్కిరాజు గారు కృతజ్ఞతలను తెలిపారు. చివరిగా ఈ సంపుటిని మొదటినుంచి, చివరివరకు తేవడంలో సహాయపడిన మోదుగుల రవికృష్ణ గారికి ప్రేమపూర్వక ఆశీస్సులను అందించారు. అసలు అంతా చేసినా ఈ సంపుటిని అచ్చువేయడానికి ముందుకు వచ్చిన 'బొమ్మిడాల ఫర్మ్ అధినేత కృష్ణమూర్తి గారికి రమాపతిరావు గారు ఎంతో ఋణపడి ఉంటారు. బొమ్మిడాల కృష్ణమూర్తి గారికి సాహిత్యం పట్లే కాకుండా, కళల పట్ల, కళాకారుల పట్ల ఎంతో శ్రద్ధ ఉంది. ప్రతి సంవత్సరము ఎంతోమందిని గుంటూరుకు రప్పించి వారిని ఘనంగా సత్కరిస్తుంటారు. కృష్ణమూర్తిగారు. నేరెళ్ళ వేణుమాధవ్, కారా మాష్టారు, అక్కిరాజు రమాపతిరావు లాంటి వాళ్ళని కాకుండా ఎంతోమందిని 'గుర్తపురికి' తీసుకురావడానికి ఆయనే కారణం. ఇక మోదుగుల రవికృష్ణ గారు స్థానికి ఆర్‌విఆర్ బి.ఇడి. కళాశాలలో తెలుగు అధ్యాపకులుగా పనిచేస్తూ, గుంటూరులో జరిగే ప్రతి సాహిత్య సభకు హాజరై కార్యక్రమాములను నిర్వహిస్తుంటారు. కృష్ణమూర్తి గారికి అప్పులై ఇట్లాంటి పుస్తకాలను అచ్చువేయించడం, ఎన్నో సాహిత్య కార్యక్రమాలను నిర్వహిస్తారు.

ఇక ఈ కథా సంపుటికి వస్తే పాతతరానికి చెందిన అత్యంత ప్రముఖ రచయితల కథలకు దీనిలో స్థానం కల్పించారు. ఆనాటి కాలంలో గురజాడ, వీరేశలింగం, వెంకటరత్నం నాయుడు గార్లు సమాజానికి ఎదురేది కొన్ని బోధనలు చేస్తే, ఆ ప్రభావానికి లోనైన వాళ్ళ శిష్యులు కొందరు చేసిన ఈ రచనలు తెలుగు కథకు ఎంతో మేలు చేసాయి. ఇంకో విషయం ఏమిటంటే ఎప్పుడూ చర్చకు వచ్చే కోస్తాంధ్ర, తెలంగాణా లేదా రాయలసీమలో మొదటి కథేది లేదా మొదటి రచయిత లేదా రచయిత్రి ఎవరూ లేరా మొదటి దళిత కథ ఏది లేదా, స్వాతంత్ర్యానికి ముందు లేదా తరువాత వచ్చిన కథలేవి అనేది ఈ పుస్తకంలో సంపూర్ణంగా తెలుస్తుంది.

ఈ సంపుటిలో వచ్చిన కొన్ని కథలను ఇక్కడ వివరిస్తాను. ఆచంట వెంకట సాంఖ్యాయన శర్మగారు వ్రాసిన "అపూర్వోపన్యాసము" అనే కథ మొదటిది. దాదాపు 1903లో "కల్పలత" అనే పత్రికలో వచ్చినట్లుగా ఈ సంపుటిలో తెలిపారు. కాని ఈ కథ యొక్క ఆచూకీ ఎక్కడా లేదు. గురజాడ వారి "దిద్దుబాటు" కంటే ముందుగా అచ్చయిన కథగా దీన్ని పేర్కొనవచ్చు. సామాజిక నేపథ్యం మెండుగా ఉన్న కథ ఇది. పూర్తి వ్యవహారికంలో ఉన్న ఈ కథ తెలుగులో వచ్చిన తొలికథగా ఎందుకు చెప్పకూడదని అనచ్చు. తరువాత భానుడు అనే కలం పేరు మీద "లాజరస్" అనే మంచి కథ రెండవది. స్వాతంత్ర్యం రాకముందే దళితుల మీద వచ్చిన కథగా చెప్పవచ్చు. ఆనాటి కాలంలో ఉన్న హిందువులు, క్రైస్తవుల మధ్య ఉన్న తగాదాలు, మనస్పర్ధలు గురించి వచ్చిన కథ. ఈ కథ "భారతి" పత్రిక కంటే ముందు వచ్చిన "శారద" లో అచ్చయినది. రాఘవశర్మగారు వ్రాసిన "పశ్చాత్తాపం" అనే కథ కూడా ఒక మంచి కథ. ఆనాటి సామాజిక స్థితి, కులాల మధ్య వివాదాలే దీనిలో ముఖ్య అంశము. ఒక శాస్త్రిగారు బాగా బతికి, పిల్ల పెళ్ళి చేసిన తరువాత బాగా చితికిపోయిన విషయమే ఈ కథ. రచయిత 'రాఘవశర్మ" అని అచ్చయినది కాని అసలు ఈ రచయిత ఎవరో ఎవరికీ తెలియదు అని సంపాదకుల అభిప్రాయం. బాబుగారు వ్రాసిన "అరిసెముక్కలు" అనే ఒక సరదా కథ దీనిలో ఉంది. సుమారు నూరు సంవత్సరాల కిందటే వచ్చిన కథగా ఇది రికార్డయినది. తెలిసీ-తెలియని వయసులలో అమ్మాయిలకు జరిగే పెళ్ళిళ్ళు గురించి వచ్చిన కథ. ఒక అమ్మాయి, తన కథను డైరెక్టుగా తనకు తాను చెప్పుకున్నట్లుగా ఉన్న ప్రక్రియ ఈ కథలో ఉంది. "వూదాచీర" అనే సరదా కథ "ముని మాణిక్యం" నరసింహారావు వ్రాశారు. దీనిలో భార్య బదులుగా ఒక

మరదలు పిల్ల అక్క కట్టుకునే వూదా చీరెను కట్టుకుని బావను ఆటపట్టిస్తుంది. ముని మాణిక్యం గారి హాస్యం దీనిలో మనకు కనిపిస్తుంది. "పోయిన నగ" అనే ఇంకొక కథ "కొడవటి వెంకట సుబ్బయ్య" గారు వ్రాశారు. కుటుంబరావు గారికి స్వయానా అన్నగారు ఈ వెంకట సుబ్బయ్యగారు "సాహితి" అనే పత్రికలో ఆనాడు వచ్చిన కథ ఇది. ఇంట్లో పోయిన ఒక నగ గురించి పరిశోధన చేసి కుటుంబంలో ఎవరు తీసారో చెప్పే కథ ఇది. తరువాత "కోటంరాజు పున్నయ్యగారు" వ్రాసిన "వంశపావనుడుగు తనయుడు" అనే ఒక మంచి కథ గురించి చెప్పుకోవాలి. శ్రీపాద సుబ్రమణ్యం గారి సమకాలీకుడుగా ఈయనను పేర్కొనవచ్చు. స్వాతంత్రసమర కాలంలో యువకుల మీద ఇంగ్లీషు చదువులు, వాటి సంప్రదాయాల ప్రభావం గురించి వచ్చిన కథ "నేను చేసిన పని" అనే కథ గుడిపాటి చలంగారు వ్రాసిన కథ కూడా ఈ సంపుటిలో ఉంది. చలం గారి కథల సంపుటిలో ఎక్కడ దొరకని కథను సంపాదకులు దీనిని పట్టుకొని దీనిలో అచ్చువేశారు. స్త్రీ, పురుషుల మధ్య ఆకర్షణ కాకుండా, ఆనాటి బాల్య వివాహాలు, లేదా భర్త చనిపోయిన ఆడపిల్లల మీద ఇంట్లో వాళ్ళ గృహహింసను వర్ణించారు చలంగారు దీనిలో. చింతా దీక్షితులు గారు వ్రాసిన "సుగాలి కుటుంబం" అనే కథ ఒక మంచి కథ. ఈ సంపుటిలోనిది సుమారు తొంభైఏళ్ళ నాటిది. "సాహితి" పత్రికలో వచ్చిన కథ ఇది. వనజన, గిరిజన వాళ్ళని అటవీ అధికారులు, జమీందారులు పెట్టే బాధలను అంశంగా తీసుకొని వ్రాసిన కథ.

ఈ కథా సంపుటిలో వచ్చిన మరో మంచి హాస్యపు కథ "పిచ్చి ఆసుపత్రి" ఇది వ్రాసినది గిడుగు వెంకట సీతాపతిరావు గారు. తెలుగు వ్యవహార భాష మార్గదర్శి గిడుగు రామమూర్తి గారి పెద్ద కొడుకు ఈయన. సరదాగా పిచ్చి ఆసుపత్రి చూద్దామని లోపలికి వెళ్ళి వాళ్ళు ఎదుర్కొన్న సంఘటనలు దీనిలో చూడచ్చు. "గళ్ళచీర" అనే కథను "కుమార రాఘవశాస్త్రి" గారు వ్రాశారు. స్వాతంత్రం రాక మునుపు నుండి మంచి కథా రచయితగా పేరు పొందిన ఈయన ఆలుమగల మధ్య నాజూకుతనం, అనురాగం గురించి వ్రాశారు. భార్యభర్తల మధ్య సంబంధాలు త్వరగా దెబ్బతింటున్న ఈ రోజులకు సరిపోయే కథ ఇది. కవికొండల వెంకటరావు గారు వ్రాసిన "అధసుధారసం" అనే కథ కూడా ఒక మంచి కథ. రాజమహేంద్రవరానికి చెందిన ఈయన ఆ రోజులలోనే అభ్యుదయ భావాలు కలిగిన వాడుగా చెప్పారు. భార్యభర్తల శృంగార విజృంభణ మీద వేసిన చురకగా దానిని చెప్పవచ్చు. ఇంకా కుమ్మరి చక్రం, కొలిమి, నూనెగానుగ మొ॥ కొన్ని కథలను ఈయన వ్రాశారు. ఈ సంపుటిలో వేలూరి శివరామశాస్త్రి గారు వ్రాసిన "దేవుడు" అనే కథను మంచి కథగా చెప్పవచ్చు. ఈ రచయిత తిరుపతి వెంకట కవుల శిష్యులలో ప్రముఖుడు. మరియు శరత్‌బాబును మొట్టమొదటిసారిగా తెలుగువారికి పరిచయం చేసారు. ఈయన "దేవుడు" అనే కథలో కన్నతల్లికి ఉన్న మూఢభక్తి, చాదస్తాన్ని కొడుకు మీద రుద్దుతుంది. దేవుడు పిలిస్తే పలుకుతాడు, అడిగితే కనిపిస్తాడు. దణ్ణం పెట్టుకుంటే పాస్ చేస్తాడు అని చెప్పే తల్లితండ్రులకు సరిగ్గా సరిపోయే కథ. చివరకు పిల్లవాడికి వాడిమీద వాడికి నమ్మకం తగ్గి పిచ్చివాడవుతాడు ఈ కథ చివర్లో.

తాతాకృష్ణమూర్తి గారు వ్రాసిన "సర్కస్" అనే మంచి సీరియస్ కథ దీనిలో ఉంది. స్వాతంత్రం రాకముందే (1945) కీర్తిశేషులైన ఈ రచయిత రాయప్రోలు, విశ్వనాథ, కృష్ణశాస్త్రి, నాయని, అబ్బూరి మొ॥ ఉద్దండులకు సహచరులుగా ఉండి తెలుగుభాషలో ఎంతో సాహిత్యకృషి చేశారు. ఈ కథ అనుకోకుండా లేక విధిలేక సర్కస్ కంపెనీలోకి వెళ్ళిన యువతి కథ. సర్కస్ కంపెనీలో స్త్రీ, పురుష సంబంధాలు, ఆకర్షణ, అక్కడ యజమానుల దాష్టికం గురించి తెలిపేది ఈ కథ "అదృష్టము" అనే కథ కరణం శ్రీనివాసరావు గారు. సుమారు డెబ్భైఏళ్ళ కింద వ్రాసినది కూడా పాఠకులను బాగా ఆకర్షిస్తుంది. ఆనాడు ఆంధ్రపత్రికలో వాల్మీకి రామాయణాన్ని వచనంగా మార్చి దాదాపు ఆ శీర్షికను రెండు సంవత్సరాలు తీసుకువచ్చిన రచయితగా ఈయనని పేర్కొనవచ్చు. పౌరోహిత వర్గాలవారి ధనాలోచన, ఆచార సంప్రదాయ దాష్టికం గురించి వ్రాసిన కథావృత్తాంతం ఇది. ఈ పరిస్థితులను ఈనాటికి ఇంకా మన సమాజంలో రోజూ చూస్తూనే ఉన్నాము.

విజయనగరానికి చెందిన కాళ్ళూరి వేంకట రామారావు గారు వ్రాసిన "యేప్రిల్ ఒకటవతేది' ఈ సంపుటిలో ఒక మంచి ఉద్దేశంతో వ్రాసిన కథ. 20వ శతాబ్ది మొదట్లో క్రైస్తవ మిషనరీలు ఇక్కడ పరిస్థితులను గమనించి దళితులను మనుషులుగా గుర్తించి వారికి విద్యా అవకాశాలు, ఉద్యోగాలను కల్పించారని తెలిపే ఒక మంచి కథ. కాని హిందువులను మతం మార్పించి క్రైస్తవులుగా చేశారని ఇది అన్యాయం

అనటంలో ఏమాత్రం అర్థం లేదు. మతం అన్నం పెట్టాలి కానీ విభేధాలు కాదు. ఒరిస్సాలోని తెలుగు ప్రాంతానికి చెందిన దిగుమర్తి రామారావు గారు వ్రాసిన "భామ" అనే మంచి కూడా ఇందులో ఉంది. ఈ కథ అప్పట్లో ముద్దుకృష్ణగారు నడిపిన "జ్వాల" పత్రికలో వచ్చినది. వేశ్యలను వారి వృత్తులను వదిలి ప్రధాన జనస్రవంతిలోకి తీసుకురావాలన్న గొప్ప ఆశయంతో వ్రాసిన కథ ఇది. తరువాత ఇట్లాంటి సంస్కరణలు తెలుగునాట చాలా జరిగాయి. ముద్దుకృష్ణ గారి స్వయం సంపాదకత్వంలో 'జ్వాల' పత్రికలో ఆయన కథ "కాలం కన్పించే మార్పు" అప్పట్లో వచ్చింది. గురజాడ వారి ప్రభావం చాలామంది యువకుల మీద ఉన్నట్లుగానే ఈయన మీద ఉండేది అప్పటి బ్రాహ్మణ వర్గంలో ఉన్న అగ్ర వర్ణాల అక్రమ ప్రవర్తన, అజమాయిషీ ఈ కథలో మనకు కన్పిస్తుంది. ఈ విషయాన్ని ఇప్పటికీ కూడా మన సమాజంలో చూస్తుంటాము.

ఈ సంపుటిలో 'షష్టిపూర్తి' అనే కథను గవిని వెంకట కృష్ణారావు వ్రాశారు. 20వ శతాబ్ది తెలుగు సాహిత్యంలో మేధావి రచయితగా ప్రసిద్ధులైన కొద్దిమందిలో ఈయన ఒకరు. ఆనాటి సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక రంగాలను అర్థం చేసుకొని వాటిపై రచనలు చేశారు. ప్రపంచ ప్రసిద్ధ "ప్లేటో" రాజనీతి శాస్త్రాన్ని "జేగంటలు" పేరున తెలుగనువాదం చేశారాయన. ముసలి తల్లిదండ్రులను లెక్కపెట్టక, వారిని పట్టించుకోక వారిని బాధ పెట్టడంపై వ్రాసిన కథ ఇది. ఈ రోజులలో ఇలా తల్లిదండ్రులను పంచుకొని, వారితో ఇంట్లో పనిచేయించుకునే సంతానాన్ని ఈనాడు మనం బాగా చూస్తున్నాము కదా, ఆనాడు యువతకు ఆయన వేసిన చురకగా ఈ కథను చెప్పవచ్చును.

కొద్దిమంది రచయిత్రులు వ్రాసిన కథలు కూడా ఈ సంపుటిలో చూడొచ్చు. కనపర్తి వరలక్ష్మమ్మగారు వ్రాసిన "దరిద్ర నారాయణుడని ఈ జగద్రక్షకుడికి బిరుదైతే", ఆనాటి స్వాతంత్ర్యోద్యమంలో సంఘ సంస్కరణ కూడా ఒక ప్రధానమైన ప్రభోమని, సమాజంలో వివిధ సాంఘిక వర్గాల మధ్య సమానతత్వం లేకపోతే అది పూర్తి స్వాతంత్రం కాదని ఆ నాయకులు చెప్పారు. ఆనాటి కాలంలో హరిజనులను అంటరానివారిగా దూరంపెట్టి, వివాహాది వేడుకలలో సహపంక్తి భోజనానికి రానీకుండా చేసేవారు. ప్రాణంలేని జంతువులకైనా అన్న పెట్టేవారు కానీ వీరిని దగ్గరకు రానిచ్చేవారు కాదు. ఇట్లాంటి విషయాలను తీసుకొని వరలక్ష్మమ్మగారు వ్రాసిన కథ ఇది. బండారు అచ్చమాంబగారు వ్రాసిన "ధనత్రయోదశి" కథ ఈ సంపుటిలో గొప్ప ఎన్నిక. ఈమె కొమర్రాజు వెంకట లక్ష్మణరావు గారికి స్వయానా సోదరి. ఆనాటి స్త్రీ విద్య, విజ్ఞానాల పట్ల సమాజ దృష్టి మళ్లించటానికి. కృషి చేసిన వీరవనిత అని చెప్పవచ్చును. భారతీయ సంస్కృతిని, సంప్రదాయాన్ని గౌరవిస్తూనే, స్త్రీ, పురుష సమానత్వాన్ని స్త్రీ విద్య, మహిళా పురోగతికి పాటుబడిన వారు శ్రీమతి అచ్చమాంబగారు. స్త్రీ అంటే పొరబాటు ఆలోచనలో ఉన్న పురుషులలో మార్పు తెచ్చి, వారిని మంచి మార్గంలో వెళ్లేలా చేసిన సందర్భమే ఈ కథ.

చిలకమర్తి లక్ష్మీ నరసింహారావు గారు వ్రాసిన "సుదర్శనరావు పంతులు" అనే కథ కూడా దీనిలో ఉంది. ఆనాడున్న గ్రాంధిక భాషను దాటి సామాన్యజనులకు అర్థం అయ్యేలా వ్యవహారికంలో వ్రాసిన ఈ కథ చాలా బాగుంటుంది. ప్రభుత్వ ఉద్యోగులలో ఆనాటికున్న లంచగొండితనం, కొన్ని సాంఘిక దురాచారాలను అరికట్టటానికి వ్రాసినదే ఇది. అప్పటికి ఈ విషయాలపై ఎక్కువగా పోరాడుతున్న వీరేశలింగం పంతులు గారి ప్రభావం ఈయనమీద కూడా చాలావరకు ఉండేది. వేటూరి ప్రభాకరశాస్త్రి గారు వ్రాసిన "కరుణకము" అనే కథ ఈ సంపుటిలో కన్పిస్తుంది. దాదాపు 1924లో వచ్చిన కథ ఇది. కొత్తరకం సంగీత వాయిద్యాలు, సంగీత విధానాలు వస్తున్న సమయంలో ప్రాచీన భారతీయ సంగీత, సంప్రదాయాలు ఎక్కడ మరుగున పడిపోతాయేమోననే బాధతో వ్రాసిన కథ ఇది. తరువాత 1980లో వచ్చిన విశ్వనాథ్ గారి "శంకరాభరణం" సినిమాకి ఇది ప్రేరణ అని చెప్పవచ్చును. ఇంకో విశేషమేమిటంటే పండితులు, వేదవీరాంగులు లాంటి వేటూరి ప్రభాకర శాస్త్రి గారితో పాటు మల్లాది వారు, శ్రీపాద వారు, శివరామశాస్త్రి లాంటి వారు ఆ కాలంలో కథారచనలు చెయ్యడం, చదవడం, జరిగాయని సంపాదకులు అన్నారు. ఇంకా ఈ కథా సంపుటిలో ఆఖరి కథ కొడవటిగంటి కుటుంబరావు గారు వ్రాసిన "తీరని సమస్యతో" గురించి చెప్పాలి. ఉన్నత విద్యనభ్యసించి, కట్నకానుకలను ఇచ్చుకోలేని స్థితిలో ఉన్న మధ్యతరగతి యువతి సమస్యను తీసుకొని వ్రాసిన కథ ఇది. పెళ్ళికాని లేదా చిన్న వయస్సులోనే విధవరాలయిన యువతులను మధ్యతరగతి ఇళ్ళలో ఏ విధంగా రాచిరంపాన పెడతారో, కనీసం అన్నం, వస్త్రాలు ఇవ్వకుండా ఎట్లా బాధిస్తారో తెలియజేస్తూ, ఆనాటి దురాచారాలను కళ్ళకి

## కవిత

# నా కన్నీరు నీకు కనిపించలేదా?!

- విజయలక్ష్మి పండిట్
8369061472



ఓ మనిషీ...,

ఎందుకింత క్రూరత్వం నీలో..,
నీవు నాలాగే ఒక జీవివే కదా!
నా శరీరాన్ని నీవు గాయపరిచినపుడు
నా నొప్పి నీకు తెలియడంలేదా..?!

నీకు బాధయినపుడు నీ కండ్లు మాత్రమే
కన్నీరు కార్చుతాయి...కాని నాకు ఒళ్ళంత కండ్లే..,
నాపూలు, కాయలు, పండ్లు, ఆకుల కోసం
నీవు నా శరీరాన్ని గిల్లి నపుడు
తుంచినపుడు నీ సంతోషం కోసం ?!
ఆ చిన్న చిన్న గాయాలను ఓర్చుకుంటాను ..

కాని నీవు మనసులేని మనిషివై
పెద్ద పెద్ద ములుకులను నా శరీరంలోకి
సుత్తితో కొట్టి దించి నన్ను చీల్చి
నా నడుము చేతులు విరిచి
నన్ను ముక్కలు ముక్కలు చేసి
గాయపరచినపుడు నా ఒళ్ళంతా కార్చే
నా కన్నీరు నీకు కనిపించలేదా..బిడ్డా?!
నన్ను హింసించి నీవు శిక్షించుకుంటున్నావు,

ప్రాణవాయువుతో నీ ప్రాణాన్ని కాపాడి
నీకు పూటపూటకు అన్నంపెట్టి నీ కడుపునింపి
నా పచ్చని నీడ ఒడిలో ఆకుల వింజామరలతో
చల్లని గాలితో నీకు సేదతీర్చే తల్లిని నేను,

నేను నీకు చేస్తున్న సేవ ఎవరు చేస్తారు చెప్పు
ఈ చెట్టు తల్లిని రక్షించి నిన్ను రక్షించుకో! ♦

---

కట్టినట్లు చెప్పారు. ఇప్పటికీ గ్రామాలలో లేదా పట్టణాలలో కూడా పెళ్ళికాని యువతులను లేదా భర్తను కోల్పోయిన యువతులను మాటలలో, చేతలలో ఎంత బాధిస్తారో మనకి తెలుసు.

ఈ విధంగా డా॥ అక్కిరాజు రమాపతిరావు గారు దాదాపు నూటయాభై సంవత్సరాల నుండి కుటుంబరావుగారి కాలం దాకా వచ్చిన మంచి కథలను, ఆనాటి సామాజిక పరిస్థితులను చెప్పే కథలను ఏర్చి, కూర్చి జనం కోసం సంపుటిగా తెచ్చినందుకు, దానిని అచ్చువేసినందుకు బొమ్మిడాల కృష్ణమూర్తిగారికి, అదేవిధంగా మొదటి నుండీ చివరిదాకా తన సహాయ సహకారాలను అందించిన సాహిత్య విద్యార్థి మోదుగుల రవికృష్ణ గారికి ధన్యవాదములు తెలుపుచున్నాను. ఇలాంటి మహా సంపుటిని ఇంకా ఎంతోమందికి పరిచయం చెయ్యాలని తపనతో ఈ చిన్న ప్రయత్నం చేస్తున్నాను. "తొలి మలితరం తెలుగు కథలు" సంపుటిలో మొత్తం 43 కథలు ఉన్నాయి. మొత్తం పేజీలు 388. ఈ పుస్తకం అన్ని నవోదయ మరియు విశాలాంధ్ర బుక్‌హౌస్ కేంద్రాలలో దొరుకుతాయి. ఈ సంపుటి ఖరీదు రెండు వందల యాభై రూపాయలు మాత్రమే. సాహిత్యంపై మక్కువ, పాతతరం రచనలు, రచయితలు ఇంకా వారి విషయాలను తెలుసుకోవాలనే వారికి ఈ పుస్తకం ఒక పరిశోధన గ్రంధమంత సమాచారమిస్తుందని ఘంటాపదంగా చెప్పవచ్చు. అందరూ చదివి, దీని గురించి అందరికీ చెప్పాలని అనుకుంటున్నాను. ఇంకా కొత్తగా రాసేవారికి ఈ పుస్తకం ఎంతో ఉపయోగపడుతుందని చెప్పవచ్చు. ఇకపోతే నేను స్థానిక మహిళా డిగ్రీ కళాశాలలో జంతుశాస్త్ర అధ్యాపకుడుగా పనిచేస్తున్నాను. మంచి సాహిత్యం చదవటం, సాహిత్య సభలకు వెళ్ళటం నా హాబీలు. చివరిగా నా ఈ చిన్న ప్రయత్నాన్ని "సాహిత్య ప్రస్థానం"లో అచ్చు వేస్తే బాగుంటుందని నా విన్నపం. ♦

**విశ్లేషణ**

# చంద్రవర్షంలో తడిసిన 'ప్రకృతి'



భగ్వాన్

- నీలం వెంకటేశ్వర్లు
9502411149

'ప్రకృతి కాంతకూ ఎన్నెన్ని హొయలో, పదము కదిపితే ఎన్నెన్ని లయలో 'అంటూ ఒక సినీగీత రచయిత ప్రకృతిలోని విషయాలను, లయలను ప్రేక్షకులకు అందించాడు. ప్రకృతి అనే పదం భౌతిక ప్రపంచంలోని భూమి, నదులు, వాగులు వంకలు, చెట్లుగుట్టలు, ఆకులు, పూలు, కోయిలలు, తుమ్మెదలు ఇలా మొదలైన వాటికి రూఢమైపోయింది. ప్రకృతి వర్ణనలు మనకు వేదాల్లో కనిపిస్తాయి. భారత రామాయణాది ప్రాచీన కావ్యాల్లోను కనిపిస్తాయి. అలాగే ఆధునిక సాహిత్యంలో ఇంగ్లీషు కాల్పనిక కవిత్వ లక్షణాల ప్రభావంతో భావకవుల కవిత్వంలోనూ ప్రకృతి ప్రవేశించింది. భావకవులలో ఒకరు ప్రకృతిలో ప్రణయ శృంగారాన్ని దర్శిస్తే, మరొకరు గురువుగా భావించారు. ఇలా ప్రకృతిని కవులు అనేక రూపాలలో దర్శించారు.

ప్రకృతి మనిషి పచ్చని జీవితానికి పునాది వంటిది. అది మనిషికి ప్రేరణను ఇస్తుంది. అలసిన మనసుకు కాసింత ప్రశాంతతనిస్తుంది. మనిషికి ఊతమవుతుంది. మనిషిని స్పందింప చేస్తుంది. అంతేనా అంటే అంతే కాదు, తరతరాల నుండి కవులకు వస్తువౌతుంది. వారి కలానికి బలమవుతుంది. పాఠకుడి మనసును ఊయల లూగేలా చేస్తుంది. అందుకే ప్రకృతికి దాసోహం కాని మనిషంటూ ఉండదు. అలాంటి ప్రకృతిని తడిచేసి, అక్షరాలనిండా ప్రకృతి సోయగాలను మోసుకొచ్చిన కవి భగ్వాన్.

పశ్చిమ గోదావరి జిల్లాకు చెందిన ఎ.పి.యస్. భగ్వాన్ శబ్దాల్ని ప్రేమిస్తూ(1992), వడ్లబండి(1997), బల్లకట్టు(2002), చంద్రవర్షం(2016) అనే వచనకవితా సంపుటాలను, ఏటి ఒడ్డున ప్రయాణం(2000) అనే హైకూ సంపుటిని వెలువరించారు. వీరు ఆంధ్ర సారస్వత సమితి వారి సుశీలా దేవి ప్రతిభా పురస్కారాన్ని అద్దేపల్లి రామమోహనరావుతో సంయుక్తంగా అందుకున్నారు. భగ్వాన్ ఈ పురస్కారాన్ని రెండు సార్లు అందుకోవటం గమనార్హం. అలాగే జె.ఎం. నాయుడు సాహితీ పురస్కారం, కాటన్ జలశిల్పి పురస్కారం వంటి అవార్డులు ఆయనను వరించాయి.

భగ్వాన్ వృత్తిరీత్యా సైన్స్ ఉపాధ్యాయుడు. అందుకేనేమో వారు ప్రకృతి పట్ల మరింత మమకారాన్ని పెంచుకున్నాడనిపిస్తుంది. అందుకే జింబో ఆంధ్రభూమి సాహితిలో భగ్వాన్ బల్లకట్టు కవితాసంపుటిపై వ్రాసిన ఒక వ్యాసంలో " ఈ కవికి చెట్టన్నా, పిట్టలన్నా, ఇల్లన్నా, తమ పల్లె అన్నా విపరీతమైన ప్రేమాభిమానం. చెట్టు నా ఆదర్శం, చిలుకలు వాలిన చెట్టు కవితా సంపుటాలను వెలువరించినందుకు ఇస్మాయిల్‌ను చెట్టుకవిగా పేర్కొంటున్నారు గాని నిజానికి దేవిప్రియని, భగ్వాన్‌ని కూడా చెట్టుకవులుగానే పిలవాలి " అంటాడు. జింబో అభిప్రాయం అక్షర సత్యం. ఎందుకంటే, భగ్వాన్ చెట్టు కవితని చదివితే మనకూ చెట్టు మీద ప్రేమ పుడుతుంది. మనకూ ఒక చెట్టు నాటాలనిపిస్తుంది.

భగ్వాన్ 2016లో చంద్రవర్షం అనే వచనకవితా సంపుటిని వెలువరించారు. భగ్వాన్ ఈ సంపుటికి పెట్టిన

పేరులోనే ప్రకృతి తొణికిసలాడుతోంది. ' నేను కవిని, భూమి కవిని ఆరు ఋతువుల ఆనందామృత కవిని ' అని నగర కవిసమ్మేళనం అనే కవితలో భగ్వాన్ ప్రకటించుకుంటాడు. ఈ కవి నిజంగా ఆనందామృత కవే అనటంలో ఎలాంటి సందేహం లేదు. పువ్వులు తేనెను సేకరించి, తుమ్మెదలకిచ్చినట్లు, భగ్వాన్ కూడా ప్రకృతిలోని అందాలను కవిత్వీకరించి పాఠకులకందిస్తాడు. పాఠకుడు ఆ తడిలో తడిసి ముద్ద అయిపోతాడు. అక్కడి అందాలను తనివితీరా రుచి చూస్తాడు. తనను తాను మరచిపోయేంత మధురానుభూతిని పొందుతాడు. అదీ భగ్వాన్ కవితకున్న నిబద్ధత, గొప్పదనం.

'కాదేదీ కవితకనర్హం' అన్నట్లు భగ్వాన్ ఏ చిన్న వస్తువును తీసుకున్నా అందులో గొప్ప భావుకత కనిపిస్తుంది. భగ్వాన్ చంద్రవర్షం కవితా సంపుటిలో ప్రకృతిలోని పక్షులు, ఎండ, వాన, చలి, పుష్పాలు, చెట్టు వంటి అనేక అంశాలను స్పృశించాడు.

ప్రకృతి ఒక సంగీత సామ్రాజ్యం. వినగలిగే చెవులుండాలే కానీ, అందులో అణువణువులోనూ సంగీతం వినిపిస్తుంది. ఆకుల సవ్వడులు, జలపాతాల గలగలలు, పక్షుల కిలకిల రావాలు, తుమ్మెదల ఝూంకారాలు కలిసి సంగీత కచేరి చేస్తున్నట్టుగా ఉంటాయి. కవి ఒక పిట్టను ఎలా లాలించి బుజ్జగించి పాట పాడించాడో, ఆ పాట ఎంత మధురంగా ఉంటుందో ' పిట్టా – దాని పాట' కవితలో ఆస్వాదిద్దాం.

***పిట్టా! ఓ పిట్టా ! / ఓ బుజ్జి బుజ్జి పిట్టా ! / ఓ బుల్లి రెక్కల పిట్టా ! / ఓ పంచరంగుల పిట్టా ! / ఓ పాట పాడు పిట్టా .../ ఎంత అద్భుతంగా పాడుతున్నావే ! / ..../ పిట్టా నీ పాట నన్నోచోట కుదురుగా / కూర్చోనివ్వడం లేదు కదా ../ మేను మరచి ప్రశాంతంగా /నిద్దుర పోనివ్వడం లేదు కదా .../ ఏ పాటే నువ్వు పాడేది ?/ ఎవరి పాట ?/మా ఊరి వరిచేలల్లో శ్రామిక వనితలు /పనులు చేస్తూ పాడుతారు చూడు***

***2***

***ఆ పాటేనా నీ పాట /మా ఊర్లో పెద్ద పండక్కి/ కృష్ణుడి వేషధారి/ ఊరంతా తిరుగుతూ/ మురళిని చిత్రంగా ఊదుతాడు చూడు/ ఆ పాటేనా నీ పాట "*** ( పిట్టా – దాని పాట)

అమ్మ బిడ్డను బతిమాలినట్లు, కవి పిట్టను బతిమాలతాడు. చివరకు దానితో పాటనూ పాడిస్తాడు. తాను పరవశం పొందుతూ, పాఠకుడ్నీ ప్రకృతి పారవశ్యంలోకి తీసుకుపోతాడు. కవికి పల్లెతనం అన్నా, ప్రజలు పాడుకునే పాటలన్నా చాలా ఇష్టం. వాటి మాధుర్యాన్ని ఆయన రుచి చూస్తూనే మనల్ని కూడా రుచి చూడమంటాడు. ఇక ఈ కవితలోని ముగింపు పాదాలను చూస్తే

***అమృతాన్ని కొసరి కొసరి పంచిన***
***అవతారమోహినివి నువ్వేనా ....... ఐతే***
***ఆ అమృతాన్ని దోసిళ్ళతో తాగేసే***
***స్వర్గవాసిని నేనేలే ! "*** అంటాడు. ఈ కవిత యొక్క భావసారమంతా మనకు ఈ ముగింపు వాక్యాల్లోనే తెలుస్తుంది. కవి దృష్టిలో ప్రకృతి నుంచి లభించే ప్రతీదీ అమృతంతో సమానమే. అందుకే ప్రతి మనిషి దాన్ని స్వీకరించే స్వర్గవాసి కావాలంటాడు. మరి ఇపుడు ఆ అమృతాన్ని తాగే స్వర్గవాసులు ఎంత మంది ఉంటారు?

పిట్టల పట్ల వాటి పాటల పట్ల భగ్వాన్ ఇంత ప్రేమ పెంచుకున్నాడు కాబట్టే వాటిని హింసించినా, గాయపర్చినా తట్టుకోలేకపోతాడు. తల్లడిల్లిపోతాడు. ఒక మానసిక సంఘర్షణకు లోనవుతాడు. అలాంటి సంఘర్షణలో నుంచి పుట్టిన కవితే ***' పిట్టలూ బతకాలి '***

***పిట్టా, ఎవడే నిన్ను కొట్టింది/ ఎవడే నిన్నిలా గాయాల గుచ్చింది/ మొవ్వు అరిటాకులా మృదువైన దానివే/ బాల్య జ్ఞాపకంలా ప్రియమైన దానివే/ తల్లి పొత్తిళ్ళ బిడ్డలా ప్రాణమైన దానివే/ పిట్టా, ఆకాశం నీ సుస్థిర స్వరాజ్యం/ పిట్టా, వృక్షం నీ సుందర స్వగృహం/ ఇది కాదనే వాడు మహా దుండగుడు/ నిన్నిలా హింసించేవాడు క్రూర హంతకుడు/ ....***

***3***

***పిట్ట గాయపడితే/ నేల గాయపడినట్టు కాదా/ పిట్ట కన్నీరొంపితే/ నింగి కన్నీరొలికినట్టు కాదా/ పిట్ట రక్తం స్రవిస్తే/ మనిషి రక్తం కార్చినట్టు కాదా*** ( పిట్టలూ బతకాలి)

ఈ కవితలోని తొలి రెండు పాదాలను చూస్తే కవిలోని అమ్మతనం దర్శనమిస్తుంది. దెబ్బతగిలించుకొని ఇంటి కొచ్చిన పిల్లాడి పట్ల అమ్మ పడే బాధ, ప్రేమ, కోపం అన్నీ ఈ సందర్భంలో భగ్వాన్‌లో కనిపిస్తాయి. తల్లి బిడ్డను ఓదార్చినట్లు, భగ్వాన్ గాయపడిన పిట్టను ఓదార్చుతాడు. పిట్ట అంటే పక్షి మాత్రమే కాదు. అదో ప్రకృతి. ప్రకృతి అంటే వృక్ష, జంతు, భూజలచరాలు, గాలి, నీరు, అగ్ని, నింగి, నేల మొదలైన వాటి సమ్మేళనం. ప్రకృతిలో లభించే ప్రతీదీ కేవలం మన సుఖసంతోషాలకే కైంకర్యం అవుతున్నాయన్న సంగతి మనకు తెలుసు. కాబట్టి ప్రకృతిని గాయపరిస్తే, మనిషి గాయపడినట్లే. ప్రకృతిని విధ్వంసానికి గురి చేస్తే, మనిషి విధ్వంసం అయినట్లే. ప్రకృతి నశిస్తే, మనిషి నశించినట్లేనని చెప్పటమే భగ్వాన్

తాపత్రయమంతా. కాలుష్య పిశాచాలు, సెల్‌టవర్ల రేడియేషన్ విషకోరల నడుమ నలిగి నలిగి ఇవాళ చిన్నచిన్న పక్షులు అంతరించిపోతున్న విషయం మనకు తెలిసిందే. ఇలాంటి స్థితిలో నేనో పిచ్చుకను చూశాను, చెట్టూ – చిలుకలూ, పాఠం పేరు పర్యావరణం, రాత్రికి మరోపేరు కవిత్వం, తోటకు వీడ్కోలు వంటి కవితలను చదివితే భగ్వాన్ ఎంతటి పక్షి ప్రేమికుడో మనకు అర్థమవుతుంది.

భూమిపై నివసించే సమస్త జీవరాశిని ప్రభావితం చేయటంలో సూర్యుడు చాలా ప్రధానమైనవాడు. మనం తినే తిండి, తాగే నీరు, పీల్చే గాలి ఇలా ప్రతి దాంట్లో సూర్యుడి పాత్ర ఉంటుంది. అలాంటి సూర్యుడ్ని

భగ్వాన్ ' సూర్యుడి కళ్ళు ' కవితలో ఎంత మనోహరంగా చిత్రించాడో చూద్దాం.

*వెలుతురు నేత్రాలవాడు/వెతుకుతున్నాడు/చీకటి జాడల కోసం.../విప్పారిన కాంతి కళ్ళతో .../..../సూర్యుడు కళ్ళు తెరచీ తెరవగానే/ పిట్టలు రెక్కలు దులుపుతాయి*

*కాంతి సునామీలో కొట్టుకుపోతుంది చీకటి/ ..../ఆవులు ఆనందంతో మోరలు పైకెత్తి/ గంగడోలులూగేలా అరుస్తాయి/ గిట్టల కింద నలిగి నలిగి చీకటి ఏమైపోతుందో/ ఎక్కడికి కూరుకుపోతుందో ( సూర్యుడి కళ్ళు, పుట: 83 )*

ఇందులో కవి సూర్యున్ని వెలుతురు నేత్రాల వాడు అంటాడు. సూర్యోదయ సమయంలో ఆ నేత్రాల నుండి వెలువడే లేలేత కిరణాలను చూసి పక్షులు ఆనందంతో కిలకిల రావాలు చేస్తాయి. పుష్పాలు ఆహ్లాదకరంగా విచ్చుకుంటాయి. లేగదూడలు చెంగు చెంగున గంతులేస్తాయి. ఇలా సూర్యుడు మంచి వాతావరణాన్ని సృష్టించి, మనల్ని అందులో పరవశించి పోయేలా చేస్తున్నాడు. అంతేకాదు సూర్యుడ్ని మనం చైతన్యానికి ప్రతీకగా చెప్పుకుంటాం. ఎందుకంటే సూర్యుడి కళ్ళు ప్రకృతి సిద్ధంగా ఏర్పడే చీకటినే కాదు, మనిషిలోని అజ్ఞానమనే చీకటి పొరలను కూడా తరిమి తరిమి కొడుతాయని అంటాడు కవి.

ప్రకృతిని వర్ణించటంలో కాళిదాసు, భవభూతులు భిన్నమార్గాలను అనుసరించారు. కాళిదాసుకు ప్రకృతి మనోహరంగా కనిపిస్తే, భవభూతికి భయంకరంగా కనిపించింది. అయితే ప్రకృతిని వర్ణించడంలో భగ్వాన్ వీరిద్దరి మార్గాలను అనుసరించారేమో అనిపిస్తుంది. ఎందుకంటే తన కవిత్వంలో ప్రకృతిని మనోహరంగా చూపించగలడు. అది ప్రకోపిస్తే ఎంత భయంకరంగా ఉంటుందో కూడా చూపించగలడు. పై కవితలో సూర్యుడి నుండి వెలువడే కాంతి కిరణాలను మనోహరంగా చిత్రిస్తే, 'ఒక ఎండ రోజు ' కవితలో అవే కిరణాలను ఎంత భయంకరగా చిత్రించాడో చూడండి.

*పొద్దున్నే, ఎండ పేల్చేస్తోంది*
*దయ్యరు పిస్టోలూ*
*బుస్సీ తుపాకీ*
*రూథర్‌ఫర్డ్ ఫిరంగి – ఇవ్వన్నీ*
*ఈ ఎండ ముందు బలాదూర్*
*ఇళ్ళెక్కి, ఎండ భస్మాసుర నృత్యం చేస్తుంది*
*సాయంత్రం బీచ్‌లా రద్దీ రద్దీగా ఉండే మా ఊరి కూడలి*
*ఎండ పోటుకు*
*దొంగలు దోచిన బ్యాంకు లాకరులా*
*ఖాళీ ఖాళీగా ఉంది*
*ఎండతో జతకట్టిన ఆకాశం*
*మా ఊరిని గుటుక్కున మింగే భూతంలా ఉంది*
*....     ....     ....*
*పొలాల నడుమ అనకొండలా జారుతున్న కాలువలో*
*పారేది నీరు కాదు, ఎండే*
*కరకు ఎండ*
*5*
*చేలమీంచి చేపల చెరువుల మీంచీ*
*జుయ్ జుయ్‌మంటూ చెవుల్ని కొరికేది గాలి కాదు ఎండే*
*కసాయి ఎండ*
*అంతటి ఎర్రటి ఎండలోనూ నడిరోడ్డు మీద*
*చకచకా నడచిపోతున్న ముసలమ్మ బోసి పాదాలకు*
*నమస్కరించకుండా ఉండలేను*
*( ఒక ఎండ రోజు, పుట: 26 )*

వేసవిలో ఎండ ఎంత భయంకరంగా ఉంటుందో మనందరి అనుభవంలో ఉన్న విషయమే. మండే ఎండలంటే భయపడని వాళ్ళు ఎవరుంటారు. కానీ ఉగాది పచ్చడి లాగా ఎండాకాలం ఆహ్లాదకరమైన ఉదయాలు, విసుగెత్తించే మధ్యాహ్నాలు, ఫర్వాలేదనిపించే సాయంత్రాలు, ఉడుకెత్తించే రాత్రుళ్ళు ఒకవైపు, పెళ్ళిళ్ళ సందళ్ళు, పిల్లల కేరింతలు మరోవైపు ఇలా సుఖదు:ఖాల మేలుకలయికగా ఉంటుంది. వేసవిలో పారే నీరైనా, వీచే గాలైనా సరే అన్నీ ఎండతో వేడెక్కి ఉంటాయి. అందుకే ఎండను కరకు ఎండ, కసాయి ఎండ, కత్తి పదును ఎండ అంటూ సూర్యుడి ప్రతాపాన్ని భగ్వాన్ మనముందుంచాడు. ఇలా చెప్తూనే ' ఊరి చివర గుడిసెల్లోని పిల్లలు కొందరు, సగం సగం దుస్తులలో, అంత ఎండ

తుఫానులోనూ హాయిగా ఆడుకుంటున్నారు ' అన్న కవి మాటలను బట్టి ఎండాకాలం అంటే చర్మం మండే కాలమే కాదు, పిల్లల మనను నిండే కాలం అని కూడా గ్రహించాలంటాడు. భగ్వాన్ ఒక్క ఎండకే కాదు వానకు,చలికి కూడా తన కవిత్వంలో స్థానం కల్పించాడు. చలిరోజు, వానలో తడవడం, కురుస్తున్న వాన వంటి కవితల ద్వారా మనల్ని మధురానుభూతులలోకి తీసుకుపోతాడు.

పువ్వులు సుకుమారమైనవే కాదు, అందమైనవి కూడా. వాటిని ఇష్టపడని వారు ఉండరు. అంతలా అవి మనల్ని ఆకట్టుకుంటాయి. ఇదంతా వాటి బాహ్యసౌందర్యానికి సంబంధించిన విషయం. మనిషికి బాహ్యసౌందర్యం, అంత:సౌందర్యం ఉన్నట్లే, పుష్పాలకు కూడా ఉంటుంది. భగ్వాన్ వాటి బాహ్య, అంత:సౌందర్యాలను ' కుసుమ సౌందర్యం ' కవితలో ఇలా అక్షరీకరించాడు.

***పొద్దున్నే మక్కువగా ఎవరో ఒకరు***
***నా పువ్వుల్ని మృదువుగా కోస్తుంటే***
***చీకటిని చీల్చుకుంటూ నీటిని కోసుకుంటూ***
***దూసుకు వస్తున్న***
***వెలుతురు కణాల వెచ్చదనాల్లా***
***నా ప్రాణాలు వెలుగుతాయి***
***ముచ్చటగానో మురిపెంగానో***
***నా పువ్వుల అత్తరు సువాసనలతో***
***దోసిళ్ళనూ లోగిళ్ళనూ***
***అందంగా అలంకరించుకుంటున్న వేళ***
***నా చెట్టుతనం యావత్తు***
***ఆరు ఋతువుల పరవశత్వమే !*** ( కుసుమ సౌందర్యం)

ఈ కవిత చదువుతుంటే , వానమామలై వరదాచార్యులు వ్రాసిన కుసుమోపదేశం గుర్తుకు వస్తుంది. కవులు రెండు చోట్ల పుష్పాలతోనే మాట్లాడిస్తారు. పుష్పాలు సౌందర్యానికి సంకేతం. స్థిరమైన, స్వచ్ఛమైన ప్రేమకు నిదర్శనం. పుష్పం ఒక ఆశావాదాన్ని ప్రదర్శిస్తుంది. దాని ఆశంతా ఇతరులకు తను ఉపయోగపడితే చాలు అనుకుంటుంది. చెట్టు అది ఏ చెట్టు అయినా కానీ ఆయా ఋతువులలో దాని ధర్మాన్ని అది నిర్వర్తిస్తూ, ఇతరులకు ఉపయోగపడుతూ తనకు తాను పరవశత్వం చెందుతుంది. అదీ ఇక్కడ కవి చెప్పిన చెట్టుతనమంటే. చెట్టు ఎలాగైతే చెట్టుతనంతో జీవిస్తుందో, మనిషి కూడా మనిషితనంతో జీవించాలన్నది కవి భావన. మనిషిగా జీవించటం వేరు, మనిషితనంతో జీవించటం వేరన్న విషయాన్ని ఇక్కడ మనం అంతర్లీనంగా గ్రహించాలి.

భగ్వాన్ ' కవిత లెప్పుడూ మనిషి తనం వాసన వేయాలి; కవిత్వమెప్పుడూ మానవతా ద్వారంలోంచే పయనించాలి!' అంటారు. కవిత్వం ద్వారా మనిషిలో మనిషితనాన్ని నింపాలన్నదే ఆయన ఆశయం. భగ్వాన్ ప్రకృతి గురించి చెప్పినా లేదా మరే వస్తువు గురించి కవిత్వీకరించినా మనిషికి ఆ వస్తువుకు మధ్య ఒక అనుబంధపు వంతెనను నిర్మిస్తాడు. అదెలాగో ' మనిషి కోసమే ' అనే కవితలో చూద్దాం.

***చెట్టుకు ఆకులు తొడగడమూ***
***చేనుకు కంకులు పొదగడమూ***
***మనిషి గురించి ఆలోచించటమే !***
***పిట్టలకు రెక్కలు అతకడమూ***
***పువ్వుకు అత్తరు అద్దడమూ***
***మనిషి గురించి మాట్లాడటమే! "***
***మనిషి కోసమే, పుట: 13 )***

అంటాడు. ప్రకృతిలో మనకు అవసరమైనవెన్నో ఉన్నాయి. మనం జీవించటానికి కావలసిన అవకాశాన్ని ప్రకృతి మనకు ప్రసాదిస్తుంది. చెట్టుకు ఆకులు తొడిగినా, చేనుకు కంకులు పొదిగినా లాభపడేది మనిషే. అందుకే కవి ప్రకృతి గురించి మాట్లాడటమంటే మనిషి గురించి మాట్లాడటమే అన్న సత్యాన్ని గ్రహించేలా చేశాడు. మరి ప్రకృతిలో భాగమైన మనం ప్రకృతి యొక్క మహోన్నత స్వరూపాన్ని ఎంత వరకు అర్థం చేసుకుంటున్నాం అన్నది మిలియన్ డాలర్ల ప్రశ్న.

మనకు ఈనాడు ప్రకృతి కవిత్వం అంటే వెంటనే భావకవిత్వమే స్ఫురణకు వస్తుంది. భావకవులు ప్రకృతి రమణీయతలో పరవశించిపోయారు, వీరు ప్రకృతికి, ప్రణయానికి విడదీయరాని అనుబంధాన్ని ఏర్పరిచారే కానీ ప్రకృతికి, మనిషికి మధ్య వారధిని నిర్మించలేకపోయారు. దీనికి కారణం భావకవులు ప్రకృతిని, మనిషిని విడివడిగా చూడటమే. భావకవుల తర్వాత వచ్చిన అభ్యుదయకవులు మనిషిని చైతన్యపరచటానికి మాత్రమే

ప్రాధాన్యతనిచ్చారు. కానీ భగ్వాన్ మనిషిని ప్రకృతిలో భాగంగా పరిగణించారు. అందుకే తన కవిత్వంలో

ప్రకృతికి, మనిషికి మధ్య ఒక సంబంధాన్ని ఏర్పరిచారు. ప్రకృతి అంటే కేవలం విహారస్థలం కాదనీ, అది మనిషి యొక్క బ్రతుకుబాటను నిర్ణయించే స్థలమని భగ్వాన్ తన కవిత్వం ద్వారా నిరూపించారు.

◆

## కవిత

# దినుసులు

మళయాళం మూలం: శ్రీజిత్ పెరుంతచాన్
తెలుగు అనువాదం: పాయల మురళీ కృష్ణ
9441026977

ఉప్పు ఇక తగ్గించు
నా మూత్రపిండాలు పూర్తిగా పాడైపోతే
నువ్వొకటి దానం చేస్తావో లేదో ఎవరికి తెలుసు...!?

మధుమేహం కమ్ముకొస్తున్న కాలంలో కదా మనమున్నాం
తీపి తినడం ఆపేయడమే మేలు

కారం ...మసాలా...
అబ్బే ..అవెప్పుడో అంటరాని వైపోయాయి

చింతపండు పులుపుతో ఛాతీలో మంట పెట్టకు...
చుట్టూ ఉన్న ప్రపంచంలో మంటలకే కరువా...
ఇంకా నాకవసరమా...

క్రొవ్వు పదార్థాలంటావా..
హృదయమూ కాలేయమూ పదిలంగా ఉండొద్దూ...
వాటి జోలికిమాత్రం వెళ్లొద్దు

ఆమె సహనం కోల్పోయింది
ఇవన్నీ అనారోగ్యమే అయితే
ఏం తింటారో చెప్పండి ముందు....
ఏం వండాలి నేను....?



వీటన్నిటితోనూ మీకపాయమే అయితే
నిజానికి  ఎంతైనా తీసుకోవాలనిపించేది
నిత్యమూ కావాలనిపించేది
ఏదైనా వుందా...

'ప్రేమ'.. అతడు బదులిచ్చాడు
నువ్వు వండినపుడు లెక్కలేనంత ప్రేమను కలుపు
నామీద నీకున్న ప్రేమ
రోజూ...
బయటా...లోపలా ◆

---

# నానీలు

- కుడికాల "సరోజనార్ధన్" వంశీధర్
9885201600

మానవ దేహం
సదా సందేహ కృతి
దేశం
జనసందోహ కృతి

అందమంటే
కొలతలు కాదు
ముదిమి అంటే
ముదతలూ కాదు

తెల్ల కాగితం
తహతహలాడుతుంది
ఓ సిరా మరక
అంటినా చాలని



నాదో బాణి
నీదో బాణి
ఏదైనాగాని?
మెచ్చాలి కదా జనవాహిని

చిన్నదైనా సరే
సాయం పట్టు
ఉడుతవై
ప్రేమ సేతువు కట్టు ◆

విశ్లేషణ



# తెలుగు స్థానంలో సంస్కృతం సమంజసమా?

- డా. అప్పిరెడ్డి హరినాథరెడ్డి
9963917187

సంస్కృతం గొప్ప భాషే. ఆ భాష అధ్యయనానికి ప్రత్యేక విధానం ఉంటే ఆ భాషపై నైపుణ్యం వస్తుంది. తెలుగు రాష్ట్రాలలో ఒకటవ తరగతి నుండి పదవ తరగతి వరకు త్రిభాషా సూత్రం ప్రకారం ప్రథమ భాషగా తెలుగు లేదా వారి మాతృభాషలు, ద్వితీయ భాషగా హిందీ, తృతీయభాషగా ఆంగ్లం చదువుతారు. ఇంటర్‌లో ప్రథమభాషగా ఆంగ్లం, ద్వితీయభాషగా వారి మాతృభాలను చదివే అవకాశం సాధారణంగా ఉంటుంది. ఇందుకు భిన్నంగా బాల్యం నుండి మాతృభాషలలో చదివిన విద్యార్థులను ఇంటర్‌లో ప్రవేశించగానే ఒక్కసారిగా సంస్కృతం అధ్యయనం చేయించడం అశాస్త్రీయమైన విషయం. విద్యార్థుల భాషా అధ్యయన ప్రాథమిక సూత్రాలకు విరుద్ధమైన ఇలాంటి పద్ధతుల వల్ల సంస్కృతభాష గౌరవాన్ని తగ్గించిన వారే అవుతారు. ఇంటర్ బోర్డు వారు మాతృభాషల స్థానంలో సంస్కృతం, అరబిక్, ఫ్రెంచ్ వంటి భాషలను ప్రత్యామ్నాయంగా ఎంపిక చేసుకొనే అవకాశం ఏ ప్రాతిపదికన ఇస్తారో అర్థం కాదు.

రాష్ట్రంలోని ఉన్నత పాఠశాల స్థాయిలలో ఓరియంటల్, గురుకుల, కేంద్రీయ పాఠశాలలు, అనేక ప్రయివేటు పాఠశాలలలో కాంపోజిట్ కోర్సుగా సంస్కృతానికి ప్రాధాన్యత ఇస్తూ నడుస్తున్నాయి. ఈ పాఠశాలలలో మాతృభాషగా తెలుగును ఒక అంశంగా డెబ్బై మార్కులకు చదువుతారు. సంస్కృతం ముప్పైమార్కులకు చదువుతారు. కాంపోజిట్ సబ్జెక్టు గా కొనసాగే ఈ కోర్సులో ప్రతి సంవత్సరం పదవతరగతిలో దాదాపు తొంభై ఐదువేలమంది చదువుతున్నారు. అంటే ఇరవైఅయిదు శాతం మందికి ఈ పద్ధతిలో సంస్కృతం పరిచయం చేస్తున్నారు. తెలుగు స్థానంలో ఇలా సంస్కృతం ప్రవేశపెట్టడం, సంస్కృతం చదువుకోవడం గౌరవంగా భావింపచేయడం పాఠశాల స్థాయిలో మొదలవుతోంది. ఇలా కాంపోజిట్ కోర్సులో భాగంగా సంస్కృతం ప్రారంభమై, ఇంటర్‌లోకి వచ్చేసరికి తెలుగు పూర్తిగా తొలగించి దాని స్థానంలో సంస్కృతం వంద మార్కులకు ప్రారంభమవుతుంది. ఇంకో విచిత్రమైన విషయమేమంటే కాంపోజిట్ కోర్సుతో సంబంధంలేకుండా, కేవలం తెలుగు మాతృభాషగా చదివిన విద్యార్థులను సైతం ఇంటర్లో సంస్కృతం తీసుకొనేలా కృత్రిమ పరిస్థితులు కల్పిస్తున్నారు.

కేవలం మార్కుల కొసం తెలుగు బదులు సంస్కృతం తీసుకొనేలా రాష్ట్రంలోని కార్పోరేట్ ఇంటర్ కళాశాలలు విద్యార్థులను మభ్యపెట్టడం మాతృభాషా ద్రోహంగా భావించాలి. తెలుగులో అత్తెసరు మార్కులతో ఉత్తీర?త సాధించిన వారు, సంస్కృతం వాసనే లేనివారు ఇంటర్లో సంస్కృతం చదివి వందశాతం మార్కులతో ఉత్తీర్ణులవడం ఆశ్చర్యం కలిగించే విషయం. కార్పొరేట్ ఇంటర్ కళాశాలలలో ఎంత మంది యం.ఎ సంస్కృతం చదువుకొన్నవారు పాఠాలు బోధిస్తున్నారు. అసలు సంస్కృతం పిరియడ్ ఉంటుందా అనేదే అనుమానం. ఏవో కొన్ని ప్రశ్నలు ఇచ్చి వాటిని దేవనాగరి లిపిలో కాకుండా తెలుగు, హిందీ భాషల్లో సమాధానాలు రాయించి, అడిగేవారు లేరని అధిక శాతం మార్కులు ఇవ్వడం సరైన పద్ధతికాదు.

2018 - 19 సంవత్సరం పదవతరగతి 6,30,000

## స్ఫూర్తి

## తెలుగుతనం నిలపమంటాను. అంతే!

- తాపీ ధర్మారావు



ఈ కొత్తపాళీ సూత్రాలతోనే నేను నాటినుంచి నేటివరకు (ఇరవై సంవత్సరాలు) వ్రాస్తూ ఉన్నాను. జనవాణి (దినపత్రిక), కాగడా, జనవాణి (వారపత్రిక) అన్నీ ఈ పద్ధతినే ఆంధ్రుల ఆదరాన్ని అపారంగా సంపాదించాయి. ఈ ఉద్దేశాలతోనే ఎన్నెన్నో వ్యాసాలు వ్రాశాను. రేడియో ప్రసంగాలు చేశాను. 'దేవాలయాల మీద బూతుబొమ్మ లెందుకు?' వంటి పరిశోధన గ్రంథాలు వ్రాశాను. టాల్‌స్టాయి వ్రాసిన అనాకెర్నీనా వంటి నవలను తెలుగున వ్రాయగలిగాను. దాదాపు ముప్పయి సినీ చిత్రాలకు మాటలూ, పాటలూ వ్రాశాను. అన్ని విధాలయిన సన్నివేశాలూ, రసాలు అన్నిటిలోనూ ఆంధ్రప్రజలు, పండితులు, పామరులు గూడ ఎంతో ఆదరాభిమానాలు చూపించారు. ఇంకా చూపిస్తున్నారు. కాబట్టి ఈ వలవని సంస్కృతం మోజు అర్థంలేనిది అనకతప్పదు. నాకు సంస్కృతం మీద ద్వేషమని కొందరయ్యలంటుంటారు. కాదు: నాకు కావాలి సంస్కృతం, కొద్దో గొప్పో ఇప్పటికీ చదువుకుంటుంటాను. అది గొప్ప రత్నాల గని. నిజమే. ఇష్టమున్నవాళ్లు సంస్కృతం చదవవలసిందే, దానిలో ఉన్న విజ్ఞానం తెలుసుకోవలసిందే, ఆ విజ్ఞానాన్ని తెలుగులోనికి తీసుకురావలసిందే, అది కూడదనను. అనవసరంగా ఆ భాషను దిగుమతి చేయకండంటాను. తెలుగుతనం నిలమంటాను. అంతే. *(కొత్తపాళీ పుస్తకం ముందుమాట నుండి)*

మంది పరీక్షలు రాసారు. వీరిలో దాదాపు ఆరు లక్షల మంది తెలుగు ప్రథమ భాష చదివిన వారే ఉంటారు. అదే విద్యా సంవత్సరం ఇంటర్ మొదటి సంవత్సరం 5,10,000 మంది పరీక్షలు రాసారు. అంటే పదవ తరగతి అనంతరం దాదాపు లక్ష మంది విద్యార్థులు ఐటిఐ, పాలిటెక్నిక్, ఇంటర్ వృత్తి విద్య అలా చేరిపోతున్నారు. కొంత మంది చదువు మానుకొని కూడా ఉండవచ్చు. ఇక్కడ పేర్కొన్న లక్షమంది విద్యార్థులు తెలుగు సబ్జెక్టు చదవరు. ఇంటర్ వృత్తివిద్య సిలబస్ లలో కూడా తెలుగుకు స్థానం లేదు. ఇలాంటి కోర్సులలోను తెలుగు ఒక సబ్జెక్టు గా ఉండేలా విద్యాశాఖ చర్యలు తీసుకోవాలి.

ఇంటర్‌లో చేరే దాదాపు ఐదులక్షల మంది విద్యార్థులలో తాము పాఠశాల స్థాయిలో చదువుకొన్న తెలుగును కాకుండ సంస్కృతం చదివే వారి సంఖ్య సగం పైనే ఉంటున్నారు. 2016- 17 సంవత్సరం వివరాల ప్రకారం రాష్ట్రంలో 1830 ప్రయివేటు ఇంటర్ కళాశాలలు ఉండగా, 831 మాత్రమే ప్రభుత్వ ఇంటర్ కళాశాలలు ఉన్నాయి. అంటే రెండింతలు ప్రయివేటు కళాశాలలు ఉన్నాయి. ప్రయివేటు కార్పోరేట్ కళాశాలలలో దాదాపుగా సంస్కృతమే చదివిస్తున్నారు. ప్రతి సంవత్సరం ఇంటర్‌లో దాదాపు మూడు లక్షల మంది మాతృభాషకు దూరం అవుతున్నారు. ప్రభుత్వ ఇంటర్ కళాశాలలలో తెలుగు బోధించే వారు ఉంటారు. తెలుగులో సరైన ప్రతిభ చూపిన వారికే పరీక్షలలో మార్కులు ఇస్తారు. కష్టపడి చదవ వలసి ఉంటుంది. అదే సంస్కృతం తీసుకొన్న కార్పోరేట్ కళాశాల విద్యార్థులకు ఈ పరిమితులు ఉండవు. సంస్కృతం తీసుకొన్న వారందరికీ పరీక్షలలో కూడా అపరిమితంగా మార్పులు వచ్చే అవకాశం ఉంటుంది. ఉన్న అరకొర సంస్కృత అధ్యాపకులు లక్షల పరీక్షల సమాధాన పత్రాలు ఎలా మూల్యాంకనం చేస్తారో అంతు పట్టదు. తెలుగును కృత్రిమంగా లేకుండా చేసే ఈ చర్యలపై రాష్ట్ర ప్రభుత్వం దృష్టి సారించాలి. లక్షల మంది విద్యార్థులు తమకు ఇష్టం లేకున్నా కార్పోరేట్ కళాశాలల వత్తిడకి తలొగ్గి సంస్కృత కూపంలోకి నెట్టివేయబడుతున్నారు. ఇటు తెలుగు అందక, అటు సంస్కృతం రాక విద్యార్థులు మానసిక క్షోభ ఎదుర్కొనే పరిస్థితి కల్పిస్తున్నారు. తెలుగు యం.ఏ చదువుకొన్న వేలమంది నిరుద్యోగులకు ఇంటర్ కార్పోరేట్ కళాశాలలలో తెలుగు బోధించే అవకాశం లేని పరిస్థితి కల్పిస్తున్నారు.

పాఠశాల విద్యలో తెలుగు ప్రథమ భాషగా చదువుకొన్న విద్యార్థులకు ఇంటర్ విద్యలో తెలుగును తప్పనిసరి చేయాలి. పాఠశాల స్థాయిలో పూర్తిగా సంస్కృతం చదువుకొన్న వారికే ఇంటర్‌లో సంస్కృతం చదివే అవకాశం ఉండాలి. పాఠశాల స్థాయిలో కాంపోజిట్ కోర్సు పేరుతో తెలుగును తక్కువ చేయడం మానుకోవాలి. మార్కుల కోసం కాకుండా నిజంగా సంస్కృతం విద్యార్థులకు నేర్పించాలనే ఆసక్తి ఉంటే, దానికి ప్రత్యామ్నాయ మార్గాలు చూసుకోవాలి కానీ మాతృభాషగా ఉండే తెలుగును బలిచేయడం భావ్యం కాదు. ♦



- ఎండపల్లి భారతి
9652802460

# రుసిగాడు

**మూ**డు దినాల నుంచి జొరం కాసి ఆస్పత్రికి బొయ్యి వాళ్ళిచ్చిన మాత్రలు మింగి మింగి నోరు పిడసరాయి అయిపొయింది . నోరు ఏమి తిన్నా రుతువు తెల్యా. బింకం తెచ్చుకోని నీల్లగుట్లోకి బొయ్యి నల్లేరు నేత కొల్లంతా ఇడిపిచ్చుకొని ఇంటికి దెచ్చి ఈనెలు దీసేసి నూనెలో ఏంచి పక్కన బెట్టుకున్నా. అట్లే చిన్నెర్రగడ్డలు తెల్లగడ్డ ఒట్టిమిరపకాయ నాలుగు జిలకరపాసులు అంత చింతపండు కూడా నూనెలో ఏంచుకొని ఊరిబిండి నూరి దాంట్లోకి సంగటైతే బాగుంటుందని ఉడుకుడుకు సంగటి గెలిక్కొని ఒక ముద్ద గిన్నెలోకి ఏసుకొని ఊరుబిండి ఒక గెంటేసుకొని తిందామని గిన్నెముందర కూసుంటి. ఆ యాలకి ఎంకటపెద్దమ్మ వచ్చే. ఆయమ్మ వాకిట్లోనే నిలబడి ఏంచేస్తావుండావు నాయనా జరమొచ్చిందంటనే పలకరిద్దామని వస్తి అనే.

నేనుండుకోని "సుమారుగా ఉంది పెద్దమ్మా నోరు రుతువు తప్పోయింటే నల్లేరు ఊరుబిండి నూరుకోని తిందామని గిన్నె ముందరబెట్టుకున్న. రా ఇంట్లోకి నువ్వూ పట్టెడు సంగటి తిందువు" అంటి. ఏడ వద్దులే నాయనా అంటా ఇంటిముందర అరుగు మింద కుసుండే. నాకు ఆయాలకే అర్థమయ్యే. ఆ యమ్మ కోడాలు ఆ యమ్మకు కడినీళ్ళు సరిగ్గా పొయదు. ఆ యమ్మను చీడపురుగు చూసినట్టు చూస్తుంది. ఆయమ్మ అనలేక అనుభవిచ్చలేక ఆకలైనపుడు ఏ తల్లి పెడుతుందా అని కాసుకోనుంటుంది. ఈ పొద్దు నా వంతు అనుకొని ముద్దసంగటి, గెంటి ఊరుబిండి గిన్నెలో ఏసుకొని చెంబునీళ్ళు ముంచి ఎత్తక పొయ్యి ఆ యమ్మ ముందర బెడితి. అది చూసి అయ్యో నాయనా ఏలరా నాకు బెట్టింది అని నగతా చెయ్యి గిన్నెలో బెట్టె. అంతకు ముందు నల్లగా బీదగా ఉన్న ముకం సంగటి ముద్ద చూస్తానే బొలిసికాయే గతం పసుపుగా ఎలిగిపాయె! అదరా బదరా సంగటి పిడస చేత్తో ఎత్తుకొని ఊరుబిండిలో అద్దుకొని నోట్లో బెట్టుకొని లట్లు ఏస్తా బలేఉంది నాయనా ఊరుబిండి, నువ్వూ తినుపో నేనూ తింటా అనే. నేనూ గిన్నె ఎత్తుకొచ్చికోని ఆ యమ్మ పక్కన పెట్టుకోని ఇద్దరం తింటూ ఉన్నాం. నా జ్వరం నోటికి ఆ నల్లేరు ఊరుబిండి న్యాలిక్కి అంటతా ఉంటే చేదుగా ఉండే నోరు రుతువాస్తా ఉంది.చెరొక ముద్ద మింగేస్తిమి. చెయ్యి కడిగి మా పెద్దమ్మ తినేసిన చెంబుగిన్నె పారబోసి మల్లీ వచ్చి

మా పెద్దమ్మ ముందర కూసుంటి. ఆయమ్మ అప్పటికే చెంబు నీళ్లు తాగేసి, నాయనా ఈ పొద్దంతా నాకు సంగటే వద్దు కడుపు నిండిపోయింది అనే.

మేమిద్దరం మాట్లాడుతా ఉన్నట్టే మా ఆడబిడ్డ నీలా వచ్చే!వదినా ఏమిచేస్తున్నావు వెంకటవ్వ కూడా ఈడే ఉందే అంటా "ఏం వెంకటవ్వా కోడాలు టెంకాయల పండక్కి(వినాయకచవితి) ఏమి చేసింది" అని అడిగే . "ఏమో నాయనా నన్ను ఆడికి ఎక్కనిస్తారా వాళ్లకు బుద్ధి పుట్టి చేసింది నా ఆకులో అంతేస్తే తింటా. ఇంక వంటా వార్పూ అంటారా నా కంటికి కనపడదు నోరు ఇడిసి అడిగితే నీ కరగదు గదా ఏల దింటావు ఎవరు నీతో పడేవాల్లు అంటారు. వాల్ల దగ్గర ఆ మాటలు అనిపిచుకోలేక ఉడికిన సంగటి ఉడికిన సారు అంతేస్తే తింటా లేదంటే గమ్మునుంటా" అని బాధపడే మా పెద్దమ్మ.

"నీ కొడుకు ఏమీ అనడా" అడిగే నీలా .

"వాడేమంటాడు పెండ్లాము ఎట్ల చెబితే అట్లింటాడు. దానికీ ఒక కొడుకుండాడులే. దానికీ కోడాలు వస్తుంది. నన్నెట్ల చూస్తావుందో దాని కోడాలూ దాన్నీ అట్లే చూస్తుందిలే" అనే మా పెద్దమ్మ

అంతలో నీలా ఉండుకొని "అయినా నీ కోడాలు అంత పాసింది ఈ ఊరుపైన లేదవ్వా, నీ కోడలట్లా దోడుమైన దాని గురించి మా అవ్వ ఒక కథ చెప్తా ఉండే! ఇను !

కొడుకు పసోడుగా ఉన్నపుడే మొగుడు చనిపోతే ఒక అమ్మ ఒంటిగానే కొడుకును కష్టపడి సాకి పెండ్లిచేసింది. కోడాలు వచ్చినంక అత్తనే ఆ యమ్మ సంసారమంతా కోడలికి అప్పగించి బయటపని చేసుకునేది. కొడుకు సేద్యానికి పోతా ఉన్నాడంట. ఈ అత్తనే ఆమె పని అంతా చేసుకొని సంగటేలకొచ్చి కుసునేదంట తినేదానికి. అప్పుడు బాగా గింజలు పండేకాలం. దినామూ అనప గింజలు, అలసందు గింజెలు ఏసి కూరచేసేది కోడాలు. చేసిన కూర అన్నం, గిన్నె నిండా పెట్టి అత్త ముందర బెట్టేది. ఆ యత్త తినబోయేముందు "ఏల నాయనా నాకు గింజల కూర ఏసినావు నా రుసిగాడు పొయ్యిందే నా రుసిబోయే" అని దిగిన కాడికి తిని గింజలన్నీ కడిగేసేదంట. ఇట్లా కోడాలు అన్నం బెట్టినపుడల్లా అదే మాటనేది అత్త . ఆ కోడాలు ఇన్నన్ని దినాలు ఇని మొగునికి చెప్పింది. కాదే మీ అమ్మకు నేను అన్నం పెట్టినప్పుడల్లా నా రుసిగాడు బొయ్యిందే నా రుసిబొయ్యే అంటుంది. ఈ వయసులో మీ అమ్మ ఎవరినో మరిగింది. ఊర్లో పదిమందికి తెలిస్తే మానం బోతుంది మీ అమ్మను అడివిలోకల్లా పిల్సుకొనిపొయ్యి చంపేసి వచ్చేయి అని మొగునికి నూరిపోసింది.

వాడు పెండ్లాము జెప్పింది నిజమేమోనని వాళ్ళమ్మను బిల్సి అమ్మా రేపు మసికిలితోనే అడివికి కట్టెకు బోవల్ల అనిజెప్పి ఆ మర్సునాడు మబ్బుతోనే లేసి పయనమయ్యే యేలకి భార్య సద్ది కట్టించింది. సద్దిమూటెత్తుకొని అమ్మ బిడ్డ ఇద్దరూ అడివికి బయలు దేరినారు. మనూరు ఒడ్సికొండట్ల కొండకు పొతాఉ ఆండారంట. వాళ్ళమ్మకు కాళ్ళు నొప్పులెత్తుకున్నాయి. నడసలేక ఒక తావున బండమింద కూసుంది "నాయనా అడవొచ్చేసింది కదా ఇంకెంతదూరం నాయనా మనం బొయ్యేది అని అడిగింది. ఇంకో పర్లాంగు దూరమమ్మా అన్నాడు కొడుకు. పెండ్లాము కట్టించిన సద్దిమూట తిందామని పక్కనే బండమీద పెట్టి ఆ పక్కనే దొనల్లో నీళ్లుంటే అమ్మా బిడ్డా పొయ్యి కాళ్ళు చెయ్యి మొకం కడుక్కొచ్చి, పక్కన తీల్లాకులు బెరుక్కొచ్చి ఎదురుబొదురు కూసోని బండమీద పరుసుకోని సద్దిమూట ఇప్పినారు. సద్ది మూటలో పెండ్లాము పచ్చిశనగగింజల కూర జెసి పెట్టుండాది. కొడుకు తనకు పెట్టుకొని అమ్మకు ఆ శనగగింజల కూర ఎయ్యబోతే ఆ యమ్మ ఉండుకోని నాయనా నా రుసిగాడు బొయ్యిందే నా రుసి బోయే నాకేల నాయనా ఈ గింజెల కూర అనే. అప్పుడు కొడుక్కి అనుమానమొచ్చి కాదమ్మా రుసిగాడు బోయే రుసిగాడు బోయే అంటావు రుసిగాడంటే ఎవరమ్మాఅని అడిగే. అయ్యో నాయనా రుసిగాడంటే నా పండ్లు. పండ్లుఉంటేనే కదా ఇట్లా గింజలు నమిలినపుడు రుసి తెలిసేది, పండ్లూడి పొయ్యి నాకు రుసి తెలియడం లేదు అనే.

అబుడు ఆ కొడుకుండుకొని అరరే ఎంత పొరపాటు అయిపోతా ఉండే. ఊరికే మాయమ్మను సంపుకుంటావుంటినే అని వాల్లమ్మను తొడుక్కొని ఇంటికొచ్చేసినాడంట.

అట్లా నీకోడలు కూడా దానికి జోడుమైనది అనే నీల .. ఆ యాలకి ఆ ముసలిదానికి కడుపులో సంగటి పడేకుందికి కంటినిండా నిద్రొచ్చిందేమో ఆ అరుగు మిందనే వొరగ పండుకొని నిద్రబోయే.

నేనూ నీలా మా పన్లు చేసుకోను మేము ఎలిపోతిమి .

◆

# ముగింపు ఎక్కడ?

- తిరునగరి శరత్ చంద్ర
6309873682



పొంగుతున్న అలలకు ముగింపు ఎక్కడ?
నడిచే కాలానికి ముగింపు ఎక్కడ?

తేజోమయ కిరణాలను వెదజల్లే రవి ఉన్నా
చీకటి రాజ్యాలకింక ముగింపు ఎక్కడ?

మేడమీద మేడకట్టి విలాసంగ బ్రతుకుతున్నా
మనసులోని కోరికలకు ముగింపు ఎక్కడ?

విముక్తికై పోరాడి విజయం సాధించినా
బానిస బ్రతుకులకింకా ముగింపు ఎక్కడ?

శ్రామికుల జీవితాల్ని పీల్చి పిప్పి చేసినా
దొరస్వాముల దోపిడికి ముగింపు ఎక్కడ?

భారతదేశపు దుస్థితి మారేదెన్నడు 'శరత్'?
నిరుపేదల కన్నీళ్లకు ముగింపు ఎక్కడ?

◆

---

# అణుబాంబులు

- చౌశా
9490445484



అడవికి వెళ్లటం నేరం
అడవి జంతువులను వేటాడ్డం నేరం
అడవిలో కట్టెలు కొట్టడం నేరం
అడవిలో రహదారులు వేయటం నేరం
అంతెందుకు అడవి వైపు చూడ్డమే నేరం!
ఏటా వన మహోత్సవాల నిర్వహణ!
అడవికి వారసులమని ప్రగల్భాలు!
అడవి  బిడ్డలమని కోతలు!
విదేశాల్లోనూ దేశాధినేత
అడవులు ప్రకృతిపై ప్రసంగాలు!
మీ చట్టాలు ఎవరికి చుట్టాలు?
ఓ వైపు సామాన్యుడిపై
అడవి బిడ్డలపై నానా కేసులు పెట్టి
జైళ్లలో పెట్టించి చిత్ర హింసలు!
మరోవైపు అడవిని నాశనం చేయటానికి
అడవిని బుగ్గిపాలు చేయటానికి ప్రయత్నాలు!
యురేనియం తవ్వకాల పేరుతో
మనుషులు జంతువులు
వృక్షాలు నదులు సెలయేళ్లను
నాశనం చేసేందుకు
ఏ చట్టాలు ఒప్పుకున్నాయ్?
ఇంతకీ తవ్వకాల వెనుక
మీ ఉద్దేశం ఏమిటి?
అణు విద్యుత్తా? లేక అణ్వాయుధాల
తయారీనా?
సాధారణ ప్రజల కోసమా? లేక
సామ్రాజ్యవాదుల కోసమా?
మీరు యురేనియం తవ్వకముందే
మాలో చైతన్యం మేల్కొంది
మీరు బాంబులు తయారు చేయకముందే
మేం అణుబాంబులవుతాం
అల్లూరి స్ఫూర్తితో అడవి బిడ్డల అండతో
నల్లమలను కాపాడుకుంటాం
ప్రకృతిని రక్షించుకుంటాం

◆

నచ్చిన రచన

# లోచూపు నుండి చీల్చుకొచ్చిన కవిత్వం





శాంతయోగి యోగానంద

- పరవస్తు విష్వక్సేన
8328384951

నూతన అభివ్యక్తులతో, కవితా నిర్మాణ పద్ధతులతో భాషను మాధ్యమంగా చేసుకుని ఒక వస్తువును శిల్పంగా మలిస్తే అది మంచి స్థాయి కవిత్వం అవుతుందా అన్న ప్రశ్న తలెత్తినపుడు, విస్తృతమైన కోణాలుండే ఒక వస్తువును, నువ్వు ఏ కోణం నుండి దర్శించావు, ఆ కోణాలలో దాగున్న నిగూఢత ఎంత, విభిన్నత ఎంత అన్న మరి కొన్ని ప్రశ్నలు తలెత్తుతాయి. కేవలం శిల్పం మాత్రమే ఒక వస్తువును ఉన్నతంగా మలచగలుగుతుందా అన్న సంశయం కలిగినపుడు, కొత్తదనం నింపుకోని వస్తు నిర్మాణ వ్యూహంలో ప్రత్యేకత ఏముంది అన్నది సమాధానంగా నిలుస్తుంది. శిల్ప నిర్మాణంలో కవి యొక్క ఊహా శక్తి, సృజనాత్మకత, భాషపై పట్టు ముఖ్య అంశాలుగా ఊపిరి తీస్తే, వస్తువును దర్శించడంలో కవికున్న లోచూపు, ఆ వస్తువుపై కవికున్న పరిశీలనా శక్తి మీద, ఆ వస్తువును ఎలాంటి నూతన కోణాల నుండి శిల్పీకరించగలరు అన్న విషయం ప్రసటమవుతుంది. కవిత్వానికి శిల్పం ఎంత ప్రాధాన్య పూర్వకమైన అంశమో, విభిన్న వస్తు కోణ దర్శనానికీ అంతే ప్రాధాన్యం ఉంటుంది.

మూస పోయిన కోణాల నుండి వస్తువును శిల్పీకరిస్తున్న కవిత్వం ఒక వైపు, శిల్పమే లేని కవితా వస్తువులు మరో వైపు హెచ్చుగా ప్రవహిస్తున్న ప్రస్తుత కవితా ఉధృతిలో, విభిన్నంగా విలక్షణంగా వస్తువును లోచూపుతో దర్శించి, ఆ వస్తువుకు చక్కని అభివ్యక్తితో శిల్పాన్ని తొడిగి, సరళమైన భాష, సమతూకంతో సాగిన పద అర్థ శబ్ద బంధాలతో తాత్వికతను మార్మికతను అద్దుకుని, వినూత్న జవసత్వాలను నింపుకున్న కవితా సంపుటి కవి 'శాంతయోగి యోగానంద' రచించిన 'వెలుతురు చెట్టు'.

వెలుతురు చెట్టు సంపుటిలోని కవిత్వంలోనే కాదు, కవితా శీర్షికల్లోనూ ఆ నూతనత్వం పాఠకుడిని పలకరిస్తుంది. శీర్షిక నుండే కవితా వస్తువుకు చెందిన ఆలోచనల్లోకి, సందిగ్ధావస్థల్లోకి, పరిశీలనాతత్వంలోకి, ఉత్సుకతలోకి పాఠకుడు అడుగులు వేస్తాడు. 'వెలుతురు చెట్టు, ముసలి దుప్పట్లు' వంటి కవితా శీర్షికల్లో చిక్కని మెటాఫర్ లు ప్రాణం పోసుకుని శ్వాసిస్తే, 'రాత్రి అడవిలో, సముద్ర నిద్ర, తగలబడ్డ వాక్యం' వంటి శీర్షికల్లో, కవి ఏ వస్తువును కవిత్వంగా మలచబోతున్నాడు అన్న ఉద్రిక్తత సందిగ్ధత పాఠకుడిని సంఘర్షణల్లోకి విసిరేస్తుంది. కవి తొలి విజయం కవితా శీర్షికల్లోనే పాఠకుడి నాడిని పట్టుకుని కవితలోకి వారి మనసును అంతర్లీనం కావించడం.

సందర్భానుసారంగా వాక్య నిర్మాణాలలో ప్రయోగించిన చిక్కని మెటాఫర్, సిమిలి, అల్లిగోరి వంటి కవితా నిర్మాణ ప్రక్రియలు నూతన అభివ్యక్తీకరణలతో సంభాషిస్తూ ఇక్కడ మనసును కదిలిస్తాయి. 'నచ్చేలా ఓ కవిత', 'ముసలి దుప్పట్లు' కవితలు పూర్తి స్థాయి మెటాఫర్ లు. అరుదుగా కనపడే ఇలాంటి ప్రయోగాలు కవిత్వ స్థాయిని పెంచి, పాఠకుడికి

కవిత్వాన్ని చదవాలనే జిజ్ఞాసను ప్రేరేపించగలవు. కవిత్వ శ్వాసను, ఉనికిని కొత్త తీరాలకు చేర్చగలవు. ఇలాంటి కవనాల్లో శిల్పం కన్నా ఒక మెట్టు పైన విలక్షణ దృక్కోణం నుండి సాగే వస్తు నిర్మాణం నిలుస్తుంది. ఆ వస్తువును కవి దర్శించిన కోణమే ఇతర కవితల నుండి ఆయా కవితలను విలక్షణంగా నిలబెడుతుంది.

'అభివృద్ధి సూచీ పై పైకి వెళుతోందని చెప్పడమే కాదు, అందులోంచి జారిపోయిన వారెవరో కూడా తెలియాలి'. ఆ జారిపోయిన వారే ఈ కవి కవితా వస్తువులు. 'ఇప్పటికీ కూడు గూడు అని పద్యాలు రాయాల్సొస్తోంది' అంటూ తన కవిత్వ వేదన ఎవరి కోసమో చెప్తూ, ఈ కవిత్వం యొక్క ఊపిరిని సింబలైజ్ చేసిన కవితా పంక్తులివి. పేదరికంలో నలిగిపోతున్న బాల్యాన్ని, కార్పొరేట్ మార్టులు దొంగలిస్తున్న ఖాళీ గోనె సంచి నవ్వుల్ని, మనుషుల్ని విభజిస్తున్న రేఖలను, మనసులను విరగ్గొడుతున్న గీతలను, నల్లపూసలు పోగొట్టుకున్న విధి వంచిత నిస్సహాయ స్థితులకు అక్షర రూపమిస్తూ, సమాజాన్ని ప్రశ్నిస్తూ, పరిణామక్రమిస్తున్న నాగరికతను ఎండగడుతూ వెలుతురు చెట్లు సంపుటిలోని కవితలు ప్రాణం వాసనను వెదజల్లుతున్నాయి.

మిక్కిలి కవితల్లో ప్రారంభ ఎత్తుగడ ప్రశ్నార్థకంగానో, సందేహంగానో ఉండి కవి చెప్పదలుచుకున్న వస్తువు యొక్క ఉద్దేశాన్ని కప్పి చెప్పేలా సాగుతుంది. పాఠకుడి నాడిని పట్టుకోగలిగే ఓ నిర్మాణ వ్యూహం ఇది. 'మనసాక్షి' 'అది నగరం'

వంటి కవితలు పూర్తిగా కప్పి చెప్తూ, ఆ కవనం సంధించిన ప్రశ్నలు ఏ వస్తువుకు చెందినవి, ఆ వస్తువుల్లో దాగున్న మూలాలేంటి అన్న విషయాన్ని పాఠకుడి ఆలోచనా శక్తికి వదిలివేయబడ్డాయి. ఈ కవిత్వ సారాన్ని మూలాన్ని విప్పి చూడాలంటే పాఠకుడు ఆ కవితా పాదాలతో సంఘర్షణకు గురి కావల్సి వస్తుంది. అలా పాఠకుడిని సంఘర్షణల్లోకి నెట్టి వేయబడ్డ కవిత తన ఉనికిని స్థిర పరుచుకుంటుంది. మిఠాయి పొట్లం అంటూ నోస్టాల్జియా ను పలికించినా, నెమరు పిట్టయి అంటూ ప్రణయ సంవేదనల్లోకి మనసును పరుగులు పెట్టించిన వస్తువులు సైతం ఇక్కడ భిన్న శైలిని కలిగి ఉన్నాయి. దాదాపు కవితలన్నీ చక్కని నరేషన్ తో సాగి, జీవితం నింపిన అనుభవ సారాలను తాత్విక మార్మిక ధోరణిలో పొయెటిక్ ఫీల్‌ను వాస్తవికంగా స్పృశించాయి.

'ఆ విషయంలో నీవూ నేను ఒకటే, ఏది తెలియాలో అది మనకు తెలుసు' అంటూ ఆదిలోనే ఉత్సుకతను ప్రేరేపించేలా ప్రారంభమైన కవిత 'నచ్చేలా ఓ పాత్ర'. ఒక పక్షి జీవన విధానాన్ని, జీవిత పోరాటాన్ని మనిషి జీవితానికి ప్రతీకగా తీసుకుని అరుదైన అభివ్యక్తి నవ్యతను, పరిపక్వతను, దార్శనికతను ఆవిష్కరించారు కవి. ఈ కవిత ఆసాంతం ఒక మెటాఫర్. ఆ మెటాఫర్ లోని ఆత్మ 'నీవూ నేను ఒక్కటే' అన్న వాక్యంలో ఉంది.

గాఢమైన అర్థతతో కూడిన వస్తువుకు, పరిపక్వతను నింపుకున్న శిల్పం తోడైతే అది ముసలి దుప్పట్లు కవిత. పల్లెల్లో పిల్లలు ఎగిరిపోయి, అనాథలై రోదిస్తున్న అభాగ్యులైన బీద ముసలి మనుషుల కన్నీటి వెతలకు, ముదుతల శిల్పాన్ని వెచ్చగా చెక్కిన కవిత. ఈ కవితలో కవి ఎక్కడా ముసలి మనుషులు అనే పద ప్రయోగం లేకుండా, ముసలి మనిషిని దుప్పటిగా సింబలైజ్ చేస్తూ సాగిన కవనం హృద్యం. 'కుమిలి కుమిలి కన్నీళ్ళొత్తుకుంటున్న దుప్పటికి, ఒక చోట తడారుతుంటే, మరో చోట తడౌతుంది' 'కన్నీటితో దుప్పటి ఉప్పు తేలింది' అన్న లోతైన గాఢత కలిగిన వాక్యాల్లో కవి యొక్క ఊహాత్మక దృష్టి, సృజనాత్మకత ప్రస్ఫుటమవుతే, వస్తువును దుప్పటిగా సింబలైజ్ చేయడంలో లోచూపు కనిపిస్తుంది. ఎవరైనా మాట వరకు పిలిస్తే చాలు, దుప్పటి ప్రాణం రెపరెపలాడుతోంది' అన్న వాక్యాలు ఆ ముసలి ప్రాణాలను కళ్ళ ముందు దృశ్య మానం చేసి ఇమేజరీని కళ్ల ముందు నిలిపి మనసును చలింపజేయగలవు. ఇలాంటి నూత్న నవ్యత, హృద్యత కలిగిన వాక్యాలెన్నో వెలుతురు చెట్లు కవితా సంపుటిలో పలుకరించి హృదయాన్ని కదిలిస్తాయి. ప్రపంచ దుఖం, తెలుపు సందేశం, వారి బాల్యం వారికిచ్చేయాలి, తగలబడ్డ వాక్యం, ఒక నది అంతరంగం వంటి 'కవితలూ వినూత్న ధోరణిలో కవిత్వీకరించబడ్డాయి.

తన తొలి కవితా సంపుటిలోనే వస్తువుకున్న భిన్న ధృవాలను తనదైన ప్రాపంచిక దృష్టితో స్పృశిస్తూ, పలు నిర్మాణ పద్ధతులను కవితలుగా మార్చడం ప్రస్తుతం వెలువడుతున్న సాహిత్య సంపుటాలలో అరుదైన విషయం. చక్కని ప్రయోగాత్మక కవితలకు ప్రాణం పోసిన కవి శాంతయోగి యోగానంద గారికి అభినందనలతో 'వెలుతురు చెట్లు' కవితా సంపుటికి స్వాగతం. ఈ చెట్లు సంపుటిలోని కవనాలకి ప్రతీకలు అయితే, ఆ వెలుతురు కవితల నుండి ఉద్భవించిన దార్శనికత. ◆

## నివేదిక

# భిన్న కోణాలు..వైవిధ్య ప్రసంగాలు..



**కర్నూలులో సామాజిక తత్వవేత్త**
**పోతులూరి వీరబ్రహ్మం**
**రాష్ట్రస్థాయి సాహిత్య సాంస్కృతిక సమ్మేళనం**

**- కెంగార మోహన్**
**9493375447**

ఎన్నో ప్రశ్నలకు..మరెన్నో సవాళ్ళకు..అనేకానేక సందేహాలకు సమగ్ర సందేశమిస్తూ సాగిన ప్రసంగాలు..చరిత్రపుటల్లో అసలు సిసలైన పోతులూరి వీరబ్రహ్మంను ఆవిష్కరించిన సందర్భం. కర్నూలు నగరంలోని లలిత కళాసమితి వేదికగా సామాజిక తత్వవేత్త పోతులూరి వీరబ్రహ్మం రాష్ట్ర స్థాయి సాహిత్య సాంస్కృతిక సమ్మేళనం ఆక్టోబర్ 12న ఘనంగా జరిగింది. తెలుగు రాష్ట్రాల నుంచే కాక కర్నాటక, తమిళనాడు నుండి దాదాపు వెయ్యిమంది హాజరై అసలు పోతులూరి వీరబ్రహ్మంను ఇది వరకు చూసిన కోణం..ఇప్పటి నుండి చూడాల్సిన దృక్పథాన్ని తెలుసుకున్నారనడంలో సందేహం లేదు. వీరబ్రహ్మం 400 ఏళ్ళ క్రితమే వృత్తులపై దాడి జరగడాన్ని తీవ్రంగా పరిగణించిన గొప్ప సంఘసంస్కర్తగా ఆధునిక వర్తమాన సమాజానికి పరిచయం చేయడం అరుదైన సందర్భం. ఇప్పటివరకు పోతులూరి వీరబ్రహ్మం గారు ఒక దేవుడుగా సమాజానికి తెలుసు. పోతులూరి వీరబ్రహ్మం సాహిత్యాన్ని అధ్యయనం చేసిన వారందరినీ, పరిశోధించిన కవులను, రచయితలను ఒక్కతాటిపై తీసుకొచ్చి సామాజిక చరిత్రలో నూతన అధ్యాయాన్ని ఆవిష్కరించిన ఘనత సాహితీ స్రవంతితో పాటు, ప్రజాశక్తి బుక్‌హౌస్, ఇతర ప్రగతిశీల భావజాలమున్న సంస్థలకు దక్కుతుంది. ఆనాటి సమాజంలోని అంతరాలను, కులాలను ప్రశ్నిస్తూ సమగ్ర మానవవికాసానికి పునాదులు వేసిన పోతులూరిని సామాజిక తత్వవేత్తగా, సాంఘిక విప్లవకారుడిగా ఆధారలతో సభ నిరూపించగలిగింది. బహుశా సాహిత్య చరిత్రలో అరుదైన సందర్భం. దేశంలో కుల, మత, ప్రాంతాల విద్వేషాలతో అసహనాలు పెరిగిపోతున్నాయని, పోతులూరి కులరహిత సమాజాన్ని ఆనాడే కలగంటే అదే కులాల కంపులో కొట్టుమిట్టాడుతున్న జనాల్ని ఈ సభ జాగృతంచేసే ప్రయత్నం చేసింది. వీరబ్రహ్మం చేసిన బోధనలే ఆదర్శం కావాలని, వీరబ్రహ్మం ఆశించిన సమసమాజం ముమ్మాటికీ సమసమాజమేనని ముక్తకంఠంతో చెప్పగలిగారు

**ఈ శతాబ్ధపు వేగుచుక్క పోతులూరి..**

సంపద సృష్టించే కష్టజీవులు, శ్రమజీవులకు అండగా నిలచిన పోతులూరి ఈ శతాబ్ధపు వేగుచుక్క కాక మరేమవుతాడు. ప్రజలు పోతులూరికి గుడికట్టి అక్కున చేర్చుకుంటే పాలకులు మాత్రం వారి ఆశయాలను ఈ తరానికి అందించడంలో పూర్తిగా వైఫల్యం చెందుతున్నారన్న సత్యం ఈ సభ నిరూపించగలిగింది. యూరప్‌లో 15, 16వ శతాబ్దంలో ఆవిరి యంత్రం కనుగొని స్పీడ్‌గా ముందుకు పోతే, మనదేశంలో ధనిక, కులమత అంతరాలను సృష్టించి సమాజాన్ని చీకట్లో ఉంచడం విడ్డూరం కాదా..? మనం మనుషులం..మానవ ప్రగతి అంతారాలు లేనపుడే సాధ్యమన్న సూక్ష్మమైన విషయాన్ని అర్థంచేసుకోలేని చైతన్యరహితంగా ఉన్నాము. ఈ అంతరాలను.. అసమానతలను పోతులూరిని

స్ఫూర్తిగా ఎవరు ప్రశ్నించాలి. వీరబ్రహ్మం, వేమనలు అసమానతలను రూపుమాపేందుకు కృషి చేస్తే ఛాందసవాదం, దురాచారాలు, అంటరానితనం ఈ సమాజాన్ని తిరోగమనదిశలో తీసుకెళ్తాయని వాళ్ళు భావిస్తే మనం ఇంకా కులాల కుంపట్లలోనే మగ్గుతున్నాం.. దూదేకుల సిద్దయ్యను, దళితుడైన కక్కయ్యను శిష్యులుగా ఎంచుకుని మతసామరస్యానికి కృషిచేసిన మహోన్నతుడు పోతులూరి. భారతదేశంలో సంఘసంస్కరణ ఉద్యమాన్ని ప్రజల్లో తీసుకెళ్ళిన జ్యోతిరావ్‌పూలేను, సావిత్రిబాయిపూలేను, అంబేద్కర్‌ను ఎవరికి వాళ్ళు తమ ఆరాధ్యదైవంగా చేసుకోవడంలో విజయం సాధించి సమ సమాజాన్ని స్థాపించడంలో విఫలమయ్యారు. అందుకే ఈ దేశంలో అక్షరాస్యులున్నారు కాని..చైతన్యవంతులు లేరని నమ్మాల్సి వస్తుంది. ఇంకా చెప్పాలంటే ప్రజాకవి వేమనకు కూడా ఒక కులాన్ని అంటగట్టి ఆయన పేరుతో సంస్థలు స్థాపించి ఆయనను ఈ వర్తమాన సమాజనానికి దూరం చేయడంలో కుట్రలు లేవంటారా..? ఈ సమాజంపై సంఘసంస్కర్తగా తనదైన ముద్రవేసి సమాజదిశను మార్చిన పోతులూరి తొలితరం సంఘసంస్కర్త అని పరిశోధకులు, రచయితలు గొంతెత్తి అరుస్తుంటే మా స్వామిని శూద్రుడంటారా..? అని వాస్తవాలు తెలుసుకోక, అసలు సత్యాన్ని విస్మరించి అందరివాడైన పోతులూరిని అందరికీ దూరం చేయడంలో అంతర్లీనంగానూ, బహిర్గతంగా చేసిన పన్నాగం కాక మరేమౌతుంది. వర్ణవ్యవస్థ వేళ్ళూనికుని పోయిన కాలంలో కలాన్ని కత్తిగా ఝుళిపించి నవసమాజ ఆవిర్భావం కోసం పరితపించిన మానవతావాదిగా చరిత్రలో స్థానం సంపాదించుకున్నాడన్న సత్యం కర్నూలు సభ చెప్పగలిగింది. తన రచనల ద్వారా సమాజాన్ని చైతన్య పరచి అసమానతలు అంతరాలు లేని సమసమాజాన్ని స్థాపించడం కోసం అహర్నిశలు కృషిచేశాడన్న వాస్తవాన్ని అశేషంగా హాజరైన ప్రజల ముందు ఈ సమ్మేళనం సాక్షిగా వక్తలు చెప్పగలిగారు. పోతులూరి ఆశించిన సమాజం కోసం మేము కలసిపోరాడతామని సభలో కొంతమంది సభలో ప్రకటించేలా సభ చేయగలిగింది.

ప్రారంభ సమావేశానికి అధ్యక్షత వహించిన ప్రముఖ రాజకీయ విశ్లేషకులు తెలకపల్లి రవి మాట్లాడుతూ వృత్తులపై దాడి జరగడాన్ని వీరబ్రహ్మం 400 ఏళ్ల క్రితమే తీవ్రంగా పరిగణించారన్నారు. దేశంలో కులమత, ప్రాంతాల విద్వేషాలతో అసహనాలు పెరిగిపోతున్నాయని ఆందోళన వ్యక్తం చేశారు. మూకదాడులను ప్రశ్నిస్తూ ప్రధానికి లేఖ రాసిన మేధావులపై రాజులే లేని నేటి కాలంలో రాజద్రోహం కేసులు పెట్టడం చూస్తున్నామన్నారు. ఉగ్రవాదానికి, మతోన్మాదానికి వ్యతిరేకంగా సినిమాలు తీసిన మణిరత్నంలాంటి వారిపై రాజద్రోహం కేసులు పెట్టారని తెలిపారు. కులమత విద్వేషాలతో పాలకులు పన్నే కుట్రలపై అప్రమత్తంగా ఉండాలన్నారు. ఇందుకు వీరబ్రహ్మం చేసిన బోధనలే ఆదర్శం కావాలన్నారు. అనంతరం కర్నూలు ఎంపీ డాక్టర్ సంజీవ కుమార్ మాట్లాడుతూ మనిషిలో రోగాన్ని నయం చేసే వారు వైద్యులయితే, సమాజంలోని రోగాలు, రుగ్మతలను రూపుమాపేది రచయితలేనని పేర్కొన్నారు. వీరబ్రహ్మం లౌకిక తత్వం, సమానత్వాలను ప్రజల్లోకి తీసుకొచ్చిన గొప్ప సోషల్ ఇంజినీరు అని అన్నారు. ప్రజాశక్తి దినపత్రిక సంపాదకులు ఎంవిఎస్.శర్మ మాట్లాడుతూ కులమత విద్వేషాలు లేని సంస్కరణల కోసం వీరబ్రహ్మం ఎంతో కృషి చేశారని తెలిపారు. సంపద సృష్టించే కష్టజీవులకు, శ్రమజీవులకు అండగా నిలిచారన్నారు. ప్రముఖ రచయిత, మాజీ వైస్ ఛాన్సరల్ కొలకలూరి ఇనాక్ మాట్లాడుతూ రుషిగా, కవిగా, సంఘసంస్కర్తగా పోతులూరి తనదైన ముద్రవేశారని పేర్కొన్నారు. ఆచార్యులు పులికొండ సుబ్బాచారి, యండపల్లి పాండురంగాచార్యులు, మూల మల్లికార్జున రెడ్డి, రాష్ట్ర హార్టికల్చర్ జెడిఎ హనుమంతరావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు ఫౌండేషన్ చైర్మన్ కెసి.కల్కూర, ప్రజాశక్తి బుక్ హౌస్ మేనేజర్ లక్ష్మయ్య, ప్రముఖ జానపద కవి, తెలుగు కవి పోతన, తెలుగు భాష వికాస ఉద్యమ రాష్ట్ర నాయకులు జెఎస్ఆర్‌కె.శర్మ, వెంకటరమణమూర్తి, ఆనందాచారి, డా॥ మధుసూదనాచారి, డా॥ ప్రసాదమూర్తి, వీరప్రసాద్, పిళ్ళా కుమారస్వామి, డా॥ ఎం. ప్రగతి, గౌరు హరిశ్చంద్రారెడ్డి తదితరులు వీరబ్రహ్మం రచనలపై విశ్లేషిస్తూ ప్రసంగించారు.

**నృత్యరూపకం...అజరామరం...**

ప్రజానాట్యమండలి రూపొందించిన కళారూపాలు వీక్షకులను విశేషంగా ఆకట్టుకున్నాయి. తెలకపల్లి రవి రచించిన సమధర్మ తత్వం, ఇది కదలండయా, సత్యాల సారమిది, తెలియండయా అంటూ రచించిన పాటకు లక్ష్మీనారాయణ, ఎల్లాజీ బృందం చేసిన నృత్యరూపకం అలరించింది. సాహితీ స్రవంతి జిల్లా అధ్యక్షులు జంధ్యాల

రఘుబాబు రచించిన తత్వాలు చెప్పే మన పోతులూరి సత్యాలు చెప్పే మన పోతులూరి అంటూ రచించిన గేయాన్ని ప్రజానాట్యమండలి గాయకులు ఆర్‌వి.సుజాత స్వరకల్పన చేయగా, ఎల్లాజీ నృత్య రూపకల్పన చేశారు. నల్లి ధర్మరావు రాసిన కాలానికి నేర్పిన సాంఘిక విప్లవ ధర్మం, కలకాలం పోతులూరి ప్రజావీరధర్మం గేయాన్ని ఆశన్న బృందం ఆలపించింది. ప్రజానాట్యమండలి కళాకారులు మంగరాజు ఆలపించిన గేయం విన్నాను అమ్మ ఒడిలో కమ్మనైన తెలుగు ప్రసరించెను నామదిలో విజ్ఞానపు వెలుగు పాటను పాడి వినిపించారు.ప్రజానాట్యమండలి జిల్లా అధ్యక్షులు యంపిబసవరాజు పరులకోసం పాటు పడిన నరుని బతుకు దేనికని పాటను పాడగా, గాలిది ఏకులము..ఈ నేలది ఏ కులము పాటను కళాకారులు అద్భుతంగా పాడారు. నృత్యరూపకంలో వీరబ్రహ్మం పాత్రలో బతకన్న, బ్రాహ్మణుడి పాత్రలో లోకేష్, కక్కయ్య పాత్రలో సుంకన్న, సిద్దయ్యగా కె.శేషన్న సభికులను ఎంతో అకట్టుకున్నారు. దస్తగిరి, రామకృష్ణ, శ్రీనివాసులు, కె.మునీంద్ర, లక్ష్మీనారాయణ, చరణ్, ఫయాజ్, రియాజ్, చరణ్‌తేజ్, ఖలీల్, వెన్నెల, లహరి, హసీనా, షాజాహాన్, సుప్రియ, లేఖ, విష్ణుప్రియ, షాహీన్, అమృత, రేఖ,చేసిన నృత్యం ఆహుతులను అలరింపజేసింది.

**పోతులూరి వీరబ్రహ్మంపై 11 పుస్తకాల ఆవిష్కరణ:**

పోతులూరి రాష్ట్రస్థాయి సాహిత్య సమ్మేళనంలో భాగంగా ప్రజాశక్తి బుక్ హౌస్ ప్రచురించిన 11 పుస్తకాలను ప్రముఖుల చేతుల మీదుగా ప్రజాశక్తి బుక్‌హౌస్ జనరల్ మేనేజర్ కె.లక్ష్మయ్య ఆవిష్కరింపజేశారు. ఆచార్య ఎన్ గోపి రచించిన కర్మయోగి వీరబ్రహ్మం, పోతులూరి రచన కాళికాంబసప్తశతి, డాక్టర్ రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి రచించిన పోతులూరి వీరబ్రహ్మం పద్యాలు, జి.కళ్యాణరావు రచించిన వేమన - వీరబ్రహ్మం రచనలు-సామాజిక స్పృహ, ఆచార్య పులికొండ సుబ్బాచారి, విప్లవ కవియోగి వీరబ్రహ్మం, ఎం.ఎం. వినోదిని రాసిన బహుముఖ దార్శనికుడు - బహుజన తాత్వికుడు పోతులూరి వీరబ్రహ్మం, రాచపాళెం సంపాదకులుగా వెలువరించిన పోతులూరి వీరబ్రహ్మం తాత్వికత, తులనాత్మకత, సామాజిక విప్లవకారుడు పోతులూరి వీరబ్రహ్మం, వీరబ్రహ్మం కవిత్వం, కవిత్వాంశాలు అనే పుస్తకాల ఆవిష్కరణ జరిగింది. రవీంద్ర విద్యాసంస్థల అధినేత జి.పుల్లయ్య, లలితకళాసమితి అధ్యక్షులు పత్తి ఓబులయ్య, ఇనాక్, హనుమంతరావు, ప్రతిభ విద్యాసంస్థల అధినేత అరుణాచలరెడ్డి, కడపకు చెందిన విజయశంకర్, యస్డీవి అజీజ్, డా.గేయానంద్, తెలంగాణ సాహితి రాష్ట్ర అధ్యక్షులు వల్లభాపురం జనార్ధన, సర్వశిక్షా అభియాన్ డిప్యూటీ డైరెక్టర్ పార్వతీ, రాధేయలు ఆవిష్కరించారు.

**లోతైన సత్యాన్వేషణ..**

1591 నాటి తాళపత్ర గ్రంథాల ఆధారంగా 17వ శతాబ్దంలో పోతులూరి వీరబ్రహ్మం ఆయన గూర్చి కొద్దిపాటి సమాచారం మాత్రం ఉందని చర్చాగోష్టిలో వక్తలు సభ దృష్టికి తీసుకొచ్చారు. ఈ సందర్భంగానే ప్రతిమనిషి ఇతరుల జీవితంలో దైవత్వాన్ని చూడాలని, మనిషిలోనే దేవుడున్నాడని పరమత ద్వేషాన్ని విడనాడాలన్న అదే పోతులూరి ఆశించిన సమాజమని చర్చల సందర్భంగా తేల్చారు. ఆనాటి సమాజంలో స్త్రీల పట్ల ఉన్న వివక్షనుకూడా పోతులూరి ప్రశ్నించాదన్న పరిశోధనాత్మక సత్యం చెప్పగలిగారు. ఇక విడ్డూరమేమంటే రాళ్ళను కొయ్య బొమ్మలను మొక్కకూడదని ఆనాడే చిల్లర "రాళ్ళను మొక్కుతు ఉంటే చిత్తం చెడునురా ఒరేఒరే" అని పోతులూరి తత్వాలను ఉటంకించడం అద్భుతమనిపించింది. స్త్రీకి సమానత్వం, జంతువులపై కరుణ, కులమతాల పట్ల ఐక్యత, విగ్రహారాధన వ్యతిరేకత పోతులూరి ఆనాడే ప్రకటిస్తే ఈ సమాజం ఆయన్ని అర్థం చేసుకోక ఏవి వద్దన్నాడో అవే పాటించడం ఆశ్చర్యం..

**మతోన్మాద సందర్భంలో ...**

కులం పునాదుల మీద ఒక జాతిని కాని నీతిని కాని నిర్మించలేమని డా.బి. ఆర్. అంబేద్కర్ చెబితే ఈ పాలకులు కులం పునాదుల మీదనే పాలన చేస్తుండటం సమాజ తిరోగమనానికి సంకేతం. భారతదేశంలో మతతత్వ శక్తులు ఒకవైపు దాడి చేస్తున్నాయి. మేధావులకు రక్షణ లేదు..దేన్ని ప్రశ్నించకూడదన్న అప్రజస్వామిక భావజాలం ఈనాడు దేశాన్ని పాలిస్తున్నది. సమాజ పురోగమనం సాధ్యమవ్వదు. మనుషులంతా ఒక్కటేనన్న నినాదాన్ని వేమన - పోతులూరి వీరబ్రహ్మంలు ప్రకటిస్తే మనషులంతా సమానమెప్పటికీ కాదు..ఈ వ్యవస్థలో మూర్ఖత్వం..మూఢత్వం దాగిన మనువర్ణం ఉందని ఒక పక్క నిరూపించే ప్రయత్నం ఈ పాలకులు చేస్తున్నారు. మతసామరస్యం, పరమత సహనం పోతులూరి ఆశయమైతే ఆ ఆశయాలకే తూట్లు పొడుస్తుండటం మనమిప్పుడు చూస్తున్నాం..వేమన, వీరబ్రహ్మం ప్రజాస్వామ్య, లౌకిక సమాజ నిర్మాణానికి పరితపించారు. కుల, మత విద్వేషాలు, ఆడ, మగ వ్యత్యాసాలు లేని సమాజం కోసం పోతులూరి వీరబ్రహ్మం మార్గాన్ని అందరూ ఆచరించాల్సిన సమయం ఆసన్నమైందన్న సత్యం సభ చెప్పగలిగింది. ◆

## నివేదిక

# భవిష్యత్తుపై ఆశ కల్పించిన - 'ఒక కవి రెండు కవితలు'




**-కోసూరి రవికుమార్**

**77021 09311**

కవిత్వం ఏం చేస్తుంది? ఏమో నాకేం తెలుసు? కానీ నా తరపు గొప్పమాటల్ని, చెప్పుకోదగ్గ కొన్ని మాటల్ని ఇక్కడ చెప్పుకుని తీరాలి.

*'కదిలేది..కదిలించేది..అని శ్రీశ్రీ అన్న కాణ్ణించీ*
*ఇవాల్టి భాష పగుల్తుంది.*
*సమస్త పేలుడు పదార్థాలన్నింటినీ*
*గర్భీకరించుకుని భాష పగుల్తుంది.*
*శబ్దం మిగుల్తుంది.*
*నీ క్రోధానికి సరికొత్త భాష దొరుకుతుంది.*

*ప్రజల రహస్య భాష తెలుసుద్దిరా అబ్బాయ్* అని కె.శివారెడ్డి అన్నదాకా కవిత్వం ఏంచేయాలో అది చేస్తూనే వుంది.

కూలుతున్న బతుకుల దగ్గర, కాలుతున్న మనుషుల దగ్గర, కుములుతున్న నేలగుండెల దగ్గర చెవులు పెట్టి వినాల్సిన విలువైన విషయాలను అలా జనంలోకి ఇసిరేసుకు పోతానే వుంది.

కవిత్వం ఏంజేసిందో, ఏంజేస్తుందో, ఏంచేసుద్దో ఆలోచించే సమయంలేని రాజ్యానికి ఎప్పటికీ పక్కలో చల్లుకున్న చిల్లముళ్ళు కదూ కవిత్వం.

ఇక కవులేం చేస్తారంట. ఇంకా ఇవాల్టి రాజ్యం గొంతులోంచి వచ్చే మాటల్లోనైతే ఏం పీకుతారంట? హుంకారమో, అహంకారమో నిలువెత్తున పేరుకున్న ధనమదమో...అన్నీ కలగలిసిన గొంతుతో అడిగే ప్రశ్న..కవులేం పీకుతారంట?

కవులు వ్యవసాయం చేస్తారు. అదేదో కమర్షియల్ సినిమాలో డైలాగ్ మాదిరి 'కవులు వ్యవసాయం చేస్తారు, అడ్డంగా పెరిగిన కలుపునూ, చిల్లరమల్లరగా, మందలుగా చేనిమీదికి ఎగబడే పురుగుల్ని ఏరిపారేస్తారు'.

అవును కదా! ఈ మాటలు అప్పుడెప్పుడో చెప్పేశారు కదా! 'కవులు అనధికార శాసనకర్తలు' అని.. ఇంకా ఏం చెప్పాలో కవులేం చేస్తారని అడిగితే..

అక్షరాల పదును తెగిన అర్థం కానంత మెత్తటిది. వాక్యాల వాటం తల తెగిపడ్డాక కూడా మొండానికి అర్థమే కానీనంత వాడుపు.

కవిత్వపు ఒరవడికీ, ఒరిపిడికీ పెద్ద పెద్ద బండరాళ్ళే గుండ్రాళ్ళుగా మిగిలినయ్. కాస్త సూస్కొని కూచోండి సాములూ..కుర్చీలో పల్లేర్లున్నాయి..అని చెప్పీ చెప్పకుండా చెప్పేది కవిత్వమే. చెప్పగలిగేదీ కవిత్వమే.

ఇప్పుడిదంతా ఎందుకంటే-'మల్లెతీగ' మాసపత్రిక, నవ్యాంధ్ర రచయితల సంఘం కలగలిసి కొత్తగా ఆలోచించి, ఒక పనికొచ్చే పని చేసినై. సెప్టెంబర్ 29న విజయవాడ బందరురోడ్‌లోగల ఠాగూర్ గ్రంథాలయంలో కాస్తంత కొత్తగా రొటీన్ సాహిత్య కార్యక్రమాలకు భిన్నంగా, కవిత్వాన్ని ఒక జీవద్భాషగా భావిస్తున్న కవిమిత్రుల్ని కొందరిని పిలిచి మరీ 'ఒక కవి-రెండు కవితలు' పేరిట ఒక కార్యక్రమం రోజంతా నిర్వహించాయి.

ఈ మధ్యకాలంలో రాజధాని నగరంలో ఈ రకమైన ప్రయోగాలు జరిగినట్లు లేదు. వివిధ వృత్తుల్లో వివిధ భావజాల సంస్థలతో, భిన్న ఉద్యమాలతో మమేకమవుతున్న యువకవి మిత్రులు ఒక్కొక్కరు రెండేసి కవితలు చదువుతుంటే- ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఛైర్మన్ ఆచార్య కొలకలూరి ఇనాక్, నవ్యాంధ్ర రచయితల సంఘం అధ్యక్షులు, సుప్రసిద్ధ సాహితీ విమర్శకులు బిక్కి కృష్ణ సుప్రసిద్ధ కథా, నవలా రచయిత శ్రీరామకవచం సాగర్, మినీ కవితా ఉద్యమ సారధి డా.రావి రంగారావు, సాహిత్యప్రస్థానం మాసపత్రిక వర్కింగ్ ఎడిటర్ హౌరప్రసాద్, ఇతర సాహితీ ప్రముఖులు యువకవుల కవితల్ని విశ్లేషిస్తూ అత్యంత ఫలవంతంగా సాగిన కార్యక్రమం.. అని శ్రోతలు అనుకున్న కార్యక్రమం ఇది.

కవిగా, సమీక్షకునిగా చక్కగా రాణిస్తూ, 'అద్వంద్వం' పేరిట పాఠకులను కవిత్వపు పరుసవేదితో తాకిన ఈ తరపు పదునైన గళం 'పుప్పాల శ్రీరామ్' కళ తప్పి కళకళ పడుతున్న కాశ్మీరాన్ని నేలను గుల్లబార్చే వానపాములకు బదులు ఖనిజాన్ని కాజేసే పెట్టుబడి పాములు నల్లమల గుండెల్లోకి చొరబడి అడవిని అదృశ్యం చేయబోతున్న దుర్మార్గాన్ని సగ్రుమని దూసిన కత్తిలా ప్రశ్నించారు.

కర్ఫ్యూ ఉదయాస్తమయాల్లో కశ్మీరీ సూర్యుడు నాన్న దుఃఖాన్ని చూళ్ళేక ఇల్లొదిలి ఊరి చివర గ్రనేడ్‌కి పగిలిన పసివాడి తలకాయలా వుంటాడంటూ' కాశ్మీర్ కరకు సంధ్యల్లో పొగు పడుతున్న అమానవీయతను కవిత్వంలో కుదురుకట్టాడు.

ఇక దాచేపల్లికి చెందిన కవి కోసూరి రవికుమార్- నల్లమలా యురేనియం, సికాకులం బాక్సైటు నేలేదైనా తవ్వకు పోవడమే నైజంగా మారిన రాజ్యపు అవతారాన్ని 'నా దేశపు స్వాతంత్ర్యం వార్థక్యపు బందెలదొడ్డి, ఉచ్చగబ్బులో పుణ్యస్నానం' ఇలా సాగి అడవి తరపున యుద్ధం దాగిన పక్షి రెక్కతో పరాచికాలొద్దు అని హెచ్చరిక జారీ చేశాడు.

కవిత్వం కావడం మొదలైతే రాజ్యాన్ని రాగికాగులో ఏసి పుల్లా పుడకా రాజేసి సలసల కాగేలా చేయగలగటం 'పల్లెపట్టు నాగరాజు'కు అలవాటైన విద్య పల్లె పదాలతో, పల్లె గొంతును పట్టుదలగా చెప్పడంలో నాగరాజు ఇటీవల వినిపిస్తున్న బలమైన గొంతుక. 'దుఃఖవర్ణపు కుంకుమ పువ్వా' అంటూ కాశ్మీరంపై మూడొందల డెబ్బై రద్దును మూడు లక్షల ప్రశ్నలుగా సంధించాడు. సంకలో శాంతి కపోతాన్ని తెచ్చి నీ నెత్తినొదిలి ఓ కుట్రపూరిత తీగ నీ గొంతుకు బిగించే దేన్నీ క్షమించకు- గద్దలు ఆకాశంలో పావురాలు ఎగరేస్తాననడం ఎంత హాస్యాస్పదం అన్నాడు.

'రేపు విరుగుతున్న చప్పుడు' శీర్షికగా 'రేపు కాలిపోతున్న వాసనకి ఇప్పుడే ఊపిరాడటం లేదు. గుక్క తిప్పుకోలేని పొగతో కళ్ళనీళ్ళు కమ్ముతున్నాయి. అడుగు మిత్రమా! అడుగు అంటాడు. నాగరాజు దేశంలో కులం, మతం పేరిట కూలిపోతున్న కుటుంబాల తరపున 'మనిషొక పద్యం' అన్న మెట్టా నాగేశ్వరరావు 'గెడకత్తి' పేరిట కవిత్వమవుతూ 'నాకందకుండా పెరిగిపోతున్న దుర్గుణాలను కోయడానికి ఒక గెడకత్తి కావాల'ని అంటాడు.

'చెరువంత దండ' కవితలో వాళ్ళ ఊరి జగ్గయ్య చెరువును పదం పదంలో పొదిగి నీటివనరుల గొప్పతనాన్ని అక్షరాల్లోకి అనువదించారు. పల్లెజనపు బతుకుల్లో నిండా పొంగుతున్న చెరువకు దండై మెడలో పడతానన్నాడు.

ఎనిమిదో రంగును పాఠకులకు పరిచయం చేసిన కవి అనిల్ డ్యానీ 'శిలాస్వప్నం' శీర్షికగా అహంకరిస్తున్న కులాన్ని తన మెత్తటి చెర్నాకోలతో ఛెళ్ళున చరుస్తారు. ఊరిచివర గుడిసెల పైనుండి ఉగాదినీ, వసంతాన్ని మనకు చూపిస్తూ 'నా దగ్గరకు రాకుండా తప్పించుకు తిరుగుతున్న వసంతాన్ని ఈ అస్పృశ్యపు వేళ్ళతో కావలించుకోవాలని ఊహ చేస్తున్నా'నన్నాడు.

బహిరంగంగా తెగబడుతున్న మాధ్యమాల మానసిక దౌర్బల్యాలను ప్రశ్నిస్తూ 'బహిరంగ రహస్యం' ప్రకటించాడు. 'సహజీవనం అంటే కోరిక తీరనితనం కాదు. అడ్డుగోడల్ని కూలగొట్టటానికి దొరికిన ఒక అవకాశం' అంటాడు. 'ఇంకా

లెక్క తేలని క్రోమోజోముల మధ్య నిన్ను నువ్వు పోగొట్టుకోకు' అంటూ అర్థవంతమైన హెచ్చరిక చేశాడు అనిల్ డ్యానీ.

మనుషుల గురించి మనేద పడటం మనకు తెలిసిందే..కానీ ఒక కవి బావి గురించి బాధ పడతాడు. అతడు శ్రీనివాస గౌడ్..ఒక మెలకువ అన్న అతడు ..ఎంతగా మెలకువపడ్డాడో గానీ 'ముంతా వోళ్లబావి కత' అంటూ ఈ కవిత్వోత్సవంలో ఒక ప్రేమ కవిత అదీ తరాల తరబడి దాపునీళ్ళకోసం జనం ఆధారపడ్డ ఒక బావి కత గొప్పగా చెప్పాడు. "బావి గిలకబావి..గిలకమీద చేద, బావి చుట్టూ పళ్లెం..పళ్లెంలో నీటి మెతుకులు ఏరుకు తినే పశువుల పక్షుల కళ్ల కైమోడ్పు కదా" ముంతా వోళ్లబావి..ఎండ ఎదానబడి వొళ్ళు చిరచిర లాడుతున్నోడికి సల్లటి నీళ్లు నోరారతాపి చల్లగా ఒళ్ళంత తుడిచే అమ్మ చీరకొంగుకదా ఈ ముంతా వోళ్ళబావి..అంటూనే అందరినీ నగరపు ఆర్వో ప్లాంట్‌ల అంచుల నుంచి ముంతా వోళ్ల నూతిపళ్లెం మీద గిరాటేసి చేదగిలక మీంచి నీళ్లు చేది కడుపారా తాపాడు.

మూలాలని తడుముకునేలా రాస్తున్న కవి కంఠ బంగార్రాజు తన 'దేవుడొక విద్రోహశక్తి' కవితలో సమస్త మతాల పేరిట సాగే, మభ్యపెట్టే కుతంత్రాలను కుళ్ళబొడిచాడు. పిండాల్ని కాకులు తప్ప ఆత్మలు తినవనీ, జీహాద్ అంటే జనాన్ని చంపడమనీ, దేవుడి రాజ్యం అంటే జనాన్ని లోబరుచుకోవడమనీ అర్థమయ్యేలా చెప్పే ప్రయత్నమిది.

పసినవ్వుల్ని పారవశ్యాలుగా భావిస్తూ పశువుల్లా తెగబడుతున్న జంతువుల్ని హెచ్చరిస్తూ 'బాల్యం అంతరిస్తుందేమో' అంటూ భయపడ్డారు కంఠ బంగార్రాజు. 'పసినవ్వుల్లో రసికత వెతుకుతున్న లోకం ముఖాన ఉమ్మండిరా బాబూ..బాల్యాన్ని బలాత్కరిస్తున్న మగతనాల మీద ఏ రాచపుళ్ళనో రాజెయ్యండి' అన్నారు.

ఈ కవితల కలబోతలో తనకంటూ వున్న ప్రత్యేకమైన శైలితో మనుషులమీది ప్రేమతో, రైతు జీవితాల పట్లా, పిల్లల చదువుల పట్లా గొప్ప చనువు ప్రదర్శించే కవి మిత్రుడు..ఆర్.రాఘవరెడ్డి. ''కుత కుతా అన్నం ఉడుకుతున్నప్పటి పరిమళభరితమైన సంగీతాన్ని గురించి మాట్లాడతానన్నాడు.

సిబ్బిరేకు పక్కకుదీసి ఒక్క మెతుకును వొత్తిజూసి ఉప్పుగల్లేసి ఇస్తే.. ఉఫ్స్..ఉప్పని ఊదుకుతాగిన గంజిని గుర్తుచేశాడు..మనిషి మూలాలాను వెతుక్కోమని అక్షరాలతో వెనక్కు నెట్టాడు. ఎక్కడికిరా అబయా పోతా వుండారూ..నేలను మరిసి, పంటను మరిసి, మరి ముఖ్యంగా బువ్వను మరిసి మీ రుబాబేందిరా అంటూ అన్నం గురించి కవిత్వమై గొప్ప కదలికలు తెచ్చాడీ కవి. "అన్నం నా ఆదిమచేతన బీజం. అన్నం నా పురాజ్ఞాపకం. అన్నం నా ఆజన్మ నేస్తం. మట్టి సేతుల్తో అవ్వ కలిపెట్టిన గోరుముద్ద

కోటానుకోట్ల శ్రామికుల చెమటచుక్క" అని బర్గరుల, పిజ్జాల మోజులో మరచిపోతున్న బువ్వ చిరునామాను గుండెల మీద రాశాడీకవి.. మనిషి మనిషిలా మిగలలేక పోతున్న వైనాన్నీ ఈ కవి గొప్పగా కవిత్వం చేశాడు. "కావాలంటే అద్దంలో చూడండీ వీడిపెదాల మీద పూలవనాల్లేవు.. కళ్ళలో కాకరపువ్వొత్తుల వెలుగుల్లేవు, వీడికి చదవడానికి తీరికే లేదు"..వీడు నేను కాదు..నాక్కాస్త నన్ను ఆనవాలు పట్టి పెట్టండి అంటూ..ఎంతగా ప్రాధేయపడతాడో అంతగా అందరమూ ఎవర్ని వాళ్లు వెతుక్కుంటాం..

అవ్వారు శ్రీధర్‌బాబు మోహపు మబ్బు అవుతూ షాపింగ్ మాల్‌లు మధ్యతరగతి మానవుల్ని కొల్లగొడుతున్న వైనాన్ని కవితలుగా వినిపించారు. నక్షత్రాలు కప్పుకుని వినయాన్ని నటిస్తున్న సింహం-మాల్ అన్నారు.

'హృది చిగురించిన చోట' అన్న కవితలో మనిషి పొద్దుటి నుంచి పోగులు పెట్టుకున్న చెత్తనంతా సాయంత్రానికి దించేసుకుని రాత్రికి కొత్త వీడ్కోలు రాస్కోకపోతే తెల్లవారగానే బతుకు పరుగులెత్తదని హెచ్చరించారు. ఇలా అందరి కవితల్ని విశ్లేషించుకుంటూపోతే పత్రికలో పేజీలు చాలవేమో!

నిఖార్సయిన కవిత్వానికి సేంద్రియ ఎరువులా పనికొచ్చే ఈ వినూత్న కార్యక్రమంలో మంజు యనమదల, చిత్రాడ కిషోర్‌కుమార్, కోడే యామినీదేవి, సరికొండ నరసింహరాజు, శిఖా ఆకాష్, తెర్లి అమూల్య, బి.వి.శివప్రసాద్, పద్మకళ, కె.వి.రమణారెడ్డి, సుంకర గోపాలయ్య, వర్మ కలిదిండి, డా.పెంకి విజయ్‌కుమార్, ఉండవిల్లి.ఎం., డి.నాగజ్యోతిశేఖర్, శాంతయోగి యోగానంద, జడా సుబ్బారావులు తమ కవితల్ని వినిపించారు. ఈ వినూత్న కార్యక్రమానికి శ్రీకారం చుట్టిన మల్లెతీగ కలిమిశ్రీని పలువురు అభినందించారు.



## నివేదిక

# సాహిత్య శిఖరం జాషువా



- గుండు నారాయణ
9951540671

తెలుగు వారి ఆత్మగౌరవ నినాదం, విశ్వనరుడు గుర్రం జాషువా 124వ జయంతి ఉత్సవాలు సెప్టెంబర్ 21 నుండి 28 వరకు విజయవాడలో జరిగాయి. ఎనిమిది రోజులు తొమ్మిది విభిన్న రూపాలతో జాషువా సాంస్కృతిక వేదిక ఈ ఉత్సవాలను నిర్వహించింది.

తెలుగు పలుకులు పలికే కోకిలమ్మ కువ...కువ
అనుభవిస్తే అవుతుంది మహాకవి జాషువా...
అంటరాని అమ్మ కన్న అణిముత్యమా...
కుల రక్కసిని ఎదిరించిన కవి దిగ్గజమా...

జయ జయ కవి చక్రవర్తి ... వంటి పాటలు ప్రజానాట్యమండలి రికార్డింగ్ చేయించింది. జాషువా సాంస్కృతిక వేదిక భరతనాట్యం, జానపద రీతుల నృత్యాలతో జాషువా మహాకవికి నీరాజనాలు అర్పించింది.

**బ్రోచర్ ఆవిష్కరణ**

విజయవాడలోని సాహిత్య, సాంస్కృతిక, కళాసంస్థల ప్రతినిధులు హరిసుబ్రహ్మణ్యం (నాస్తిక కేంద్రం), గోళ్ళ నారాయణరావు(ఆంధ్ర ఆర్ట్స్ అకాడమీ), ప్రఖ్యాత మిమిక్రీ కళాకారులు సిల్వెస్టార్, చిత్రకారులు గంగాధర్ వీర్ల, గిరిధర్, సునీల్, కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత వెన్నా వల్లభరావు, డాన్స్ అకాడమీ నుండి కళాతపస్వి రమేశ్, శాస్త్రీయ నృత్యకారుడు సప్పా శివకుమార్, సాహితీస్రవంతి అధ్యక్షులు వొరప్రసాద్, ప్రజానాట్యమండలి అనిల్, ఎంబివికె రామరాజు, అరసం కొండపల్లి మాధవరావు, భాస్కర శర్మ (సుమధుర కళానికేతన్), కామేశ్వరరావు (జన విజ్ఞాన వేదిక) వీరంతా జాషువా సాంస్కృతిక ఉత్సవాల బ్రోచర్‌ను ఆవిష్కరించారు.

**ఒకేరోజు ఒకే లబ్ధప్రతిష్టుల పేరుతో...**

రాయలు పరిపాలించిన ప్రాంతం. నిజాం గుర్తులతో మిగిలిన జ్ఞాపకం. కొండపల్లి సాంస్కృతిక వారసత్వం విరాజిల్లిన కొండపల్లి బొమ్మలు, సీతాఫలాలతో పాటు గుర్తించవలసిన మరో అంశం గురజాడ వారి దేశమును ప్రేమించుమన్నా గేయాన్ని మొదటిసారిగా పాటగా మలిచింది, పాడిందీ ఇక్కడే. ఆ పని చేసింది - ప్రజానాట్యమండలి వ్యవస్థాపకులలో ఒకరైన మాచినేని వెంకటేశ్వర రావు. ఆయన పేరుతో రెండురోజుల కార్యక్రమాలు కొండపల్లిలో నిర్వహించడం జరిగింది. అదేరోజు గురజాడ జయంతి రావడం యాదృచ్ఛికం. ఇక్కడ ఉత్సవాలను ప్రజాభాషా నిపుణుడు ఇండస్ మార్టిన్ ప్రారంభించారు. ఆయన మాట్లాడుతూ 'అణగారిన దప్పుకు ఆధిపత్యం తెచ్చింది ఆనాటి కమ్యూనిస్టు ఉద్యమం. నేడు కవితకు, ప్రజాపాటకు పట్టం కట్టాలి. మోడ్రన్ సంగీత పరికరాలను వాడుకుంటూ కొత్త పాప్ సంగీతాన్ని సృష్టించాలి. ఆ పని మనతరం చెయ్యాలి అన్నారు. అందుకేనేమో క్రాంతి విద్యాలయం పిల్లలు మోడ్రన్ డాన్స్‌లో ఆడపిల్లలపై జరిగే అఘాయిత్యాలు, రాగింగ్‌లు,



కులహత్యలు చూపించి జాషువాకు నివాళి అర్పించారు. స్థానిక డాక్టర్ మోహన్‌రావు మెమోరియల్ సంస్థను కలుపుకొని ఇక్కడ ప్రజాకళాసంబరాలు, కోలాటం, పాటలు, నృత్యాలు, జానపదాలు ప్రదర్శన జరిగింది. ఈ కార్యక్రమాలను కమిటీ బాధ్యులు అనిల్‌డ్యాని సమన్వయం చేశారు.

23వ తేది కష్టజీవుల ప్రాంతం. అనేక పోరాటాలకు పుట్టిల్లు. కామ్రేడ్ సుందరయ్య నాయకత్వంలో రైతు మహాసభ, బందరు కాలువ తవ్వకం తదితర విషయాలను జ్ఞాపకం చేసుకునే ప్రాంతం కృష్ణలంక రాణిగారితోట. ముఠాకార్మికులను ఏకం చేసిన కార్మిక నాయకుడు డా. టి. సుబ్బారెడ్డి పేరుతో బాలబాలికల ఆట–పాట జరిగింది. స్థానిక సుందరయ్య గ్రంథాలయం, సాయి కళ్యాణి కాన్వెంట్ సంయుక్తంగా ఈ కార్యక్రమం నిర్వహించాయి. ప్రముఖ కవి విమర్శకులు డా॥ కోయి కోటేశ్వరరావు అతిథిగా పాల్గొన్నారు. జాషువాను ఎ.సి. గదుల నుండి ప్రజల మధ్యకు తెచ్చారని అన్నారు. జాషువా కవిత్వం ఎక్కడకు చేరాలో అక్కడికే చేరుతుందని, దానికి ఇది కొనసాగింపు కావాలని ఆయన అన్నారు. పాలకొల్లుకు చెందిన బిఎస్ఎన్ఎల్ ఉద్యోగి వెంకట్రావు గారు తన స్వంత ఖర్చుతో జాషువా గబ్బిలం కావ్యాన్ని ఏకపాత్రగా ప్రదర్శించి అందరినీ ఆకట్టుకున్నారు.

**యువ నీరాజనం**

24వ తేది ఉదయం. విజయవాడలోని ప్రఖ్యాత విద్యానిలయం సిద్ధార్థ కాలేజి. యువతీ యువకుల (డ్యాన్సర్లు) సందడితో ప్రారంభమయ్యింది. యువతరానికి, అమర కళాకారుల చరిత్రను తెలియజేయాలనే ఉద్దేశ్యంతో మా భూమి, గెరిల్లా, భూమికోసం తదితర నాటకాలు రచించి, ఆంధ్రప్రజానీకానికి చిరపరిచితులైన ప్రజానాట్యమండలి రచయిత సుంకర సత్యనారాయణ పేరుతో ఈ యువ నీరాజనం కార్యక్రమం జరిగింది. ముప్పై కాలేజీల నుండి 35 టీములు యువతీ యువకులు ఈ యంగతరంగ్ కార్యక్రమంలో పాల్గొన్నారు. ప్రఖ్యాత నృత్య దర్శకులు డే షో ఫేమ్ శేఖర్ మాష్టారు, ప్రముఖ పాత్రికేయులు, విశ్లేషకులు తెలకపల్లి రవి ముఖ్య అతిథులుగా పాల్గొన్నారు. నేటి తరానికి జాషువా కవిత్వం, సాహిత్య అవసరం గురించి తెలకపల్లి రవి వివరించారు. ఆంధ్ర ఆర్ట్స్ అకాడమీ, సినిమా డ్యాన్సర్స్, డైరెక్టర్స్ వెల్ఫేర్ అసోసియేషన్ భాగస్వామ్యంతో ఈ కార్యక్రమం జరిగింది.

**విద్యాధరపురంలో....**

*కదను తొక్కిన గుర్రం కవిత*
*నిదుర లేచెను బడగు జనత*
*నాలుగు పడగల హైందవ నాగు*
*మదం అణచిన దళిత చరిత*
......
*వాడు చెమ్మటలోడ్చి*
*ప్రపంచమునకు భోజనము పెట్టు*
*వానికి భుక్తి లేదు..* అంటూ దుర్గం సుబ్బారావు విద్యాధరపురం కార్యక్రమంలో ఆవేశంగా ప్రసంగించారు. జాషువా నృత్య రూపకాలు, ప్రదర్శన సభ జాషువాకి నీరాజనం పలికాయి. అల్లూరు సీతారామరాజు గ్రంథాలయం, వాగ్దేవి నృత్యాలయం సంయుక్తంగా ఈ కార్యక్రమాన్ని విద్యాధరపురంలో ప్రముఖ యువజన నాయకులుగా వెలుగొందిన కుందనాల భాస్కరరావు జ్ఞాపకాలతో నిర్వహించారు.



**చిత్రకళా ప్రదర్శన**

ప్రముఖ చిత్రకారుడు మోహన్ సంస్మరణతో ఎంబి






విజ్ఞానకేంద్రంలో జాషువా జయంతోత్సవాలలో భాగంగా చిత్రకళా ప్రదర్శన జరిగింది. ప్రముఖ చిత్రకారులు జింకా రామారావు ప్రదర్శనను ప్రారంభించారు. ప్రముఖ ఛాయాచిత్రకారులు తమ్మా శ్రీనివాసరెడ్డి ఈ సందర్భంగా మాట్లాడుతూ భవిష్యత్తులో ఇక్కడ జరిగే చిత్రకళా ప్రదర్శనలకు ఆర్థిక సహాయం చేస్తానని ప్రకటించారు. బెంగళూరు తరహాలో చిత్రసంతలు ఇక్కడ కూడా నిర్వహించాలని అన్నారు.

**చిన్న సినిమా పెద్ద సందేశం**

26, 27 తేదీలలో ఎంబి విజ్ఞానకేంద్రంలో చిన్న చిత్రాల ప్రదర్శన జరిగింది. ప్రజావైద్యులు డాక్టర్ మాకినేని రామారావు, మానవతావాది చుక్కపల్లి పిచ్చయ్యల సంస్మరణగా షార్ట్ ఫిలిమ్స్ పోటీలు జరిగాయి. రాష్ట్ర వ్యాప్తంగా 140 షార్ట్‌ఫిలిమ్స్ పోటీకి వచ్చాయి. 50 చిత్రాలు ఎంపిక చేశారు. అంశాలను నిర్వాహకులే ఇవ్వడంతో ఆ అంశాలతోనే ఈ చిత్రాలన్నీ రూపొందించారు. సినీ దర్శకులు రేలంగి నరసింహారావు ఈ పోటీలను ప్రారంభించారు. దేవాదాయశాఖ మంత్రి వెల్లంపల్లి శ్రీనివాసరావు, శాసనమండలి సభ్యులు విఠపు బాలసుబ్రహ్మణ్యం ముఖ్యఅతిథులుగా పాల్గొన్నారు. విఠపు బాలసుబ్రహ్మణ్యం మాట్లాడుతూ మన దేశంలో జాతీయ ఉద్యమ ప్రభావంతో వ్యాపించిన భావాలు వెనుకపడుతున్నాయని, నేడు సాంస్కృతిక ఉద్యమ ప్రాధాన్యత పెరిగిందని అన్నారు.

**కవి సమ్మేళనం**

చివరి రోజు సెప్టెంబర్ 28 జాషువా పుట్టినరోజు. జాషువాను స్మరించుకుంటూ జరిగిన కవి సమ్మేళనంలో 36 మంది కవితా పఠనం చేశారు. ప్రముఖ కవి ప్రసాదమూర్తి ముఖ్య అతిథిగా పాల్గొని సామాజిక స్ఫూర్తితో రచనలు చేసే రచయితలంతా ఐక్యం కావల్సిన అవసరం నేడు పెరిగిందని అన్నారు. కార్యక్రమాన్ని కవి అనిల్ డ్యాని సమన్వయం చేశారు. సాహితీస్రవంతి అధ్యక్షులు వొరప్రసాద్, డా|| గుమ్మా సాంబశివరావు అతిథులుగా పాల్గొన్నారు.

**వైవిధ్య భరితం జాషువా జయంతోత్సవ కార్యక్రమాలు**

12000 కరపత్రాలు, 25 రకాల ఫెక్సీలు, 42 మంది వక్తలు, 200 మంది బాలబాలికలు, 600 మంది యువతీ యువకులు, 50 మంది కార్యకర్తలు, 10 సంస్థల భాగస్వామ్యం, 80 మంది షార్ట్ ఫిలిమ్ మేకర్స్, 36 మంది



కవులు, 3000 మంది ప్రజలు- వీరందరి భాగస్వామ్యంతో జాషువా సాంస్కృతిక వేదిక నిర్వహించిన జాషువా జయంతి ఉత్సవాలు విజయవంతంగా ముగిశాయి. సామాజిక మార్పు కోరుకునే భావజాలానికి, తిరోగమన భావజాలానికి మధ్య సంఘర్షణ జరుగుతుంది. కాలం చెల్లిన భావజాలాన్ని వ్యాప్తి చేయడంలో, ఛాందసవాద, అశాస్త్రీయ భావజాలాన్ని పెంచి పోషించడంలో పాలకవర్గాలు, సంస్కృతిని బలమైన ఆయుధంగా వాడుకుంటారు. సమాజాన్ని సమూలంగా మార్చాలి అనుకునే ఆలోచనలు బలంగా ముందుకు తేవడంలో ప్రజా సాంస్కృతిక వారసత్వం మన కాలంలో ఎంతో ఉంది. వాటిలో భాగంగానే జాషువా 124వ జయంతి ఉత్సవాలను ఘనంగా నిర్వహించగలిగాం ◆

## ప్రకటన

# వీరబ్రహ్మంగారి ఆశయాలను వివాదం చేయడం తగదు

**- ప్రజాశక్తి బుక్‌హౌస్**




తెలుగు ప్రజలు గర్వించదగిన గొప్ప సామాజిక తత్త్వవేత్త పోతులూరి వీరబ్రహ్మంగారు. ఆయన తన సమకాలీన సమాజంలోని అనేక రుగ్మతలను ఎత్తి చూపి, పరిష్కారం చెప్పటమే కాక ఆచరించారు. అవి ఈ నాటికీ ఎంతో విలువైనవి. ఆయన సమాజంలో పాతుకుపోయిన కుల తత్వాన్ని వ్యతిరేకించారు. మతం మనుషులను కలపాలిగాని విడదీయరాదన్నారు. మనుషులను విభజించే మతాన్ని ఆచరించవద్దన్నారు. విగ్రహారాధనను వ్యతిరేకించారు, దేవుడు మనిషిలోనే ఉంటాడు గనుక దేవునికీ మనిషికీ మధ్య మధ్యవర్తుల అవసరం లేదన్నారు. ఆచరణలో ఆయన తన శిష్యులుగా మాదిగ కులం నుంచి కక్కయ్యని, ముస్లిం మతం నుండి సిద్దయ్యను తీసుకొన్నారు. ఆచారాల పేరుతో స్త్రీలపై వివక్షను వ్యతిరేకించారు.

వీరబ్రహ్మంగారు ప్రవచించి, ఆచరించిన ఈ ఉన్నతమైన ఆలోచనలు, ఆచరణలను సమాజం ఇంతకాలం నిర్లక్ష్యం చేసింది. వీటిపై చర్చించేందుకు సాహితీ స్రవంతితో సహా 100 సాహిత్య, సమాజిక సంఘాల ఆధ్వర్యంలో అక్టోబర్ 12వ తేదీ కర్నూలులో వీరబ్రహ్మం తాత్త్విక, సమాజిక అంశాలపై సభ జరిగింది. 20 మంది ప్రముఖులు, వీరబ్రహ్మంగారి జీవితం, రచనలపై పరిశోధన చేసిన మేధావులు ఉపన్యసించారు.

ఈ సందర్భంగా గత రెండు సంవత్సరాల నుంచి బ్రహ్మంగారి మీద పరిశోధనలు చేసిన ప్రముఖుల రచనలు, ఆయన గురించి రాసిన వ్యాసాలతో ప్రజాశక్తి బుక్‌హౌస్ ప్రచురించిన 11 పుస్తకాలను ఆవిష్కరించారు. పుస్తకాలకు ప్రముఖ సాహిత్య విమర్శకులు, ప్రజాశక్తి బుక్‌హౌస్ గౌరవ సంపాదకులు చాపాళెం చంద్రశేఖరరెడ్డిగారు సంపాదకత్వం వహించారు. ఇంత శ్రమ తీసుకుని వీరబ్రహ్మంగారి ఆశయాల ప్రచారం కోసం ప్రచురించిన పుస్తకాలను సాహిత్య, సాంస్కృతిక, తాత్త్విక రంగ ప్రముఖులు అభినందిసున్న సందర్భంలో కొంత మంది వీటిని వివాదాస్పదంగా మార్చడానికి ప్రయత్నించడం విచారకరం. పోతులూరి వీరబ్రహ్మంగారి మీద డాక్టర్ ఎంఎం వినోదినిగారు రాసిన పుస్తకంలో ఆయన కృషిని, ఔన్నత్యాన్ని ఆమె ఎంతగానో ప్రశంసించారు. ఆమె వెలిబుచ్చిన కొన్ని అభిప్రాయాలపై భిన్నాభిప్రాయాలు ఉండవచ్చు. భిన్నాభిప్రాయాలను మేం గౌరవిస్తాం. కానీ వాటిని వివాదాలుగా మార్చి రచయితను బెదిరించడం, దూషించడం తగదు. ఈ పుస్తకాలపై వివాదాలు సృష్టించడం అంటే వీరబ్రహ్మంగారిని అగౌరవపరచడమే. ఇప్పటికైనా ఆయన ఆలోచనలకు వ్యతిరేకంగా జరుగుతున్న ప్రచారాన్ని ఆపి ఆయన ఆశయాలను ఆచరించటం ఈనాడు అవసరం.

– ఎస్. వెంకట్రావు, ఎడిటర్

– కె. లక్ష్మయ్య, జనరల్ మేనేజర్

# అద్దేపల్లి ప్రభుకు 2019 విమలాశాంతి సాహిత్య పురస్కారం



సాహిత్య సృజనకారులకు ఇస్తున్న విమలాశాంతి సాహిత్య పురస్కారాన్ని న్యాయనిర్ణేతల ఏకగ్రీవ నిర్ణయం ప్రకారం సుప్రసిద్ధ కవి, కథారచయిత అద్దేపల్లి ప్రభు వెలువరించిన "సీ మేన్ " కథాసంపుటికి ప్రకటిస్తున్నట్లు విమలాశాంతి సాహిత్య పురస్కారం ట్రస్ట్ ఛైర్మన్ శాంతినారాయణ ఒక ప్రకటనలో తెలిపారు. శాంతి రజనీకాంత్ స్మారక కథాపురస్కారంగా ఇచ్చే ఈ పురస్కారంతో పాటు రచయితకు రు 10000/లు నగదు నందించి, డిసెంబర్ నెలలో జరిగే ఒక సాహిత్యసభలో రచయితను సత్కరిస్తామని ఆ ప్రకటనలో తెలిపారు.

## 'విచ్చుకోవాలి' ఆవిష్కరణ సభ



నూతన సాహిత్య ధోరణులను, నూతన ఆవిష్కరణలనూ కవనలోకమంతా ఆహ్వానించవలసిన అవసరం వుందని కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత, ప్రముఖ కవి విమర్శకులు డా॥ పాపినేని శివశంకర్ అన్నారు. సెప్టెంబర్ 29న గుంటూరు నగరంలోని యస్‌హెచ్‌డి సమావేశ మందిరంలో జరిగిన సభలో నవ్యాంధ్ర రచయితల సంఘం గుంటూరు జిల్లా శాఖ అధ్యక్షులు వై.హెచ్.కె. మోహన్ రావు కవితా సంపుటి 'విచ్చుకోవాలి' ఆవిష్కరించిన అనంతరం ఆయన ప్రసంగించారు. ఈ ఆవిష్కరణ సభకు ప్రముఖ కవి, చిటిప్రోలు వెంకటరత్నం అధ్యక్షత వహించారు. 'కరువు కురిసిన మేఘం' లో కవిత్వమై మన ముందుకు వచ్చిన మోహన్‌రావు ఇప్పుడు 'విచ్చుకోవాలి' అంటూ కవన రూపమవడం అభినందనీయమని పాపినేని అన్నారు. ప్రపంచ సాహిత్యం, చరిత్ర నిర్మాణం, రాజులను, రాజ్యాలను ఆశ్రయించి అభివృద్ధి చెందిన కాలం నుండి ఈనాడు విస్మృత, ఉపేక్షిత మూలాల నుంచి వచ్చే సాహిత్యాన్ని ఆదరించే కాలానికి వచ్చామని ఆయన అన్నారు. సమాజం ఇవాళ కిరీటాలను మినహా, తలగుడ్డలను దర్శించలేకపోతుందని, రైతులను, వారి బాధలను కవిత్వీకరించాల్సిన అవసరాన్ని గుర్తుచేశారు. నిర్లక్ష్యానికి గురైన ప్రాంతాల నుండి వస్తున్న కవిత్వాన్ని ఆదరించాలన్నారు. ప్రముఖ కవి అనిల్ డ్యాని 'విచ్చుకోవాలి' పుస్తకాన్ని విశ్లేషిస్తూ పుస్తకం ఒక ప్రాంతానికి పరిమితమైంది కాదన్నారు. విస్మృత చూపుతో రచించిన కవిత్వం అన్నారు. మోహన్‌రావు కవిత్వంలో చరిత్రలో నలిగిన పేజీల మధ్య విస్మృత పాత్రలను వెలికి తీయాలనే తపన కనిపిస్తుందని అన్నారు. చరిత్ర అనేక కోణాలను మన ముందుంచుతూ పల్నాటి చరిత్ర నూతన పార్శ్వాన్ని ఉంచిన కవి మోహన్‌రావు అని డ్యానీ అన్నారు. సభలో రంగిశెట్టి ఫౌండేషన్ స్థాపకులు రంగిశెట్టి రమేష్ ముఖ్య అతిథిగా పాల్గొని ప్రసంగించారు. ప్రధాన కార్యదర్శి బండికల్లు జమదగ్ని అతిథులకు ఆహ్వానం పలికి సభను సమన్వయం చేశారు. సభలో మన్నం వెంకటగురువు, పింగళి భాగ్యలక్ష్మి, దుబ్బల దాసు, యనమల సుందర్, రోటికోలి పద్మావతి, ఆళ్ళ నాగేశ్వరరావు, సుశంతరావు, మాదిరెడ్డి శ్రీనివాసరెడ్డి, ప్రజానాట్యమండలి బాధ్యులు కాళిదాసు, కట్టమూరి శంకరరావు, జివియన్ మునేశ్వరరావు, చౌడారెడ్డి, చంద్రగిరి నారాయణరావు, పోగుల విజయశ్రీ, కనగాల జయకుమార్ తదితరులు పాల్గొన్నారు. కవి బుర్రి కుమార్ రాజు నిర్వహించిన కవన పున్నమిలో ఎం. విజయకుమార్ ప్రథమ, చిలక అనిత ద్వితీయ, బి. జనార్ధన రెడ్డి తృతీయ బహుమతులు అందుకున్నారు. ◆

## శ్రీకాకుళం లో గరిమెళ్ళ సత్యనారాయణ సంస్మరణోత్సవం

స్వాతంత్ర్య సమర యోధుడు, నిష్కళంక దేశభక్తుడు, శ్రీకాకుళం జిల్లాముద్దుబిడ్డ గరిమెళ్ళ సత్యనారాయణ సంస్మరణోత్సవం నిర్వహించాలని గరిమెళ్ళ విజ్ఞాన కేంద్రం నిర్ణయించిందని కేంద్రం అధ్యక్షులు వి.జి.కె.మూర్తి ఒక ప్రకటనలో తెలిపారు. నిర్వహణకోసంగాను, జిల్లాలోని నలభైకి పైగా సాహితీ సాంస్కృతిక సంస్థలను భాగస్వాములను చేస్తూ ఒక ఆహ్వాన సంఘం ఏర్పడిందని తెలిపారు. కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత ,కథానిలయం వ్యవస్థాపకులు కాళీపట్నం రామారావు గౌరవాధ్యక్షులుగా, కేంద్రసాహిత్య అకాడమీ తెలుగు విభాగం సలహాసంఘ సభ్యులు, ప్రముఖ రచయిత అట్టాడ అప్పలనాయుడు అధ్యక్షులుగాను, వి.జి.కె.మూర్తి కార్యదర్శి గాను వ్యవహరిస్తారు. వివిధ సంఘాలనుండి నలభయి మందికి పైగా గౌరవసభ్యులు వున్నారు. డిసెంబరు 22 ఆదివారం నాడు జరిగే ఈ కార్యక్రమం సందర్భంగా జిల్లాలోని యువతీ యువకులకు స్వాతంత్ర్యోద్యమం పట్ల అవగాహన కలిగించేందుకు, క్విజ్, వ్యాసరచన, వక్తృత్వం అంశాల్లో పోటీలు జరుగుతాయని, ఔత్సాహిక రచయితలనుండి, కవితలను ఆహ్వానించి, ఎంపిక చేయబడ్డ వాటితో ఒక సంపుటి తేవాలని నిర్ణయించినట్లు తెలిపారు. "నాటి స్వాతంత్ర్యోద్యమం నేటి సామాజిక స్థితిగతులు" అనే ఇతివృత్తం తో ఈ పోటీలు జరుగుతాయని తెలిపారు. ◆

## జాషువా, భగత్ సింగ్ స్ఫూర్తితో రచనలు చేయాలి!



విశ్వనరుడు గుర్రం జాషువా, షహీద్ భగత్ సింగ్ స్ఫూర్తితో రచయితలు సామాజిక స్పృహ కలిగిన రచనలు చేయాలని డాక్టర్ కె.నాగేశ్వరాచారి పిలుపునిచ్చారు. సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో సెప్టెంబర్ 28న జరిగిన జాషువా 124 వ జయంతి మరియు భగత్ సింగ్ 112 వ జయంతి సభలలో ఆయన ముఖ్య అతిథిగా పాల్గొని ప్రసంగించారు. అసమానతలు, దోపిడీ, వివక్ష లేని సమాజాన్ని ఇద్దరూ కాంక్షించారని, వారిద్దరి కలలు నేటికీ సంపూర్ణం కాలేదని నాగేశ్వరాచారి ఆవేదన వ్యక్తం చేశారు. ఆ మహానుభావులు కలలు గన్న సమాజాన్ని నెలకొల్పేందుకు రచయితలు తమ రచనల ద్వారా ప్రజలను చైతన్యపరచాలని కోరారు. సభకు సాహితీ స్రవంతి జిల్లా నాయకులు ప్రజ్ఞా సురేష్ అధ్యక్షత వహించారు. కార్యక్రమంలో పాల్గొన్న సాహితీవేత్తలు, సామాజిక కార్యకర్తలు జాషువా, భగత్ సింగ్ చిత్ర పటాలకు పూలమాలలు వేసి నివాళులర్పించారు. అనంతరం ప్రతినెలా జరిగే సాహితీ సంగమం లో భాగంగా కథా సంగమం కార్యక్రమం నిర్వహించారు. ఉప్పరపాటి వెంకటేశులు, యాములపల్లి నర్సిరెడ్డి, ప్రగతి, హేమ మాలిని, జూటూరు తులసీదాస్ తదితరులు కథలు వినిపించారు. డాక్టర్ నాగేశ్వరాచారి కథలను సమీక్షించి, సూచనలు చేశారు. క్లుప్తత కథకు అత్యంత కీలకమన్నారు. వస్తువులో కొత్త దనం, చదివించే శైలి ఉన్న కథలు మంచి రచనలుగా నిలిచిపోతాయని అన్నారు. హేమ మాలిని కథ ఉత్తమ కథగా ఎంపికయింది. బాలభారతీ మేడమ్ బహుమతి తాలూకు నగదు అందించారు. ఈ కార్యక్రమంలో యాడికి సూర్యనారాయణ రెడ్డి, రియాజుద్దీన్, డాక్టర్ ఎ.ఎ.నాగేంద్ర తదితరులు పాల్గొన్నారు. ♦

## సాహితీస్రవంతి ఆధ్వర్యంలో గుంటూరు శేషేంద్ర శర్మ జయంతి



సాహితీ స్రవంతి నగర కమిటీ అధ్వర్యంలో నగరంలోని పింగళిసూరన తెలుగుతోటలో అక్టోబర్ 20న గుంటూరు శేషేంద్రశర్మ 92వ జయంతి సందర్భంగా 'గుంటూరు శేషేంద్ర శర్మ కవితా వైభవం' అన్న సదస్సు జరిగింది. ఈ సదస్సుకు సాహితీ స్రవంతి జిల్లా గౌరవాధ్యక్షులు గౌరెడ్డి హరిశ్చంద్రారెడ్డి అధ్యక్షత వహించారు. ఈ సభలో సాహితీస్రవంతి జిల్లా ప్రధాన కార్యదర్శి కెంగార మోహన్ మాట్లాడుతూ శేషేంద్ర సమాజం పట్ల బాధ్యతున్న కవి అని, కొడవలి కర్షకుడికి ఆయుధం, సుత్తి కార్మికుడికి ఆయుధం, కత్తి సైనికుడికి అయుధం, నినాదం రాజకీయ నాయకుడికి ఆయుధం అలాగే కవికి కవిత్వమే ఆయుధం..కవే దేశానికి అసలైన ఆయుధం అని శేషేంద్ర కవిని నిర్వచించాడన్నారు. ఆయన రాసిన ఆధునిక భారతమైనా చదివితే కనీసం కవిత్వం ఇలా వుండాలన్న భావన కలుగుతుందన్నారు. కవిత్వ పరిణామక్రమాన్ని, వస్తువును, శిల్పాన్ని, ఇతివృత్తాల్ని, ఎత్తుగడల్ని, భావావేశాల్ని, భావ శబ్దచిత్రాల్ని, పద చిత్రాల్ని, ప్రతీకల్ని, వెంటాడే వాక్యాల్ని గమనించగలిగి నాడి పట్టుకున్నప్పుడు మాత్రమే కవిత్వం బాగా రాయగలమని, కవిత్వం ఇలాగే వుండాలని అని ఎవ్వరూ చెప్పకపోయినా కవిత్వం మాత్రం హృదయం నుండి హృదయం దాకా ప్రవహించాలన్నారు. సాహితీసవంతి రాష్ట్ర కార్యదర్శి జంధ్యాల రఘుబాబు, నగర కార్యదర్శి పెరికల రంగస్వామిలు సందేశం ఇచ్చారు. సభలో కవులు, కళాకారులతో పాటు నగరకమిటీ నాయకులు యస్ మహేశ్వరయ్య, డి.అయ్యన్న తదితరులు పాల్గొన్నారు. ♦

## తెలంగాణ సాహితి మహబూబ్ నగర్ ఆధ్వర్యంలో ఆర్టీసి కార్మికుల సమ్మెకు మద్దతు



తెలంగాణ సాహితి మహబూబ్ నగర్ ఆధ్వర్యంలో తెలంగాణ ఆర్టీసి కార్మికుల సమ్మెకు మద్దతుగా అక్టోబర్ 17న వాగ్దేవి జూనియర్ కళాశాల హాలులో కవిసమ్మేళనం జరిగింది. తెలంగాణ సాహితి రాష్ట్ర అధ్యక్షులు వల్లబాపురం జనార్దన అధ్యక్షత వహించారు. ఈ కార్యక్రమంలో వీరాంజనేయులు, రామకృష్ణా రావు, టిఎన్‌జివో జిల్లా అధ్యక్షులు, నందిగామ కిశోర్ కుమార్, తెలంగాణ సాహితి జిల్లా అధ్యక్షులు, ఎండి. ఖాజామైనద్దీన్, తెలంగాణ సాహితి జిల్లా ప్రధాన కార్యదర్శి పాల్గొన్నారు ♦

## అవినీతి వ్యతిరేక కవితల పోటీ

"అమరావతి సాహితీమిత్రులు", "సర్వీస్ హెల్త్ ఆర్గనైజేషన్" సంయుక్త నిర్వహణలో అంతర్జాతీయ అవినీతి వ్యతిరేక దినోత్సవం సందర్భంగా "అవినీతి వ్యతిరేక కవితల పోటీ" నిర్వహిస్తున్నట్లు సంస్థల సంస్థాపకులు డా. రావి రంగారావు, డాక్టర్ టి. సేవకుమార్ ఒక ప్రకటనలో తెలిపారు. 20 పాదాలకు మించని పద్య కవిత/వచన కవిత/గేయం ఏదైనా ఒక కవిత మాత్రమే పంపించవలసి వుంటుంది. ప్రథమ బహుమతి రూ.5 వేలు, ద్వితీయ బహుమతి రూ.3 వేలు, తృతీయ బహుమతి రూ.2 వేలు, నాలుగు ప్రత్యేక బహుమతులు రూ.500 చొప్పున ఇవ్వబడతాయి. "ఈ పోటీకి ప్రత్యేకంగా సొంతంగా రాసిన కవిత" అని హామీ పత్రం కవిత వెనక వైపు రాసి చిరునామా, ఫోన్ నంబరు కూడా ఇచ్చి సంతకం చేయాలి. డిసెంబర్ 9 సోమవారం ఉదయం 10 గం.కు గుంటూరు 2/1 బ్రాడీపేట సర్వీస్ హెల్త్ ఆర్గనైజేషన్ సమావేశ మందిరంలో జరిగే అంతర్జాతీయ అవినీతి వ్యతిరేక దినోత్సవ సభలో బహుమతులు అందించటం జరుగుతుంది. కవితల్ని నవంబర్ 20లోపు అందేలా "డా. రావి రంగారావు, 101, శంఖచక్ర నివాస్, అన్నపూర్ణ నగర్, 5వ లైను తూర్పు, గోరంట్ల, గుంటూరు 522034" అడ్రసుకు పంపవలసిందిగా కోరారు. ఇతర వివరాలకు9247581825 ద్వారా సంప్రదించవచ్చును. ♦

## పుస్తక సంపుటాల పోటీకి ఆహ్వానం

సృజనసాహితి వారి శ్రీ శివేగారి దేవమ్మ స్మారక జాతీయ పురస్కారం - 2019 కోసం నవల, కథా, కవితా, వ్యాసాల సంపుటాలను పంపవలసిందిగా శివేగారి చిన్నికృష్ణ ఒక ప్రకటనలో కోరారు. ఉత్తమ నవల 5000/-, ఉత్తమ కథా సంపుటి 4000/-, ఉత్తమ వ్యాసాల సంపుటి 3000/, ఉత్తమ కవితా సంపుటి 3000/-, ఉత్తమ లఘుకవితా సంపుటి 2000/- నగదు పురస్కారం అందివ్వనున్నట్లు తెలిపారు. పుస్తకాలు చేరవలసిన చివరి తేదీ డిసెంబర్ 31. పుస్తకాలు పంపవలసిన చిరునామా: శివేగారి చిన్నికృష్ణ, కాలువపల్లి (గ్రామం), ఇంటి నంబరు 1-76, **M.P** కొటూరు (పోస్ట్), పలమనేరు (మండలం), చిత్తూరు జిల్లా, పిన్‌కోడ్: 517408, ఇతర వివరాలకు 6300318230 ద్వారా సంప్రదించవచ్చును. ♦

## పాలకొల్లులో జాషువా జయంతి



పాలకొల్లులో అక్టోబర్ 5న జాషువా జయంతి సభ జరిగింది. ఈ కార్యక్రమంలో ఉభయ గోదావరి జిల్లాలో శాసనమండలి సభ్యులు ఐ. వెంకటేశ్వర రావు ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. యుటిఎఫ్, జనవిజ్ఞాన వేదిక, సాహితీస్రవంతి సంయుక్తంగా నిర్వహించిన ఈ సభలో సాహితీస్రవంతి పాలొకల్లు కన్వీనర్ వి. శ్రీరామమూర్తి, ఎ.కె.యు. రామభద్ర, మంచెం వెంకటేశ్వర్లు, శ్రీనివాసన్, కె. రాజశేఖర్ తదితరులు పాల్గొన్నారు. ♦

## యురేనియం తవ్వకాలకు వ్యతిరేకంగా జనకవనం..



యురేనియం తవ్వకాలకు వ్యతిరేకంగా నల్లమలను కాదు.. నల్లధనాన్ని తవ్వు .. పేరుతో సాహితీ స్రవంతి కర్నూలు జిల్లా కమిటీ నగరంలోని పింగళిసూరన తెలుగుతోటలో సెప్టెంబర్ 30 న జనకవనం నిర్వహించింది. ఈ కవిసమ్మేళనానికి సాహితీ స్రవంతి జిల్లా అధ్యక్షులు జంధ్యాల రఘుబాబు అధ్యక్షత వహించారు. అధ్యక్షోపన్యాసం చేస్తూ యురేనియం తెలుగురాష్ట్రాల పాలిట పంజా విసిరిందని దీన్ని అడ్డుకోవలసిందేనన్నారు. ఈ సమావేశానికి ముఖ్యఅతిథిగా సందేశమిచ్చిన ప్రముఖకవి జి.వెంకటకృష్ణ మాట్లాడుతూ మానవజాతి నాశనానికి కుట్రజరుగుతుందని దీనివెనుక వేలకోట్ల కార్పోరేట్ వ్యాపారం జరుగుతుందన్నారు. యురేనియం తవ్వి మనదేశానికి ఆర్థిక వ్యవస్థను బలోపేతం చేసుకునేందుకు కాదని, అణ్వాయుధాలు, అణ్వస్త్రాలు తయారు చేసి ఇతర దేశాలకు అమ్మి ప్రపంచశాంతికి విఘాతం కల్పించడమే అన్నారు. విశిష్ట అతిథిగా హాజరైన రచయిత, నంది అవార్డు గ్రహీత పత్తిఓబులయ్య మాట్లాడుతూ యురేనియం తవ్వకాలు మానవుల పాలిట ఉరేనని అది ఉ రేనియం అన్నారు. సభలో యురేనియం తవ్వకాలకు వ్యతిరేకంగా పద్యాన్ని ఆలపించారు. సాహితీ స్రవంతి జిల్లా ప్రధానకార్యదర్శి కెంగార మోహన్ మాట్లాడుతూ యురేనియం తవ్వకాల వల్ల జరిగే ప్రమాదాలు నష్టాలు, ప్రాణాంతక వ్యాధులు అన్నింటినీ కవులు అధ్యయనం చేయాలని అన్నారు. కార్పోరేట్ వ్యాపారాలకు ప్రభుత్వాలు కొమ్ము కాస్తున్నాయన్నారు. జనకవనంలో కవులు కల్యాణదుర్గం స్వర్ణలత, గోరెడ్డి హరిశ్చంద్రారెడ్డి, పెరికల రంగస్వామి, సయ్యద్ జహీర్ అహ్మద్, ఆవుల చక్రపాణి యాదవ్, చౌశా, కవిత వెంకటేశ్వర్లు, సక్కిరి భాస్కర్, గద్వాల సోమన్న, ఏ.నాగేశ్వరరావు, పులిచేరి మహేష్‌కుమార్, డా.దండెబోయిన పార్వతి, కొప్పుల ప్రసాద్, యు.సుబ్బన్న, జి.నరేంద్ర, కురుకుంద రవిప్రకాష్‌లు కవితా నిరసనలు వినిపించారు. సభలో పెరికల రంగస్వామి రాసిన యురేనియం వ్యతిరేకగీతాన్ని ప్రజానాట్యమండలి జిల్లా అధ్యక్షులు యం.పి బసవరాజు ఆలపించారు. ♦

---

**స్పందన** *సాహిత్య ప్రస్థానం అక్టోబర్ సంచికలో ప్రచురితమైన కాశీవరపు వెంకట సుబ్బయ్య గారి 'మల్లక్క కయ్య' కథ పై నా చిన్న రెవ్యూ......*

కథలు సహజంగా నిజ జీవితానికి అద్దం పట్టేలా ఉండాలి. పాఠకుల నాడిని పట్టి ఉంచాలి అన్నది నా ఆలోచన. అలాంటి కోవకి చెందిన కదే 'మల్లక్క కయ్య' కాశీవరపు వెంకట సుబ్బయ్య గారి కథ. ప్రారంభం నుండి చివరి వరకూ ఊపిరి పట్టి చదివించిన శైలి. ఎంచుకున్న కథనం కూడా గొప్ప సామాజిక పరమైనది. కథ రాయటంలో ఎక్కడా తొందర పడకుండా, ఒక్కో అంశాన్ని నింపాదిగా సాగించారు రచయిత. సూరన్న పుల్లారెడ్డి జీతగాడు. అతని భార్య మల్లక్క. మల్లక్క గొప్ప ఆత్మాభిమానం ఉన్న మనిషి. పుల్లారెడ్డి అందరి ముందు అవమానంగా మాట్లడిన వైనాన్ని తట్టుకోలేని మల్లక్క అందరూ పనిచేస్తున్న వరి చేనులో దిగకుండా ఒక్కతే పక్కనే ఉన్న ఎకరా దొంపులో దిగి ఏకధాటిగా పనిచేసుకుంటూ సూర్యాస్తమయాన్ని కూడా లెక్కచేయలేదు.ఎందరు చెబుతున్నా వినకుండా తనపని తను తలదించుకొని చేసింది. తనలోని చివరి ఊపిరి వరకూ పనిచేసి గర్వంగా తుదిశ్వాస విడిచి పెట్టింది. పుల్లారెడ్డికి మల్లక్క తత్వం తెలుసు. నోరు జారినందుకు ఎంతో బాధపడి వారించాడు. ఆత్మాభిమానం దెబ్బతిన్నాక ఎవరి మాట వినలేనిస్థితి మల్లక్కది కూడా. అయితే ఇక్కడ పుల్లారెడ్డి తన తప్పు తెలుసుకొని ప్రాదేయ పడటం, మంచి మనసుతో ఆ ఎకరం పొలాన్ని మల్లక్క పేరున సూరన్న కివ్వటం గొప్ప మార్పు. కథలో గొప్ప నీతి అందించారు రచయిత. తొందరపడి నోరుజారితే ఒక జీవితం, ఒక కుటుంబం నాశనమైపోవటమే కాదు జీవితంలో తీరని శోకాన్ని సొంతం చేసుకున్నాడు పుల్లారెడ్డి. ఎంత చేసినా తిరిగి ఇవ్వలేడు మల్లక్కని. మల్లక్క పౌరుషంతో తీసుకున్న నిర్ణయం వల్ల తన పిల్లల్ని భర్తని అనాధల్ని చేసే నిర్ణయం బాధాకరం బాధ్యతా రాహిత్యం. అయితే చాలా సార్లు మనసుకు తగిలే గాయం అలాంటి స్థితికి గురిచేస్తోంది. సహజంగా జీవిత సన్నివేశాలు ఇలానే ఉంటాయి. ఎవరినీ తప్పు పట్టలేం. జీవితం అలాంటి సన్నివేశాల సమూహమే...అయినా కాసేపు స్థిమితంగా ఆలోచించాలి ..ఏదిఏమైనా కథ చాలా ఉద్విగ్నతకు, బాధకు గురిచేసింది.

**- సర్వమంగళ, కలకత్తా - 918240497942**

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**

SAHITYA PRASTHANAM RNI N0.APTEL/2004/18396 Postal Regd. No.VJ/187/2017-19
Date of Posting : 1st &2nd of Every Month ▪ Date of Publication: 28.10.2019



If Un delivered please return to: Prasthanam, C/o M.B. Vignana kendram, 27-30-4, 3rd Floor
Akulavari veedhi, Governorpet, Vijayawada - 520002. Ph: 0866-2577248, Cell: 9490099059



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA102M333 |
| పుస్తకం పేరు | సాహిత్య ప్రస్థానం |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 64 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | madhu |
| పేజీలు విడదీసినది | MADHU |
| స్కాన్ చేసినది | rDaveed |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |